# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 8 సంచిక : 9 హైదరాబాద్ 110 సెప్టెంబర్ 2010 పేజీలు : 60 రు. 10

* ఫోకస్ : ఎక్సైజ్ విధానానికి ప్రత్యామ్నాయం ?
* సోహ్రాబుద్దీన్ ఎన్‌కౌంటర్ నిజానిజాలు
* అక్రమాల పుట్ట కామన్‌వెల్త్ గేమ్స్
* వికీ లీక్స్ - నియంతృత్వ ప్రభుత్వాలకు సవాల్
* అభివృద్ధి-హింస : రెండు దృక్పథాలు
* ఏది సరైన భారత విప్లవ మార్గం?
* వెనిజులా కమ్యూనాలు - కిందినుంచి సోషలిజం

# వీక్షణం విస్తరించడానికి సహకరించండి!
# మీ మిత్రులందరికీ పరిచయం చేయండి!!
# మీ వంతుగా చందాలు చేర్పించండి!!

వీక్షణం రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికకు ఎనిమిది సంవత్సరాలుగా మీరు అందిస్తున్న ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు. మీ నిత్యజీవితంలో, కుటుంబ సభ్యులతో, పని స్థలంలో, స్నేహితులతో, భిన్నాభిప్రాయాలున్న వారితో మాట్లాడుతున్న ప్రతి సంధర్భంలోనూ వీక్షణంలోని వ్యాసాలు, అభిప్రాయాలు మీకు ఉపయోగపడతూనే ఉన్నాయి. ఈ పత్రిక నిలదొక్కుకుని పది కాలాలపాటు నిలబడాలని మీరు కోరుకుంటున్నారని మాకు తెలుసు. తెలుగు సమాజానికి అవసరమయిన విభిన్న ఆలోచనలను అందించే పత్రికగా వీక్షణం ఇంకా విస్తరించాలని కూడా మీరు కోరుకుంటూ ఉంటారు. కాని, వీక్షణం ఆర్థిక పరిస్థితి సుస్థిరంగా లేదు. వీక్షణంను నిలబెట్టడానికి మీరు తక్షణమే పూనుకుని చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి.

- ❖ మీ బంధుమిత్రుల దగ్గర, మీ పనిస్థలంలో, మీరు మాట్లాడే ప్రతిచోటా, సామాజిక రాజకీయ విషయాల చర్చ వచ్చిన ప్రతిచోట ఆ విషయాల మీద వీక్షణం అవగాహన కలిగిస్తుందని ప్రస్తావించండి. వీక్షణం చదవడం ఎంత అవసరమో చెప్పండి.
- ❖ మీ చందా చెల్లించడంతోపాటు, మీ మిత్రుల కొరకు కానుకగా చందా చెల్లించండి. వారిని చందా చెల్లించమని కోరండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న గ్రంథాలయానికి వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని తెప్పించడానికి ప్రయత్నాలు చేయండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న విద్యాలయాలలో, కళాశాలలో, ముఖ్యమైన ప్రభుత్వ, ప్రభుత్వేతర కార్యాలయాలలో, స్వచ్ఛంద సంస్థల, యువజన సంస్థల కార్యాలయాలలో వీక్షణం వస్తుందో లేదో కనుక్కుని వారిచేత చందాలు కట్టించండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న వీక్షణం శ్రేయోభిలాషులు, విద్యా సంస్థల నిర్వాహకులు, వ్యాపారవేత్తల దగ్గర వీక్షణంకు ప్రకటనలు సేకరించండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో ఉన్న పత్రికల ఏజెంటు వీక్షణం తెప్పిస్తున్నారో లేదో కనుక్కుని తెప్పించేలా చూడండి.

## చందా వివరాలు

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | **రు. 15** |
| సంవత్సరం | **రు. 180** | **రు. 150** | **రు. 120** |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | **రు. 350** |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

**వీక్షణం అకౌంట్ నెంబర్ – 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్**

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

110

వీక్షణం
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

సెప్టెంబర్ 2010
సంపుటి : 8
సంచిక : 9

గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

వీక్షణం అకౌంట్ నెంబర్ –
**013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

**డిస్ట్రిబ్యూటర్స్**
**ఆనంద్ ఏజన్సీస్, హైదరాబాద్.**
ఫోన్ : 98484 28516
92468 26191

**ప్రింటర్స్**
**చరితా ఇంప్రెషన్స్,**
**ఆజామాబాద్, హైదరాబాద్**
ఫోన్ : 040 - 27678411

## సంపాదకీయం

# ఎ.పి.ఐ.ఐ.సి. - ఎమార్ - ఎం.జి.ఎఫ్. భూ కుంభకోణం

రైతులనుంచీ, సామాజిక ఉమ్మడి ఆస్తులనుంచీ అడ్డగోలుగా వేలాది ఎకరాల భూమిని సేకరించడం, సేకరించిన భూములను ఇష్టారాజ్యంగా ఆశ్రితులకూ, సంపన్నులకూ కట్టబెట్టడం, తామే రాసుకున్న చట్టపరమైన నిబంధనలను కూడ పాటించకపోవడం పాలకులకు నిత్యకృత్యమైపోయింది. ఇటీవల బయటపడుతున్న ఎమార్ – ఎంజిఎఫ్ కుంభకోణం ఈ పాలకుల మహా అక్రమాలకు మరొక నిదర్శనం. అధికారంలో ఉన్న స్వార్థప్రయోజన శక్తులు, పాలక ముఠాలు, అభివృద్ధి సాధించడానికనే పేరుతో ఏర్పాటయిన ప్రభుత్వ రంగ సంస్థలు కలిసి సాగిస్తున్న మూకుమ్మడి దోపిడీ ఇది. ఈ శక్తులు అధికారాన్ని అడ్డుపెట్టుకుని ప్రైవేటు పెట్టుబడిదారులతో, వ్యాపారులతో ఎలా కుమ్మక్కయ్యాయో, ఈ ఇద్దరు దొంగలూ కలిసి ఊళ్లకు ఊళ్లు ఎలా పంచుకు తిన్నారో ఈ ఉదంతం, దీనికి అనుబంధంగా బయటపడుతున్న వివరాలు తెలియజెపుతున్నాయి. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనేది కొనసాగుతుంటే ఇటువంటి అక్రమాలను బయటపెట్టవలసిన బాధ్యత ప్రతిపక్షాలకు, ప్రచార సాధనాలకు ఉండేది. కాని ప్రతిపక్ష నేతలకూ, వారి ఆశ్రితులకూ కూడ ఈ అక్రమాలలో భాగం ఉంది. వారూ ఆ తానులో ముక్కలే. రాష్ట్రంలో ఇవాళ ఉన్న స్థితిలో ప్రచార సాధనాలు తమ ముఠా ప్రయోజనాలకోసం తప్ప, ఇటువంటి అక్రమాలను బయటపెట్టే పరిస్థితి లేదు. చివరికి పాలకవర్గ ముఠా కీచులాటలవల్ల, వాటాల తగాదా వల్ల ఈ వ్యవహారాలు బయటపడి తీగలాగితే డొంక కదులుతోంది. ఎమార్ ప్రాపర్టీస్ పిజెఎస్‌సి అనే 1997లో ప్రారంభమైన దుబాయి కంపెనీ ఆంధ్రప్రదేశ్‌లో 2002లోనే ప్రవేశించి ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్ (ఎపిఐఐసి) దగ్గర 285 ఎకరాల భూమి సంపాదించింది. ప్రస్తుతానికి ఆ కంపెనీ అవతారం మారిపోయింది. రియల్ ఎస్టేట్‌లోనూ, రుణాలిచ్చే వ్యాపారంలోనూ ఉన్న ఢిల్లీకి చెందిన ఎంజిఎఫ్ అనే కంపెనీతో కలిసి 2005లో ఏర్పడిన ఎమార్ ఎంజిఎఫ్ అనే కొత్త కంపెనీకి ఈ ఆస్తులన్నీ చేరిపోయాయి. ఒక ప్రభుత్వ సంస్థతో ఒప్పందం చేసుకుని భూమి సంపాదించిన కంపెనీ, ఆ ప్రభుత్వ సంస్థ అనుమతి గానీ, కనీసం సమాచారంగానీ లేకుండా మరొక కంపెనీతో కలిసిపోయి, కొత్త కంపెనీకి తన ఆస్తులు బదిలీ చేయవచ్చునా అనే ప్రశ్నకు తావులేదు. ఈ కొత్త కంపెనీ లోగోలో 'క్రియేటింగ్ న్యూ ఇండియా' అని ఉపశీర్షిక ఉంటుంది. కొత్త భారతదేశాన్ని సృష్టించడం అంటే ఇప్పటికే భారతదేశంలో ఉన్న మనుషులను తొలగించడం, వారి ఆస్తులను, వనరులను కొల్లగొట్టడం, చట్టాలను లెక్కచేయకపోవడం, ప్రభుత్వాలను తనకు బానిసలుగా చేసుకోవడం అని అర్థం. ఈ కొత్త కంపెనీలో ఎపిఐఐసి వాటా మొదట తగ్గిపోయి, ఆ తర్వాత సున్నా అయిపోయింది. కాని ఆ కంపెనీ చేతిలో భూమి మాత్రం 535 ఎకరాలకు పెరిగిపోయింది. ఈ వ్యవహారంలో మొట్టమొదట ప్రశ్నించవలసింది ఎపిఐఐసికి ఈ భూసేకరణ వ్యవహారం ఎందుకు అని. ఎపిఐఐసి అనేది రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి అవసరమైన మౌలిక సౌకర్యాలు కల్పించడానికి ఏర్పడిన ప్రభుత్వ సంస్థ. అది రియల్ ఎస్టేట్ వ్యాపారం చేయవలసిన అవసరమే లేదు. కాని పారిశ్రామికాభివృద్ధి కోసం భూమి సేకరిస్తున్నాననే బూటకపు ప్రకటనలతో అది వేలాది ఎకరాల ప్రభుత్వ, ఉమ్మడి భూమినీ, రైతుల సొంత భూములనూ కూడ తన ఖాతాలోకి చేర్చుకుంది. ఆ భూమిని దేశదేశాల సంపన్నులకు కారుచౌకధరలకో, తన వాటా కొనసాగుతుందనే పేరుతో ఉచితంగానో కట్టబెడుతోంది. ఒక అంచనా ప్రకారం 2004–05 నుంచి 2008–09 మధ్య నాలుగు సంవత్సరాలలోనే ఎపిఐఐసి రైతులనుంచి ఇరవై వేల ఎకరాలు, ప్రభుత్వం నుంచి డెబ్బైమూడు వేల ఎకరాలు సేకరించి బహుశా రాష్ట్రంలో అందరికన్న పెద్ద భూస్వామి అయింది. ఈ భూమిని సేకరించినదేమో రాష్ట్ర పారిశ్రామికాభివృద్ధి కోసం అనే పేరు మీద. కాని చేసినదేమో ఈ భూమినుంచి అడిగినవారికి అడిగినంత ధారాదత్తం చేయడం. అడిగినవారంటే ప్రజలు కాదు, భూమి కావలసిన వారు కాదు. నివాసం కోసం వందగజాల భూమి కావాలంటే, తమ బతుకు తాము బతకడానికి ఎకరమో రెండెకరాలో ఇమ్మంటే ఇవ్వకపోగా కాల్పులు జరిపి ప్రాణాలు బలిగొంటున్న పాలన ఇది. కాని రాజకీయ నాయకులో, వారి ఆశ్రితులో, బహుళజాతిసంస్థలో, రియల్ ఎస్టేట్ కంపెనీలో అడిగితే చాలు, అది పరిశ్రమ అవునాకాదా, అది అభివృద్ధేనా కాదా అనే ప్రశ్న కూడ లేకుండా వేలాది ఎకరాలు ఎపిఐఐసి నుంచి పొందవచ్చు. ఇలా పారిశ్రామికాభివృద్ధి అనే పచ్చి అబద్ధంతో వేలాది ఎకరాల భూములు సంపన్నుల సొంత ఆస్తులుగా మారిపోతున్నాయి. ఈ భయంకరమైన బందిపోటు దొంగతనంలో ఎమార్ ఎంజిఎఫ్ వంటి దొంగవ్యాపారులూ, మధ్య దళారీలూ, రాజకీయ నాయకులూ తమతమ పాత్రలు పోషిస్తున్నారు. మన సామాజిక ఆస్తులను, వనరులను కొల్లగొడుతున్నారు. ఇప్పుడు ఈ ఉదంతం బయటపడిన తర్వాత కూడ దానిలో ఇమిడి ఉన్న లంచగొండితనం గురించో, చట్టాల ఉల్లంఘనల గురించో చర్చ జరుగుతోంది. కాని అడగవలసిన మౌలిక ప్రశ్న అసలు మన ప్రజల సామాజిక ఆస్తులను కొల్లగొట్టే ఈ అధికారం ప్రభుత్వాలకూ పాలకులకూ సంపన్నులకూ ఎక్కడిదని. ప్రస్తుతం కొనసాగుతున్న ఈ దోపిడీ పాలన ప్రజలకు మేలు చేస్తుందని, ప్రజాప్రాతినిధ్యంతో సాగే ప్రజాస్వామ్యమని ఇంకా ఎవరైనా నమ్ముతుంటే ఇటువంటి ఉదంతాలు ఆ నమ్మకాన్ని తుత్తునియలు చేస్తాయి.

వీ

## కామన్‌వెల్త్ క్రీడలు అవసరమా?

'దేశంలో కరువు విలయ తాండవం చేస్తోంది. ప్రజలకు తినడానికి రొట్టె కూడ దొరకడం లేదు' అని చెప్తే ఫ్రెంచి యువరాణి, ఆ తర్వాత పదహారో లూయీని పెళ్లాడి మహారాణి అయిన మేరీ ఆంటోనెట్ 'అయితే కేకులు తినవచ్చుగదా' అందట. పేదరికం గురించీ ఆకలి గురించీ తన నిర్లక్ష్యాన్నీ అజ్ఞానాన్నీ చాటుకున్నదట. మహోఘనత వహించిన ప్రజాస్వామిక, సర్వసత్తాక భారత ప్రభువులు ఆ పద్దెనిమిదో శతాబ్దపు ఫ్రెంచి పాలకురాలికన్న దుర్మార్గులమని చూపదలచుకున్నట్టున్నారు. ఒకవైపు కోట్లాదిమంది భారత ప్రజలు దారిద్ర్యంతో, ఆకలిచావులతో, ఆత్మహత్యలతో, అధికధరలతో సతమతమైపోతూ ఉంటే, వెయ్యి రూపాయలకూ వంద రూపాయలకూ కూడ మొఖం వాచిపోతూ ఉంటే, అక్షరాలా ముప్పైవేల కోట్ల రూపాయలు బూడిదలో పోయడానికి భారత ప్రజాస్వామిక ప్రభువులకు కనీసం సిగ్గనిపించడంలేదు. కేవలం 72 దేశాలకు చెందిన ఓ పదివేల లోపు క్రీడాకారులు పన్నెండు రోజులపాటు ఢిల్లీలో పదిహేడు ఆటలలో తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శించి, పోటీపడి ఆ ముప్పైవేల కోట్ల రూపాయలు తగలేయబోతున్నారు. ఇక ఈ నిధుల కేటాయింపులో, ఖర్చులో ఉన్న అక్రమాలు సరేసరి. నిజానికి భారతదేశం ముందర ఉన్న ప్రాధాన్యతలలో ఈ క్రీడల నిర్వహణ మొదటిస్థానంలో ఉండవలసిన అవసరం లేదు. ఇవాళ్టికివాళ భారత సమాజం ముందర ఉన్న ఏ ప్రధాన సమస్యను నిజంగా పరిష్కరించదలచినా ఇంతకన్న తక్కువ నిధులతోనే సాధ్యమవుతుంది. నిధుల కొరత పేరుతో పక్కన పెడుతున్న ఏ అభివృద్ధి పథకాన్ని చేపట్టినా, నీటిపారుదల సౌకర్యాలు కల్పించినా, విద్యాలయాలో, ఆసుపత్రులో, పరిశ్రమలో ఏర్పరచినా అవి ఉత్పాదక ఆస్తులుగా మారి, ప్రస్తుత జీవనోపాధిని పెంచడం మాత్రమే కాదు, భవిష్యత్తు ఆదాయాలకు ఉపయోగపడతాయి. పోనీ, దేశపు యువతలో క్రీడాస్ఫూర్తిని పెంపొందించాలనీ, క్రీడా సౌకర్యాలు మెరుగుపరచాలనీ ఈ పాలకులకు ఆసక్తే ఉంటే, ఈ ఖర్చులో పదో వంతుతో గ్రామీణ స్థాయి నుంచి చేయవలసిన పనులెన్నో ఉన్నాయి. దేశీయ క్రీడలలో ప్రోత్సాహం కరువై నశించిపోతున్నవీ, కునారిల్లుతున్నవీ ఎన్నో ఉన్నాయి. పాఠశాలల్లో, గ్రామీణ, చిన్నపట్టణాల, జిల్లాకేంద్రాల స్థాయిలో క్రీడాకారులు అవసరమైన సౌకర్యాలు లేక, క్రీడామైదానాలూ క్రీడాపరికరాలూ లేక తమ ఉత్సాహాన్ని తమలోనే దిగమింగుకుంటున్నారు. లేదా, ప్రభుత్వమూ బహుళజాతిసంస్థలూ ప్రోత్సహిస్తున్న ఏకైక గుత్తాధిపత్య క్రీడ క్రికెట్ వైపు చూస్తున్నారు. ఇటువంటి స్థితిలో తలపెట్టిన కామన్ వెల్త్ క్రీడలలో సాగుతున్న అవినీతి గురించి, పెద్దమొత్తంలో దుర్వినియోగమవుతున్న నిధుల గురించి వార్తలు వస్తున్నాయి. ఆ దుర్వినియోగం జరగకపోయినా అసలు ఈ ఆటలు అవసరమా అని అడగవలసి ఉంది.

## నేపాల్‌లో ఏం జరుగుతోంది?

పది సంవత్సరాల సాయుధ పోరాటంతో అసాధారణ విజయాలు సాధించి, ప్రపంచ దృష్టిని ఆకర్షించి, ప్రభుత్వాధికారాన్ని కూడ చేపట్టిన నేపాల్ ప్రజా విప్లవోద్యమం ఒడిదుడుకుల బాటన పడింది. పార్లమెంటులోని 599 మంది సభ్యులలో కనీసం 300 మంది సభ్యుల మద్దతు కూడగట్టి ప్రధానమంత్రి కావడానికి మావోయిస్టు నాయకుడు ప్రచండ చేస్తున్న ప్రయత్నం నాలుగుసార్లు ఓటమి పాలయి, సెప్టెంబర్ 5న ఐదోసారి మరొక పరీక్షను ఎదుర్కోబోతోంది. యునిఫైడ్ కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ నేపాల్ (మావోయిస్టు) సభ్యులు 238 మంది, నేపాలీ కాంగ్రెస్ సభ్యులు 114 మంది, కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ నేపాల్ (యునైటెడ్ మార్క్సిస్ట్ లెనినిస్ట్) సభ్యులు 109 మంది ఉన్న ఈ పార్లమెంటులో ఏ ఒక్క పార్టీకీ ఒంటరిగా మెజారిటీ ప్రభుత్వాన్ని స్థాపించే శక్తి లేదు. 85 మంది దాకా ఉన్న మధేసి జాతీయ పక్షాల సభ్యులు మావోయిస్టులకు మద్దతు ఇచ్చే పరిస్థితి లేదు. అంటే అధికారం కావాలంటే మావోయిస్టులు కూడ అంకెల గారడీలో, కప్పల తక్కెడ రాజకీయాలలో పడకతప్పదు. వేలాదిమంది విప్లవకారులు, ప్రజలు హత్యలకూ నిర్బంధానికీ గురయినప్పుడు కూడ ఓడిపోని విప్లవం, ఐదు సంవత్సరాల పార్లమెంటరీ కుషన్ సీట్లలో, అధికార కాంక్షల ఎత్తుగడలలో పడి వేగంగా ఓటమి దిశగా పయనిస్తోంది. భూయాజమాన్యంలో అసమానతలు, కుల అణచివేత, జాతుల అణచివేత, వెనుకబాటుతనం, పొరుగున ఉన్న భారత ప్రభుత్వపు పెత్తందారీతనం వంటి నిజమైన సమస్యలను పరిష్కరించి, ప్రజా ప్రత్యామ్నాయ అధికారాన్ని స్థాపించాలనే ఆకాంక్ష పక్కకు పోయి, పార్లమెంటులో అవతలి అభ్యర్థికన్న ఎక్కువ వోట్లు తెచ్చుకోవడం ఎట్లా అనే ఏకైక సూత్రం చుట్టూ ఇవాళ నేపాల్ ప్రజా ఉద్యమం తిరుగుతోంది. ఇరవై ఒకటో శతాబ్దపు సోషలిజాన్ని నిర్మిస్తున్నామనే వాగ్దానం చేసిన వారికైనా గుర్తుందో లేదో తెలియని స్థితి ఏర్పడింది. గత దశాబ్దం చివరిలో ప్రపంచ పీడిత ప్రజల ఆశాజ్యోతిగా నిలిచిన నేపాల్ విప్లవం తిరోగమన మార్గం పట్టిందని ఇప్పుడే నిర్ధారించడం తొందరపాటు కావచ్చు. కాని అది పురోగమన మార్గంలో ఉన్నదని కూడ నిర్ధారించడానికి వీలు లేదని అనేక సూచనలు చెపుతున్నాయి. నిజానికి ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద దుర్మార్గాలూ, అభివృద్ధి నిరోధక ప్రభుత్వాల అక్రమాలూ అంతకంతకూ ఎక్కువగా వెల్లడవుతూ, ప్రపంచం ముందర సోషలిజం తప్ప మరొక ప్రత్యామ్నాయం లేదని తెలిసివస్తున్న ఇవాళ్టి సందర్భంలో ఆ సోషలిజాన్ని సాధించే మార్గాల గురించి ఇంకా లోతయిన చర్చ, ఆచరణ అవసరమని నేపాల్ అనుభవం నేర్పుతున్నది. పార్లమెంటరీ మార్గం ఒక చిన్న ప్రాతినిధ్య బృందానికి అధికారం ఇవ్వడానికే తప్ప ప్రజాభాగస్వామ్యపు నిజమైన ప్రజాస్వామ్యం సాధించడానికి పనికిరాదని మూడు శతాబ్దాల ప్రపంచ చరిత్ర చెపుతుండగా నేపాల్ మళ్లీ ఆ దారి పట్టింది. సాయుధపోరాటం ఆధిపత్య శక్తులను చికాకు పరచడానికీ, అక్కడక్కడ దెబ్బతియ్యడానికీ, అధికారం సాధించడానికీ పనికిరావచ్చుగాని, ప్రజల చైతన్యం, భాగస్వామ్యం పెరగడానికీ, ప్రజల సృజనాత్మకత వెల్లివిరియడానికీ పనికి రాకపోవచ్చునని నేపాల్ అనుభవం నేర్పుతున్నది. ఈ పాఠాలను సోషలిజం ఆవశ్యకత పెరుగుతున్న ప్రస్తుత తరుణంలో ప్రపంచ ప్రజలందరూ నేర్చుకోవలసి ఉంది. వీ

### వీక్షణం సంపాదకుడిపై కేసు కొట్టివేత

వీక్షణం సంపాదకుడు ఎన్. వేణుగోపాల్‌ను, అయిదుగురు సహచరులతో (వి. చెంచయ్య, పినాకపాణి, ఎస్. రవికుమార్, గంటి ప్రసాదం, వై.సురేందర్) 2005 మే 30న ఔరంగాబాద్ (మహారాష్ట్ర)లో అరెస్టు చేసి, మూడురోజుల అక్రమ నిర్బంధం తర్వాత, ఔరంగాబాద్ కుట్రకేసు నిందితులుగా 2005 జూన్ 3న నిజామాబాద్ కోర్టులో తప్పుడు కేసులో ఇరికించిన విషయం వీక్షణం పాఠకులకు తెలిసిందే. అయిదు సంవత్సరాల విచారణ తర్వాత నిజామాబాద్ అసిస్టెంట్ సెషన్స్ న్యాయమూర్తి 2010 ఆగస్ట్ 2న ఈ కేసును కొట్టివేస్తూ, నిందితులను నిర్దోషులుగా నిర్ధారిస్తూ తీర్పు ఇచ్చారు.

## లోపలి పేజీల్లో...

### ఫోకస్ : ఎక్సైజ్ విధానానికి ప్రత్యామ్నాయం లేదా?

ప్రభుత్వాలు ఇప్పుడు అమలు చేస్తున్న ఎక్సైజ్ విధానం ప్రజల మేలు కోసం కాదు. అది ప్రజల ఆరోగ్యాలను రక్షించేదీ కాదు, ప్రజా సంక్షేమానికి ఖర్చు చేయడానికి నిధులు కావాలనే పేరుమీద ఆ ప్రజల ఆరోగ్యాలనూ జీవితాలనూ కుటుంబాలనూ గుల్ల చేసి డబ్బులు దండుకునేది. ప్రజలను వ్యసనపరులుగా తమ రాజకీయార్థిక విధానాలను ప్రశ్నించి పోరాడలేని శక్తిహీనులుగా మార్చేది. వారి బలహీనతలను పెంచి పోషించి, వారు మేల్కొని తమ మీద, తమ విధానాల మీద తిరగబడకుండా చేసేది. ఇన్ని లోపాలతో, దురాలోచనలతో, ప్రజావ్యతిరేకంగా ఉన్న విధానానికి తప్పకుండా ప్రత్యామ్నాయం ఉంటుంది, ఉండాలి.



'వీక్షణం'లో అచ్చవుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు.
'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.

### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **పికాసో** – పి. మోహన్, కాకి ప్రచురణలు, 139 పేజీలు, 1/5 క్రౌన్, రు. 60, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **దోపిడీ, పీడన, అణచివేతలకు వ్యతిరేకంగా పెల్లుబికిన కోరాపుట్ ఆదివాసీ ప్రజల పోరాటాలు** – ఎస్. ఝాన్సీ – సి.పి.ఐ. (ఎం.ఎల్.) ప్రచురణ – 36 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ – 2
- **దుఃఖాగ్నుల తెలంగాణ** – ఇక్బాల్, పరిమళ్, ఉదయమిత్ర – పాలమూరు ప్రచురణలు, పాలమూరు అధ్యయన వేదిక, 10 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు : ఇక్బాల్, 6–25, జి.వి. ఎన్‌క్లేవ్, గద్వాల్, సెల్ : 9440775732; పరిమళ్, గ్రా. మాగనూరు, మం. బిజినెపల్లి, సెల్ : 9441081842; ఉదయమిత్ర, 9–25, పాతబజారు, స్టేషన్ జడ్చర్ల, సెల్ : 9985203376
- **మరో మార్క్స్ పుట్టాలె!** – కథలు – ముదిగంటి సుజాతారెడ్డి – విశాలాంధ్ర పబ్లికేషింగ్ హౌస్ – 104 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4–1–435, విజ్ఞాన భవన్, ఆబిడ్స్, హైదరాబాద్ – 500001, ఫోన్ : 24744580, 24535905, www.visalandra.vcomnet.co.in
- **కవిత్వ నిజ స్వభావం** – రోణంకి అప్పలస్వామి రచనల సంపుటి – సంపాదకుడు : డా. మానేపల్లి, 111 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలు, నవోదయ పబ్లిషర్స్
- **మొదట మనం మానవులం, పౌరులం, ఆ తర్వాతే ఉద్యోగులం** – (ఉద్యోగ క్రాంతి ప్రసంగ పాఠం) – వరవరరావు – ఎంప్లాయిస్ కో ఆర్డినేషన్ కమిటీ ఎ.పి., (ఉద్యోగ క్రాంతి) కర్నూలు జిల్లా యూనిట్, 16 పేజీలు, 1/8 డెమీ, రు.5, ప్రతులకు : డి.ఆర్. మంజుల, సీనియర్ డ్రాఫ్ట్స్‌మన్, సర్వే మరియు భూమి రికార్డులు, కర్నూలు – 518002, ఫోన్ : 9849043542; డా. మాధవస్వామి, ఆయుష్ డిపార్ట్‌మెంట్, ప్రభుత్వ హోమియో వైద్యశాల, బి క్యాంపు, కర్నూలు – 518002, ఫోన్ : 9440739795
- **తెలంగాణలో బైరాన్‌పల్లె పోరాటం–1948** – నర్ర భగవాన్‌రెడ్డి – మంజీరా రచయితల సంఘం ప్రచురణ – 30 పేజీలు, 1/8 డెమీ, రు. 12, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, విశాలాంధ్ర బుక్ హౌస్, నవోదయ బుక్ హౌస్, సహచర బుక్ హౌస్
- **అమ్మ ఒడి** – నాటిక – ఎ.వి. మల్లేశ్వరరావు – నవజ్యోతి ఆర్ట్స్ ప్రచురణ, 37 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : నడుస్తున్న చరిత్ర, మాచవరం, విజయవాడ – 4; నవోదయ బుక్ హౌస్, నవోదయ పబ్లిషర్స్, విశాలంధ్ర అన్ని బ్రాంచీలు
- **ఒకే ఒక్క సిరాచుక్క** – నానీలు – సరికొండ నరసింహరాజు – సృజన ఆర్ట్స్ అకాడమి ప్రచురణలు, 114 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : శ్రీమతి లలితాంబ, సి/ఓ. డి. రామరాజు, ఇ.నెం. 6–116, 8/4, బస్ డిపో దగ్గర, జగ్గయ్యపేట – 521175, కృష్ణా జిల్లా; నవోదయ బుక్ హౌస్, నవోదయ పబ్లిషర్స్, ప్రజాశక్తి బుక్ హౌస్, విశాలాంధ్ర బుక్ హౌస్, అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో
- **వినదానికో మనిషి** – సామర్ల రమేష్ – నీత్ బుక్స్ ప్రచురణ – 108 పేజీలు, 1/8 డెమీ, రు. 50, ప్రతులకు : నీత్ బుక్స్, 12–3/5, ప్లాట్ నెం. 1, పాంచజన్య, తడంబెల్, సురత్కల్, మంగళూరు, కర్నాటక; ఫోన్ : 0824 – 2236577








'సమైక్యాంధ్ర' నినాదానికి ప్రత్యామ్నాయంగా 'తెలుగుజాతి' అనే ముసుగు పదంతో బాబ్లీపై తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబునాయుడు నిర్వహించిన కవ్వింపు దాడి వెనుక ఉన్న కుటిల బుద్ధిని, ఆ పార్టీకి చెందిన తెలంగాణ నాయకుల వేళ్లతో తెలంగాణ కన్నును పొడిచే తీరును 'వీక్షణం' ఆగస్ట్ 2010 సంచికలో ప్రచురితమైన 'బాబ్లీ ప్రజాస్వామిక పరిష్కారం' వ్యాసంలో రచయిత శ్రీధర్‌రావు దేశ్‌పాండే పాఠకులకు అర్థమయ్యే విధంగా వివరించారు. రచయిత నీటి పారుదల శాఖలో సంపూర్ణ అవగాహన, అనుభవం గడించిన ఇంజనీరుగా, మేధావిగా, ప్రజాసమస్యల పట్ల బాధ్యతగల వ్యక్తిగా ప్రస్తుత దశలో బాబ్లీ సమస్య సున్నితత్వాన్ని, ఇరుప్రాంతాల (మహారాష్ట్ర, తెలంగాణ) ప్రజల మధ్య నెలకొని ఉన్న సుదీర్ఘకాల సత్సంబంధాలను, ఇరుప్రాంతాల ప్రజల శ్రేయస్సును, సంక్షేమాన్ని సమానంగా దృష్టిలో పెట్టుకుని సూచించిన సమస్య పరిష్కార మార్గాలు అభినందనీయం.

వాస్తవానికి చంద్రబాబు నాయుడు బాబ్లీపై చేపట్టిన సందర్భరహిత పోరాటం ఏ ప్రజల ప్రయోజనాల కోసమో అనే విషయం పూర్వాపరాలు తెలిసిన కనీసస్థాయి ఆలోచనాపరులకు కూడా అర్థం కానిది. ముఖ్యమంత్రిగా, శాసనసభలో ప్రతిపక్ష నేతగా, జాతీయస్థాయి నాయకుడిగా, ప్రజాక్షేత్రంలో అత్యున్నత బాధ్యతాయుత హోదాలో ఉన్న వ్యక్తిగా సుదీర్ఘకాలం పాటు బాబ్లీపై జరుగుతున్న అక్రమ నిర్మాణం పూర్తయ్యేంత వరకూ ప్రత్యక్ష సాక్షిగా మౌనంగా నిలిచిన చంద్రబాబు అకస్మాత్తుగా, కళ్లు మూసుకుని పాలు తాగుతూ నన్నెవరూ చూడట్లేదనుకునే పిల్లి మాదిరిగా, అక్రమ నిర్మాణ దుష్ఫలితాలు, దుష్పరిణామాలు (తెలంగాణలో జరుగుతున్న ఆత్మగౌరవ ఉపఎన్నికల సమయంలోనే) ఓ రాత్రి కలలోకొచ్చి తట్టి లేపినట్లుగా వ్యవహరించిన తీరు, మతలబు బుద్ధిజీవులందరికీ అర్థమయ్యేట్టుగానే ఉన్నాయి.

అనంతరం మహారాష్ట్ర ప్రభుత్వం చేతిలో చావుదెబ్బలు తిన్న తీరు, ఆ అవమానాన్ని ఓ ఘనవిజయంగా ప్రసార మాధ్యమాల ద్వారా పదేపదే కళ్లకు అద్దినట్టుగా ప్రజలకు చేరవేసిన తీరు, తద్వారా సాధ్యమైనంత సానుభూతిని కూడగట్టుకుని సమైక్యవాదులకు కానుకగా ఉపఎన్నికలలో లబ్ధి పొందేందుకు చేసిన అత్యాశాయత్నం, కుటిలనీతి అన్నీ క్షుణ్ణంగా అర్థమయ్యేట్టుగానే ఉన్నాయి.

తెలంగాణ సెంటిమెంట్‌తో జరిగిన ఉపఎన్నికలలో దిశానిర్దేశం లేకుండా బరిలోకి దిగిన తమ అభ్యర్థుల తరఫున ప్రచారానికి ముఖం చెల్లక చివరకు గమ్యస్థానానికి (ఎన్నికల సమరంలోకి) పరోక్షంగా, నైతికంగా, సులభంగా చేరుకోవడానికి చంద్రబాబు ఎంచుకున్న బాబ్లీ అనే పిల్లబాట ఆద్యంతం ముళ్లబాటగా దాపురించింది. తెదేపా బాబ్లీ డ్రామా గురిపెట్టిన లక్షిత ప్రజలు మాత్రం చివరకు ఆ పార్టీ అభ్యర్థులకు ఉపఎన్నికలలో ధరావతును గల్లంతు చేసారు. ప్రపంచానికి తెలంగాణ సెంటిమెంట్‌ను గొంతెత్తి చాటారు.

తెలుగుదేశం పార్టీ చరిత్రలో ఘోరపరాజయం చవిచూసింది. అయితే పరాజయాల నుంచి, పరాభవాల నుంచి గుణపాఠం నేర్చుకునే నైజం చంద్రబాబుకు ఆది నుంచీ లేదనేది సుస్పష్టం. చంద్రబాబు అధికార దాహం ముందు ప్రజల ఆకాంక్షలు, మనోభావాలు, కష్టాలు, కన్నీళ్లు దిగదుడుపే. ఇందుకు ఉదాహరణగా, 2003 అక్టోబర్‌లో రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్న చంద్రబాబుపై అలిపిరిలో నక్సలైట్లు హత్యాయత్నం జరిపినప్పుడు రాష్ట్ర రైతాంగం తీవ్ర సంక్షోభంలో కూరుకుపోయి ఉంది. వ్యవసాయమే దండుగ అని ప్రకటించినటువంటి ప్రభుత్వం పాలనలో కొట్టుమిట్టాడుతోంది. అప్పులపాలైన రైతుల ఆత్మహత్యలకు హద్దు, అదుపూ లేకుండా పోయింది. అలాంటి కడు దయనీయ స్థితిలో వారిపట్ల కనీస సానుభూతి చూపకపోగా శోకసముద్రంలో మునిగిపోయిన వారి కుటుంబాల నుంచి బలవంతంగా విద్యుత్ ఛార్జీలు కూడా వసూలు చేసిన ఘనత చంద్రబాబుది. ఆనాడు ప్రజల గుండెల్లో చంద్రబాబు ఓ హిట్లర్. నక్సలైట్లు జరిపిన దాడిలో స్వల్పగాయంతో బయటపడిన చంద్రబాబు ఇక ప్రజలు తమ సమస్యలను హఠాత్తుగా మరిచి పోయారని, ఆయనపై ఎనలేని సానుభూతిని కలిగి ఉన్నారని భ్రమించాడు. సానుభూతి చావకముందే ఎన్నికల బరిలోకిదిగితే తిరుగులేని విజయం సాధించొచ్చని లెక్కలేశాడు. గడువుకు ఆరునెలల ముందే అర్ధాంతరంగా శాసనసభను రద్దు చేసి ఎన్నికలను ఆహ్వానించాడు.

స్వల్పగాయానికి చిహ్నంగా అవసరానికి మించి రెండు నెలలకు పైగా చేతికట్టును ప్రదర్శించి, ప్రపంచాన్ని ఆకట్టుకునే ప్రయత్నం చేశాడు. ఇది దేవుడిచ్చిన పునర్జన్మ ఇక ప్రజలకే అంకితం అంటూ సాధు వచనాలు వల్లె వేశాడు. ప్రతిగా ప్రజలు ఓట్ల రూపంలో ఏమాత్రం సానుభూతి చూపకపోగా ఘోరంగా పరాజయం పాల్జేసి, అవమానించి గద్దెదించిన సంగతి జగమెరిగిన సత్యమే. నిజంగా ఘోర పరాభవం నుంచి గుణపాఠం నేర్చుకున్న వాడైతే, ప్రజల సమస్యలనూ, ఆకాంక్షలనూ గౌరవించడం తెలిసిన వాడైతే తెలంగాణ సెంటిమెంట్ ప్రధానంగా జరిగిన ఉపఎన్నికల సందర్భంగా చంద్రబాబు బాబ్లీ డ్రామా ఆడేవాడే కాదు. మహారాష్ట్ర పోలీసులు చేసిన గాయాలను చూపించి ఓట్ల రూపంలో సానుభూతిని పొందాలని చూసేవాడూ కాదు, మరో పరాభవాన్ని మూటగట్టుకునే వాడు అంతకన్నా కాదు.

ప్రతినిత్యం వివక్షాపూరిత చేదు అనుభవాలను ఎదుర్కొంటూ చంద్రబాబు నాయుడు చేతిలో కీలుబొమ్మల్లా, కట్టుబానిసల్లా ఉంటూ ఆయనకు, ఆయన వ్యక్తిగత నిగూఢ ప్రయోజనాలకు అండగా ఉండాలో, రాజకీయ జన్మనిచ్చిన తెలంగాణ ప్రజలకు చేసిన వాగ్దానాలకు అనుగుణంగా వారి సుదీర్ఘకాల న్యాయమైన ఆకాంక్షలకు అండగా ఉండాలో తేల్చుకోవాల్సిన తరుణానికి కాలదోషం పట్టకముందే తెదేపా తెలంగాణ నాయకులు ముందడుగు వేస్తే ప్రజా నాయకులుగా వారి భవిష్యత్ రాజకీయ బాటను పునర్నిర్మించుకున్న వారవుతారు.

**– ఎస్. కిశోర్ కుమార్**
హైదరాబాద్

ఆగస్ట్ వీక్షణంలో వచ్చిన 'మావోయిస్టులు కోరేదేమిటి?' వ్యాసం చదివాను. నాకు తెలిసినంతవరకు ఇటువంటి వ్యాసాన్ని చదివి ఎరగను. ఇంతవరకు రాలేదని చెప్పవచ్చు. మావోయిస్టు ఉద్యమాన్ని, దాని స్వరూప స్వభావాన్ని ఎంతో వివరణాత్మకంగాను, మేధావుల దగ్గర నుండి సామాన్య జనం వరకు నేటి పరిస్థితులను చదివి అర్థం చేసుకోవలిసిన వ్యాసం ఇది. సమాజంలో అన్ని వర్గాల ప్రజలు ఇక్కడి దోపిడీదార్ల తప్ప ఈ వ్యాసాన్ని చదివి ఎంతగానో హర్షిస్తున్నారు. ప్రజలకు ప్రత్యామ్నాయం అనేది ఒకటి దేశంలో పెరుగుతూ వస్తున్నదనేది బాగా స్పష్టంగా, అర్థవంతంగా వివరించి చెప్పాడు ఆజాద్. ఈ ప్రజా ఉద్యమాన్ని గురించి చాలా మందికి అనేక సందేహాలు ఉన్నాయి. వారి సందేహాలన్నింటికి సమాధానంగా చాలా గొప్పగా రాశాడు. ఈ ఉద్యమం గురించి స్పష్టత లేనివారు ఊగిసలాడకుండా వారికి ఉన్న అనుమానాన్ని నివృత్తి చేసుకోగలరు కూడా. ఈ వ్యాసాన్ని వీక్షణంలో అందించడం నేడెంతో అవసరమైన ఉన్నది కూడాను. ఇదే వ్యాసాన్ని ఒక చిన్న బుక్‌లెట్‌గా వేసి ప్రజలకు పంపిణీ చేస్తే మంచిదని ఆశిస్తున్నాను.

**– కె. సుబ్బనాచారి**
స్వాతంత్ర్య సమరయోధుడు
దుత్తలూరు, నెల్లూరు


వీక్షణంకు చందాలు, వీక్షణం పబ్లికేషన్ పుస్తకాల కోసం మీరు ఆన్‌లైన్ ద్వారా డబ్బులు కట్టడానికి వీలుగా
వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

**వీక్షణం పత్రికను వెబ్ పేజీల్లో కూడా చూడవచ్చు!**
www.veekshanam.wordpress.com

మీ అభిప్రాయాలను, సూచనలను ఎప్పటికప్పుడు మాకు తెలియజేయండి!
తెలుగు సమాజం తన గురించి తాను చేసుకుంటున్న అన్వేషణలో మీరూ పాలుపంచుకోండి!
Email : veekshanam2003@gmail.com

## బయటకు రాని కథలెన్నో?

రంగారెడ్డి జిల్లా పూడూరు మండలం బిలాపూర్ గ్రామ శివార్లలో యూనివర్సిటీ ఆఫ్ కేంబ్రిడ్జ్‌కి అనుబంధంగా పార్క్‌వుడ్ ఇంటర్నేషనల్ రెసిడెన్షియల్ స్కూల్ నడుస్తోంది. ముంబైకి చెందిన, ప్రస్తుతం ఇటలీలో స్థిరపడ్డ వ్యాపారి పిల్లలు నలుగురు ఇదే స్కూలులో విద్యనభ్యసిస్తున్నారు. వీరిలో ప్లస్ వన్ చదువుతున్న పదిహేడేళ్ల బాలికను స్కూల్ డైరెక్టర్ మహమ్మద్ సలావుద్దీన్ అయూబ్ (50) లొంగదీసుకొని ఈ ఏడాది మార్చ్ నుంచి అనేకసార్లు ఆమెపై అత్యాచారానికి పాల్పడ్డాడు. హాస్టల్ వార్డెన్ ఇందిర సహకరించినట్లు ఆరోపణలు వచ్చాయి. పోలీసు విచారణలో మరో నలుగురు విద్యార్థినుల పైన కూడా అత్యాచారం చేసినట్లు నిందితుడు ఒప్పుకున్నాడు. పలు విద్యార్థి సంఘాలు జూలై 22న స్కూలు ముందు ఆందోళనకు దిగాయి.

## బయ్యారంకు బ్రేక్...?

బయ్యారం తదితర మండలాలలో లక్షా నలభై వేలకు పైగా ఎకరాల భూమి రాష్ట్ర ఖనిజాభివృద్ధి సంస్థ (ఎ.పి.ఎం.డి.సి.)కు రిజర్వ్ చేయడాన్ని తాత్కాలికంగా పక్కన పెట్టాలంటూ జూలై 23న రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. ఈ భూమిలో 30 శాతం ప్రాంతంలో గ్రామాలు, రహదారులు తదితరమైనవి ఉన్నందున ఖనిజం ఉన్న ప్రాంతాన్ని స్పష్టంగా గుర్తించడానికి వీలుగా ఈ రిజర్వ్ నిర్ణయాన్ని పక్కన పెట్టాలని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రాన్ని కోరింది. ఖమ్మం జిల్లా బయ్యారం, గార్ల, నేలకొండపల్లి మండలాలలో బైరటీస్, ఇనప ఖనిజాలను దివంగత ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖరరెడ్డి కుటుంబానికి చెందిన వారు లూటీ చేస్తున్నారని ఇటీవల రెండు రోజుల పాటు ప్రతిపక్షాలు అసెంబ్లీలో గగ్గోలు పెట్టాయి.

## నిడమర్తి స్మృతి

ప్రముఖ అభ్యుదయ రచయిత, స్వాతంత్ర్య సమరయోధుడు నిడమర్తి ఉమా రాజేశ్వరరావు (87) జూలై 24న బెంగళూరులో తుది శ్వాస విడిచారు. అరసం వ్యవస్థాపకులలో ఒకరైన ఉమా రాజేశ్వరరావు విశాలాంధ్ర దినపత్రిక సహాయ సంపాదకులుగా పనిచేశారు. మాస్కో ప్రగతి ప్రచురణాలయంలో పని చేశారు. ఆయన జీవితమంతా అనువాదాలతో, అరసం ఉద్యమంతో ముడిపడి ఉంది.

## తెలంగాణకే ఓటు

తెలంగాణ కోసం రాజీనామాలు చేసిన 12 నియోజకవర్గాల్లో జూలై 27న ఉప ఎన్నికలు జరిగాయి. జూలై 30న ఫలితాలు వెలువడ్డాయి. రాజీనామా చేసిన అభ్యర్థులే గతం కన్న భారీ మెజారిటీలతో గెలిచారు. పదకొండు స్థానాలలో టి.ఆర్.ఎస్. అభ్యర్థులు, ఒక స్థానంలో బి.జె.పి. అభ్యర్థి గెలిచారు. మొత్తం ఓట్లలో 59.1 శాతం ఓట్లు టి.ఆర్.ఎస్.కు రాగా, 20.4 శాతం ఓట్లు కాంగ్రెస్‌కు, 6.67 శాతం ఓట్లు తెలుగుదేశం పార్టీకి వచ్చాయి. పది స్థానాలలో టి.డి.పి., మూడు స్థానాలలో అధికార కాంగ్రెస్ తమ డిపాజిట్లను కోల్పోయాయి. బి.జె.పి. అభ్యర్థి రాష్ట్ర పి.సి.సి. అధ్యక్షుడిని నిజామాబాద్ అర్బన్ స్థానంలో రెండవ సారి ఓడించారు.

## వేటపాలెం వెంకాయమ్మ కన్నుమూత

ప్రజా ఉద్యమాలలో నిబద్ధతతో చివరి వరకూ పనిచేసిన వేటపాలెం వెంకాయమ్మ (90) జూలై 30న మరణించారు. తెలంగాణ సాయుధ రైతాంగ పోరాటంతో ప్రభావితమై ప్రజా ఉద్యమాలతో చివరిదాకా మమేకమయ్యారు. ప్రకాశం, గుంటూరు జిల్లాల్లో ప్రజా రాజకీయాలతో పరిచయం ఉన్న వారందరికీ ఆమె తెలుసు. ఉద్యమాలలో అంత సుదీర్ఘ ప్రయాణం చేసినవారు అరుదు. ఉద్యమాలలో పనిచేస్తున్న పిల్లలందరినీ తన పిల్లలుగా ఆమె ప్రేమించింది.

## ఔరంగాబాద్ కుట్ర కేసు కొట్టివేత

విప్లవ రచయితల సంఘం (విరసం) నేతలపై పెట్టిన 'ఔరంగాబాద్ కుట్ర కేసు'ను కొట్టివేస్తూ నిజామాబాద్ అసిస్టెంట్ సెషన్స్ కోర్టు న్యాయమూర్తి సి. వెంకటేష్ ఆగస్ట్ 2న తీర్పు ఇచ్చారు. 2005 మే 30న మావోయిస్టు నాయకులు గంటి ప్రసాదం, యమసాని నరేందర్‌లతో కలిసి విరసం సభ్యులు ఎన్. వేణుగోపాల్, వి. చెంచయ్య, జి. పినాకపాణి, ఎస్. రవికుమార్‌లు సర్కార్‌ను కూలదోయడానికి కుట్ర పన్నారని నిజామాబాద్ 1వ టౌన్ పోలీసులు కేసు నమోదు చేశారు. మావోయిస్టు, విరసం సభ్యులు ఔరంగాబాద్‌లో ప్రభుత్వాన్ని కూల్చేందుకు కుట్ర పన్నారన్న ఆరోపణపై నల్లమలకు వెళుతుండగా నిజామాబాద్ శివారుల్లోని అర్సపల్లి వద్ద అరెస్టు చేసి, రిమాండ్‌కు పంపిన విషయం తెలిసిందే. ఈ కేసులో ప్రాసిక్యూషన్ వారు సాక్ష్యాలు సమర్పించడంలో విఫలమయ్యారని, కుట్ర అని పేర్కొన్న ఆయుధాలు, ధనం, జన సమీకరణ జరగలేదని న్యాయమూర్తి అభిప్రాయపడ్డారు. వారిని నిరపరాధులుగా గుర్తిస్తూ కేసు కొట్టివేసినట్లు న్యాయమూర్తి పేర్కొన్నారు.

## సంపత్కుమారాచార్య కన్నుమూత

ప్రముఖ కవి, రచయిత, పరిశోధకుడు, విమర్శకుడు కోవెల సంపత్కుమారాచార్య (77) హైదరాబాద్ చంపాపేట గ్రీన్‌పార్క్ కాలనీలోని తన స్వగృహంలో ఆగస్ట్ 5న ఉదయం మరణించారు. ఆయన వరంగల్‌లో జన్మించారు. ఉస్మానియా యూనివర్సిటీలో ఉన్నత విద్య, కాకతీయ యూనివర్సిటీలో డాక్టరేట్ పొందారు. ఉపాధ్యాయునిగా జీవితం ఆరంభించి, కాకతీయ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్‌గా 1993లో పదవీ విరమణ చేశారు. 1954 నుంచి చనిపోయే దాకా తెలుగు, సంస్కృత భాషలలో అనేక రచనలు చేశారు.

## బిసి కులాల పునర్ వర్గీకరణ

రాష్ట్రంలోని వెనకబడిన కులాల సామాజిక స్థితిగతులను పునః సమీక్షించాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. అవసరమైన ప్రాతిపదికను సిద్ధం చేసేందుకు బహిరంగ విచారణ నిర్వహించాలని బిసి కమిషన్‌ను ఆదేశించింది. ఆ మేరకు బిసి కమిషన్ ఆగస్ట్ 11న నోటిఫికేషన్ జారీ చేసింది. సెప్టెంబర్ 6న విశాఖపట్నం, అక్టోబర్ 4న తిరుపతి, నవంబర్ 10న హైదరాబాద్‌లలో బహిరంగ విచారణ నిర్వహించనున్నట్లు కమిషన్ సభ్య కార్యదర్శి ఎన్.వి. రాజు ప్రకటించారు. రాష్ట్రానికి చెందిన బిసి జాబితాలో 135 కులాలు ఉన్నాయి. విద్యా, ఉద్యోగ రంగాలలో వీటికి 29 శాతం (బిసి–ఎలోని 50 కులాలకు 7 శాతం; బిసి–బిలోని 25 కులాలకు 10శాతం; బిసి–సి లోని ఒక కులానికి 1 శాతం; బిసి–డిలోని 44 కులాలకు 7 శాతం; బిసి–ఇ లోని 15 కులాలకు 4 శాతం) రిజర్వేషన్‌లు అమలు చేస్తున్నారు.

## కొమ్రన్న కన్నుమూత

కవి, నిరంతర ఉద్యమశీలి, దళిత బహుజనులకు స్ఫూర్తి ప్రదాత, కొమ్రన్నగా సుపరిచితులైన కాకతీయ యూనివర్సిటీ ప్రొఫెసర్ కేశరాజు కుమార్ (50) ఆగస్ట్ 20న మరణించారు. మెదడుకు సంబంధించిన వ్యాధితో బాధపడుతూ హైదరాబాద్‌లోని అపోలో ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించారు. ఆయన స్వస్థలం వరంగల్ జిల్లా స్టేషన్ ఘన్‌పూర్ మండలం లోని మీదికొండ గ్రామం.

వీ

*ప్రజలలో గూడుకట్టుకుని ఉన్న తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష వ్యక్తీకరణకు కొనసాగింపుగా ఉన్న ఉప ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తున్నారు* **పిట్టల రవీందర్**

# తెలంగాణ - ప్రత్యామ్నాయ రాజకీయాలు

అనూహ్యమైన రీతిలో తెలంగాణ ఆకాంక్ష మరోమారు ఎవ్వరి అంచనాలకు అందని విధంగా ఉపఎన్నికల సందర్భంలో ప్రకటిత మయ్యింది. రాజీనామాలు చేసి భారీమెజారిటీతో గెలుపొందిన అభ్యర్థులు గానీ, వారిని బలపరిచిన పార్టీలుగానీ, ఎన్నికల సందర్భంలో వారికి పూర్తి అండగా నిలిచిన జె.ఎ.సి.లు గానీ ఈ విజయం తమదేనని గర్వంగానో, ధైర్యంగానో చెప్పుకోలేని స్థితి కనిపిస్తుంది. ఇది తెలంగాణ ప్రజల సంఘటిత ప్రకటనగానూ, సమిష్టి విజయంగానూ వీరందరూ ప్రకటించారు. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు విషయంలో జరుగుతున్న రాజకీయ పరిణామాలపై ఆందోళన, ఆవేదనలతో ఆత్మహత్యలకు పాల్పడిన వారికి ఈ విజయాన్ని అంకితం ఇస్తున్నట్లు ఎన్నికల్లో గెలుపొందిన వారందరూ బహిరంగంగా ప్రకటించారు. అనేకమైన రాజకీయ పరిణామాల తర్వాత, సీమాంధ్ర నాయకత్వంలోని పాలక ప్రతిపక్ష పార్టీలు పాటించిన ద్వంద్వ ప్రమాణాల నేపథ్యంలో, తెలంగాణ కోసం రాజీనామాలు చేసిన 12 మందినే తమ ప్రతినిధులుగా ప్రజలు నీరాజనాలు పలికారు. జె.ఎ.సి. నిర్ణయానికి కట్టుబడి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు చెందిన తెలంగాణ ప్రాంత ప్రజా ప్రతినిధు లందరూ రాజీనామాలు చేసి ఉంటే ఈ పాటికే తెలంగాణ రాష్ట్రం ఏర్పాటై ఉండేదనే అభిప్రాయం సర్వత్రా వ్యక్తమయింది. ఈ కారణంగానే రాజీనామాలు చేయనివారిని గ్రామాలకు రానివ్వమని ప్రజలు తెగేసి చెప్పారు. రాజీనామాలు చేయకుండా దోబూచులాడిన వారికి వ్యతిరేకంగా అనేక రూపాల్లో నిరసన కార్యక్రమాలను కూడా నిర్వహించారు. వర్ధమాన తెలంగాణ రాజకీయ చిత్రపటంలో ఇది ఒక భాగం మాత్రమే.

ప్రస్తుత ఖరీఫ్ సీజన్‌లో తెలంగాణ అంతటా సాధారణ వర్షపాతం నమోదయింది. వ్యవసాయపనులు జోరుగా సాగుతున్నాయి. విత్తనాల కోసం, ఎరువుల కోసం, పురుగుల మందుల కోసం రైతులు ఈ సమయంలో ధర్నాలు, రాస్తారోకోలు, నిరసన ప్రదర్శనలు నిర్వహించడం తెలంగాణ అంతటా సర్వసాధారణంగా కనిపించే దృశ్యం. వేసవి సెలవుల తర్వాత పాఠశాలలు, కాలేజీలు, విశ్వవిద్యాలయాలు తిరిగి తెరుచు కున్నాయి. సౌకర్యాల కోసం, పాఠ్యపుస్తకాల కోసం, ఫీజుమాఫీల కోసం, హాస్టల్ వసతుల కోసం, ఉపాధ్యాయుల కొరతకు నిరసనగా విద్యార్థులు తరగతులను బహిష్కరించి రోడ్డెక్కడం ఆనవాయితీ. కానీ తెలంగాణ ప్రాంతంలో అనూహ్యంగా ఇవేవీ కనిపించడం లేదు. అట్లాగని రైతుల కడగండ్లు దూరం కాలేదు. విద్యార్థుల సమస్యలు తీరిపోలేదు. పార్టీలకు అనుబంధంగా పనిచేసే రైతు సంఘాల్లోగానీ, విద్యార్థి సంఘాల్లోగానీ ఎలాంటి కదలికా కనిపించడం లేదు. చివరకు ఈ సీజన్‌లో వీరావేశంతో ఊగిపోయే వామపక్ష సంఘాలు కూడా తెలంగాణలో నిశ్చేష్టులుగానే కనిపిస్తున్నారు. తెలంగాణ ప్రాంతంలోని కార్మిక సంఘాల్లోనూ పెద్దగా కదలిక కనిపించడం లేదు. ఉప ఎన్నికల సందర్భంగా రాజీనామాలు చేయని వారెవ్వరూ నామినేషన్ వేయవద్దని, వేయడానికి సాహసిస్తే సహించేదిలేదని ఎన్నికలకు ముందు అనేక హెచ్చరికలు జారీఅయ్యాయి. ఎన్నికల ప్రచారంలో పాల్గొనే కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు చెందిన నాయకులను తరిమికొడతామని కూడా హెచ్చరించారు. కానీ ఎన్నికల ప్రచార సమయంలో అత్యంత ప్రశాంత పూరితమైన వాతావరణం కనిపించింది. అన్ని పార్టీలకు చెందిన అభ్యర్థులు, నాయకులు ఉప ఎన్నికల ప్రచారంలో స్వేచ్ఛగా పాల్గొన్నారు. ఓటర్లను ఆకర్షించేందుకు అన్నిరకాల ఎత్తుగడలను అమలు జరిపారు. ఉపఎన్నికలు జరిగిన 12 అసెంబ్లీ నియోజకవర్గాల్లో ఎక్కడా ఎలాంటి అవాంఛనీయమైన సంఘట నలు చోటు చేసుకోలేదు. ముందు జాగ్రత్త పేరిట మోహరించిన సాయుధ పోలీసు బలగాలు విహార యాత్రలో పాల్గొన్న అనుభూతి పొందారు.

తెలంగాణ సాధన ఉద్యమంలో భాగంగా పన్నెండు మంది శాసనసభ్యులు తమ పదవులకు రాజీనామాలు సమర్పించిన అనంతరం తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ (తెలంగాణ జె.ఎ.సి.) రెండు దఫాలుగా 'తెలంగాణ ఉద్యమ యాత్ర' పేరిట బస్సు యాత్రలను నిర్వహించింది. ఎట్లాంటి ముందస్తు ప్రచారం లేకుండా, తెలంగాణ ఉద్యమ చైతన్యంలో వెనకబడిన ప్రాంతంగా భావించే ఖమ్మం జిల్లా మణుగూరులో ప్రారంభమైన 'తెలంగాణ ఉద్యమ యాత్ర'కు సాధారణ ప్రజల నుండి అనూహ్యమైన రీతిలో ఆదరణ లభించింది. ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలలో రెండు దశల్లో వారం రోజుల పాటు సాగిన ఈ ఉద్యమ యాత్రకు గ్రామీణ ప్రాంతాల ప్రజలు నీరాజనాలు పలికారు. మంగళహారతులు, పూలదండలు, వీర తిలకాలు, స్వాగత తోరణాలు, ఊరేగింపులు, సాంస్కృతిక ప్రదర్శనలు, బతుకమ్మలాటలు, బహిరంగ సభలు... యాత్ర పొడవునా జనాలు బారులు తీరారు. విద్యార్థులు జేజేలు పలికారు. తెలంగాణ దీక్ష శిబిరాలు ఉత్తేజిత మయ్యాయి. మరీ ముఖ్యంగా, తెలంగాణ జె.ఎ.సి. పట్ల ప్రజల్లో ఉన్న విశ్వాసం, జె.ఎ.సి.కి నాయకత్వం వహిస్తున్న కోదండరాం పట్ల కనబరిచిన ఆసక్తి 'తెలంగాణ ఉద్యమ యాత్ర'లో ప్రస్ఫుటంగా వ్యక్తమయింది. ఆ తర్వాత విద్యార్థి జె.ఎ.సి. నాయకత్వంలో 12 నియోజకవర్గాల్లో ఉప ఎన్నికల నేపథ్యంలో ప్రత్యేకంగా నిర్వహించిన

'బస్సుయాత్ర'ల పట్ల కూడా ప్రజల నుండి పెద్దఎత్తున ఆదరణ లభించింది. విశ్వాసం వ్యక్తమయింది. 'తెలంగాణ ఉద్యమయాత్ర' అనుభవాలే పునరావృతమయ్యాయి. ఈ రెండు యాత్రల మధ్యకాలంలో తెలంగాణ జె.ఎ.సి., విద్యార్థి జె.ఎ.సి. సంయుక్త పిలుపు మేరకు 'జగన్ ఓదార్పు యాత్ర' ను అడ్డుకోవడంలో మానుకోట ప్రదర్శించిన తెలంగాణ పౌరుషం... తెలంగాణ ఆత్మగౌరవాన్ని హిమాలయ శిఖరమంత ఎత్తున ఎత్తి పట్టింది. ముఖ్యమైన ఈ మూడు సందర్భాల్లోనూ అనివార్య పరిస్థితుల్లో యాత్రలో పాల్గొన్న రాజకీయ ప్రతినిధులకంటే, తెలంగాణ జె.ఎ.సి.ల నాయకత్వం పైనే ప్రజల్లో విశ్వాసం ఎక్కువగా వ్యక్తమయింది. ఉప ఎన్నికల ఫలితాల ద్వారా ప్రజలు ఏకపక్షంగా వ్యక్తం చేసిన తెలంగాణ రాష్ట్ర ఆకాంక్షకు కూడా ఈ మూడు సందర్భాలు అవసరమైన నేపథ్యాన్ని సమకూర్చాయనడంలో అతిశయోక్తి లేదు.

తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ఆకాంక్షను కేంద్రంగా చేసుకునే గడచిన పది సంవత్సరాలుగా రాజకీయాలు సుడులు తిరుగుతున్నాయి. ఇప్పటివరకూ తీవ్రస్థాయిలో కొనసాగిన భావవ్యాప్తిగానీ, రాజకీయ నినాదాలు గానీ, ఎన్నికల వ్యూహాలు గానీ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు వల్లనే తెలంగాణలోని సకల సమస్యలకు పరిష్కారాలు సాధ్యపడతాయనే భావాన్నే ప్రజల్లో పాదుగొలిపాయి. తెలంగాణ సమాజం ఎదుర్కొంటున్న సమస్యలన్నీ రాష్ట్ర ఏర్పాటుతో తీరిపోతాయనే అభిప్రాయాన్ని ప్రజల్లో కలిగించారు. తెలంగాణ సమాజం మొత్తంగా ఇవాళ ఎవ్వరికీ అంతుచిక్కని రీతిలో మౌనముద్రలోకి జారిపోవడానికి కూడా ఈ పరిస్థితులే కారణం. ఇక్కడి తమ నిత్య జీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలన్నిటికీ సీమాంధ్ర పాలకులే కారణమని, అందువల్ల పాలనాధికారం, నిర్ణయాధికారం తెలంగాణ ప్రాంత నాయకత్వం చేతిలోకి మారినప్పుడే ఈ సమస్యలకు పరిష్కారం సాధ్యపడుతుందనే అభిప్రాయానికి ప్రజలు చేరువయ్యారు. తెలంగాణ వనరుల తరలింపు మొదలుకొని నీళ్లు, నిధులు, నియామకాల పంపిణీ విషయంలో తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాలపై కూడా ఇదే నేపథ్యం నుండి ప్రచారం జరిగింది. అయితే ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలకు తెలంగాణ రాజకీయ నాయకత్వం ఏ మాత్రం పరిష్కారం చూపలేదన్న అభిప్రాయం కూడా ప్రజల్లో బలం ఏర్పడింది. ఈ కారణంగానే తెలంగాణ ప్రజలు తమ రోజువారీ సమస్యల పరిష్కారం విషయంలో గానీ, మౌలిక సమస్యల విషయంలో గానీ, దీర్ఘకాలిక సమస్యల విషయంలో గానీ... తెలంగాణ రాజకీయ నాయకత్వంపై ఆధారపడి లాభం లేదనే నిర్ణయానికి వచ్చారు. అందుకే ప్రజలు తమ సమస్యల పరిష్కారం విషయంలో తెలంగాణ రాజకీయ నాయకత్వంపై ఒత్తిడిని తీసుకువచ్చే ఆనవాయితీకి స్వస్తి పలికారు. తెలంగాణలో మాటిమాటికీ వస్తున్న ఎన్నికల సందర్భాలను సైతం ప్రజలు తమ సమస్యలపై కంటే ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటు అంశానికే అత్యధిక ప్రాధాన్యతను ఇస్తున్నారు. దీర్ఘకాలిక తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమ క్రమంలో అనివార్యంగా ఏర్పడిన ఈ పరిస్థితులను తెలంగాణ రాజకీయ నాయకత్వం ఒక 'వెసులుబాటు'గా మాత్రమే స్వీకరించినట్లు కనిపిస్తున్నది. అయితే అత్యంత వ్యూహాత్మకంగా ప్రజలు పాటిస్తున్న ఈ 'మౌనం' వెనుక దాగి ఉన్న 'ప్రమాదాన్ని' పసిగట్టడంలో రాజకీయ పార్టీలన్నీ విఫలమవుతున్నాయి.

మొత్తంగా తెలంగాణ ఉద్యమం రాజకీయంగా అనేక అంశాలపై ప్రజలకు స్పష్టత ఇచ్చినట్లు కనిపిస్తున్నది.

1) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటు నుండి ఇప్పటి వరకు తెలంగాణ రాజకీయ నాయకత్వం బానిస భావజాలంతోనే వ్యవహరిస్తున్నది. తెలంగాణ ప్రాంతానికి చెందిన వనరుల తరలింపు గానీ, ఉద్యోగ నియామకాలలో జరుగుతున్న అన్యాయాలు గానీ, అభివృద్ధి కార్యక్రమాల అమలులో చూపుతున్న వివక్షను గానీ ఎదిరించడంలోనూ, అడ్డుకోవడంలోనూ తెలంగాణ రాజకీయ నాయకత్వం ఎప్పుడూ తగిన చొరవను ప్రదర్శించలేదు.

2) తెలంగాణలోని రాజకీయ నాయకత్వం ప్రతి సందర్భంలోనూ తమ స్వార్థ ప్రయోజనాల కోసం తెలంగాణ ప్రజల ఆకాంక్షలను పణంగా పెట్టాయి. ప్రతి సందర్భంలోనూ ప్రజలను నమ్మించి మోసం చేస్తూనే ఉన్నాయి. తెలంగాణ ప్రజలు ఇచ్చిన అధికారాన్ని, అవకాశాలను ఈ ప్రాంత ప్రయోజనాల కోసం కాకుండా తమ స్వార్థం కోసమే ఉపయోగించుకున్నారు.

3) సీమాంధ్ర రాజకీయ నాయకత్వంలో పని చేస్తున్న రాజకీయ పార్టీల్లో క్రియాశీలంగా పనిచేస్తున్నప్పటికీ ఆయా పార్టీల్లో ప్రత్యేకమైన ఉనికి కోసం గానీ, ప్రతిపత్తి కోసం గానీ, నిర్ణయాత్మకంగా వ్యవహరించడంలో గానీ తెలంగాణ రాజకీయ నాయకత్వం ఎప్పుడూ ప్రయత్నించలేదు. అందువల్ల సీమాంధ్ర రాజకీయ నాయకత్వం ముందు తల ఎత్తుకుని నిలబడే స్థాయికి ఇన్ని సంవత్సరాల ఉమ్మడి రాష్ట్రంలో ఏ ఒక్క నాయకుడు కూడా ఎదగలేకపోయారు.

4) తెలంగాణ ప్రజల సమస్యల పరిష్కారానికి తమ స్వంత పలుకుబడి, ప్రయత్నాల మీద కాకుండా సీమాంధ్ర రాజకీయ నాయకత్వం చూపే దయా, దాక్షిణ్యాల మీదనే ఎక్కువగా ఆధారపడ్డారు. దశాబ్దాల తరబడిగా తెలంగాణ రాజకీయ నాయకత్వం అనుసరిస్తున్న ఇట్లాంటి బానిస భావజాలాన్ని తెలంగాణ ఉద్యమం బట్టబయలు చేసింది. తెలంగాణ రాజకీయ నాయకత్వం వల్ల ఇక్కడి సమస్యలకు పరిష్కారం లభించడం సాధ్యం కాదనే వాస్తవం అందరికీ తెలిసివచ్చింది. 'అవసరమైన సందర్భాలలో' సీమాంధ్ర రాజకీయ నాయకత్వం ప్రదర్శించినట్లుగా తెలంగాణ రాజకీయ నాయకత్వం కనీస 'ఐక్యత'ను కూడా ప్రదర్శించలేదనే అభిప్రాయం కూడా ఇటీవలి 'రాజీనామాల సందర్భం' బహిర్గతం చేసింది.

5) తెలంగాణ రాష్ట్ర సాధన ఉద్యమంలో తెలంగాణ రాజకీయ నాయకత్వం పోషిస్తున్న పాత్ర కేవలం నామమాత్రమేనని, ప్రత్యేక రాష్ట్ర సాధన కోసం అనుసరించవలసిన రాజకీయ వ్యూహాన్ని ప్రజలకు అందివ్వడంలోనూ ఇక్కడి రాజకీయ పార్టీలన్నీ (ఎలాంటి మినహాయింపులు లేకుండా) పూర్తిగా విఫలమైనట్లు తెలంగాణ ప్రజలు తమ అనుభవం ద్వారా నిర్ణయించుకున్నారు.

ఇప్పుడు తెలంగాణ రాష్ట్రాన్ని సాధించుకోవడం ఎంత అనివార్యమో, ప్రత్యేక రాష్ట్రంలో ప్రజలు తమ ఆకాంక్షలను నిలబెట్టుకోవడానికి అవసరమైన ప్రత్యామ్నాయ రాజకీయ నాయకత్వాన్ని తయారు చేసుకోవడం కూడా అంతే అవసరం.

*(రచయిత సీనియర్ పాత్రికేయులు, తెలంగాణ విద్యావంతుల వేదిక నాయకులు)*

*అనేక మలుపులు తిరుగుతున్న సోహ్రాబుద్దీన్ కేసు అసలు నిజం వెలుగు చూడడానికి అడ్డంకిగా ఉన్న రాజ్య స్వభావాన్ని ఎత్తిచూపుతోందని అంటున్నారు* **మాడభూషి శ్రీధర్**

# ఎన్‌కౌంటర్ బూటకాన్ని తవ్వుతున్న సి.బి.ఐ.

సోహ్రాబుద్దీన్ అంత మంచి వాడేంకాదు. అతనో టపోరీ, అంటే చిన్న తరహా నేరగాడు. గుజరాత్‌లో కాదు రాజస్థాన్‌లో. పాలరాతి వ్యాపారులను బెదిరించి డబ్బు వసూలు చేసి మరికొందరితో పంచుకునే వాడు. బలవంతపు వసూళ్లలో రెండు ముఠాలు. ఒక ముఠా మీద మరొక ముఠా కక్షలు కొట్లాటలు మామూలే. ఇటువంటి వారికి రక్షకులు కూడా ఉంటారు. హమీద్‌లాలా సోహ్రాబుద్దీన్ వంటి నేరగాళ్లను కాపాడుతూ ఉండేవాడు. సోహ్రాబుద్దీన్ లాలాను చంపి పెద్ద ముఠానేత అయ్యాడని అంటారు. రాజస్థాన్‌లో బాగా ధనికులు బలవంతులు అయిన పాలరాతి లాబీ సోహ్రాబుద్దీన్‌ను ఖతం చేయడానికి పథకాలు పన్న సాగింది. రాజస్థాన్‌లో కాకుండా గుజరాత్‌లో అతని అంతు తేల్చాలను కున్నారు. రెండు నేర ముఠాల కక్షలు తీర్చుకోవడానికి గుజరాత్ ఎందుకు వేదికైంది అనేది ప్రశ్న. ఎందుకంటే అక్కడ ఎన్‌కౌంటర్లు సులభం. నచ్చని వాడిని వదిలించుకోవచ్చు. కేసులు ఉండవు. శిక్షల దాకా రాదు. డబ్బు ఇస్తే ఖాకీల ద్వారా ఖతం చేయించే రాజకీయ వ్యవస్థ అక్కడ రాజ్యం చేస్తున్నది. రోజూ కొన్ని వందల మంది కేవలం రోడ్డు ప్రమాదాల్లో మరణిస్తున్న ఈ దేశంలో ఒక్క సోహ్రాబుద్దీన్ ప్రాణం సమస్య కాదు. అతన్ని చంపినట్టు ఎవరినైనా చంపగల ఒక అన్యాయ వ్యవస్థ ఏర్పడడం, సోహ్రాబుద్దీన్ పోలీసు బుల్లెట్లకు బలైతే అతనికి వసూళ్ల నాయకుడుగా ఉన్న రాజకీయవేత్త హోంమంత్రిగా ఉండడం, పోలీసులు తాము ప్రభుత్వోద్యోగులమన్న గౌరవ హోదా మరిచి హోంమంత్రి వ్యక్తిగత ముఠాలోని కిరాయి గూండాలవలె వ్యవహరించడం వినాశ సూచిక కనుక.

సోహ్రాబుద్దీన్ నిజమైన బుల్లెట్ పోరాటంలో చనిపోలేదు. నకిలీ బూటకపు ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడు. కేసు పెట్టడం సాధ్యం కాలేదు. పెట్టినా విచారణ సాధ్యం కాలేదు. అయినా కొనసాగనీయలేదు. ఇంకా కొనసాగుతూనే ఉంది. అదీ సుప్రీంకోర్టు పుణ్యమా అని. రక్షించవలసిన పోలీసులు చంపడం, వారిపై చర్య తీసుకోవలసిన హోంశాఖ హంతక ముఠా నేత చేతిలోనే ఉండడం, దర్యాప్తుకే ఆస్కారం లేకపోవడం...ఇవీ దుష్పరిణామాలు. ఇప్పుడున్న చట్టాలు, నియమాలు రాజ్యాంగ సూత్రాలు, నేర న్యాయశాస్త్రాలు పనికిరావని వాదించే వితండవాదులకు సోహ్రాబుద్దీన్ నకిలీ ఎన్‌కౌంటర్ మరణం పరిణామాలు కళ్లు తెరిపించాలి. ఈ చట్టాలు కేవలం క్లాస్ రూం పాఠాలు కాదు వ్యవస్థలో రక్షించే వారే హత్యలు చేసే అన్యాయాలను ఆపే అవసరాలు అని అర్థం చేయించాలి.

### ఒక జంట పోరాటం

జన సంఘర్ష్ మంచ్ అనే సంస్థ ద్వారా న్యాయవాది ముకుల్ సిన్హా, భార్య నిర్జరీ సిన్హా జంట అనేక అన్యాయాల మీద పోరాటం సాగిస్తున్నది. సోహ్రాబుద్దీన్, అతని భార్య కౌసర్ బీ బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించారని రుజువు చేయడంలో వీరి పరిశోధనే కీలకమైన సాక్ష్యాలను తెచ్చిపెట్టింది. సి.బి.ఐ.తో సమానంగా ఈ ఇద్దరూ సాక్ష్యాలు సేకరించడం చాలా గొప్ప విషయం. సోహ్రాబుద్దీన్‌ను టెర్రరిస్టు అని పోలీసులు లేవనెత్తిన వాదం అబద్ధమని వీరే రుజువుచేసారు. ముఖ్యంగా పోలీసు అధికారులకు బిజెపి నాయకులకు మధ్య, విహెచ్‌పి నేతలకు పోలీసులకు మధ్య జరిగిన ఫోన్ సంభాషణలను సేకరించడం ద్వారా ఈ జంట, నేరముఠాలకు, రాజకీయ నాయకులకు, కిరాయి హంతకుల్లాగా మారిన పోలీసులకు మధ్య డబ్బు సంబంధాలను బయట పెట్టింది.

పాలరాళ్ల వ్యాపారులైన దశరథ్, రామన్ అనే పటేల్ సోదరులు గుజరాత్ హోంమంత్రి అమిత్ షా గుట్టు రట్టు చేసారు. షా గుజరాత్ ముఖ్యమంత్రికి కుడి భుజం. అతని వృత్తి సోహ్రాబుద్దీన్, తులసీ ప్రజాపతి వంటి గూండాలను చేరదీసి బలవంతపు వసూళ్లకు పాల్పడడం. సోహ్రాబుద్దీన్, ప్రజాపతి ఒకప్పుడు షా మనుషులే. ఒకే ముఠా సభ్యులే. 2004 డిసెంబర్‌లో పాపులర్ హౌజ్ అనే బిల్డర్ కార్యాలయంలో కాల్పులు జరిగాయి. అభయ్ చూడాసమా అనే పోలీసు అధికారి ద్వారా, సోహ్రాబుద్దీన్, ప్రజాపతితో ఈ కాల్పులు జరిపించింది హోంమంత్రి షా. తరువాత అభయ్‌తో, షాతో ఈ ఇద్దరికీ సంబంధాలు చెడిపోయాయి. కనుక పోలీసుల ద్వారా వారిని అంతమొందించాలని షా పథకం పన్నారు. వారిమధ్య సోహ్రాబుద్దీన్ భార్య కౌసర్‌బీ కూడా చిక్కడం, భర్తను దారుణంగా పోలీసులు హత్య చేయడాన్ని చూసిన ప్రత్యక్ష సాక్షి కనుక ఆమెను కూడా చంపవలసి రావడం హోం మంత్రి అసలు స్వరూపాన్ని బయట పెట్టింది. తీగ లాగితే డొంక కదిలింది. ఈ తీగ ముఖ్యమంత్రిని కూడా లాగేస్తుందో లేదో చూడాలి. దాని కన్న ముఖ్యం పోలీసులు చంపిన వారంతా టెర్రరిస్టులు కాదనే బహిరంగ రహస్యానికి రుజువుగా ఈ ఎన్‌కౌంటర్ మిగిలిపోవడం. సోహ్రాబుద్దీన్ ఎన్‌కౌంటర్ తరువాత హోం మంత్రి షా ఎవరెవరితో ఏం మాట్లాడారో ఎప్పుడు మాట్లాడారో తెలుసుకోగలగడమే మరొక కీలకమైన అంశంగా మారింది. సోహ్రాబుద్దీన్ ఎన్‌కౌంటర్ కేసును బూటకపు ఎన్‌కౌంటర్ కథ అనే కన్న నేరగాళ్లకు రాజకీయ నాయకులకు మధ్య, వారికీ పోలీసుకు మధ్య ఉన్న అక్రమసంబంధాల్ని ఎండగట్టిన కథ అనడం సమంజసం. దాదాపు కోటి టెలిఫోన్ సంభాషణా వివరాల పత్రాలున్నాయి. షాకు పోలీసు అధికారులకు మధ్య నవంబర్ 23 నుంచి 29 వరకు జరిగిన కాల్స్‌ను ముకుల్ నిర్జరీ విశ్లేషించారు. ముఖ్యంగా డి.ఎస్.పి. ఎన్.కె. అమిన్ హంతక పోలీసులలో ఒకరు. ఆయన అప్రూవర్‌గా మారారు. అతని

వాంగ్మూలం కూడా కీలకమే. షాను బోనెక్కించేది ఈయన ప్రకటనే అవుతుంది. కాల్స్ విశ్లేషణలో వారు ఏ సమయంలో ఎక్కడున్నారో తెలిసింది. ఆ సమాచారం బట్టి వీరు క్షణం క్షణం అమిన్‌తో మాట్లాడుతున్నారని తేలింది. ఎన్‌కౌంటర్ జరిగిన ఆ ప్రదేశాలు సరిగ్గా వివరాలకు అతికిపోయాయి. కౌసర్‌బీని చంపినపుడు అమిన్ ఫోన్ స్విచాఫ్ చేసారు. కాని ఆమె శవంతో వెళ్లిన ఒక కానిస్టేబుల్ ఫోన్‌కు వచ్చిన కాల్స్‌ను పరిశీలించారు. నవంబర్ 29, 2005నాడు ఆమెను చంపి కాల్చివేసిన నదీతీరం సమీపానికి కాల్స్ వెళ్లినట్టు అక్కడి నుంచి కాల్స్ వచ్చినట్టు తేలింది. శవదహనానికి నదీతీరంలో కట్టెలు సేకరించాలని ఆ కానిస్టేబుల్‌ను ఆదేశించినట్టు ఇతర సాక్ష్యాలు చెబుతున్నాయి. ఇంకా అనేక అంశాలను ముడిపెడితే తప్ప అసలు నేరం పకడ్బందీగా రుజువు కాదు.

ఈ ఎన్‌కౌంటర్లు చేసినందుకు అవార్డులు రివార్డులు, ప్రమోషన్లు నగదు బహుమానాలతో పాటు చాటుగా కోట్ల రూపాయలు కూడా అందాయి. చనిపోయిన వారికి, న్యాయానికి తప్ప అందరికీ అనేక రకాలుగా లాభాలు పండించే పంటలు ఈ ఎన్‌కౌంటర్లు.

ఒక బూటకపు ఎన్‌కౌంటర్ కోర్టు దాకా రావడం, ఆ కేసును సి.బి.ఐ. పరిశోధించడం, అందులో ఒక హోం మంత్రి నిందితుడిగా అరెస్టు కావడం అనేది మన స్వతంత్ర భారత చరిత్రలో ఇదే మొదటిసారి. అరచి అరచి అలసిపోని మానవ హక్కుల సంఘాలవారి మాటలకు, మావోయిస్టుల వాదాలకు ఊతమిచ్చిన కేసు ఈ కేసు. ఈ కేసులో ఇప్పటికి ఒక హోంమంత్రిని, 18 మంది పోలీసులను అరెస్టు చేసారు. వీరిలో ఏడుగురు సీనియర్ పోలీసు అధికారులు. ఎన్‌కౌంటర్ స్పెషలిస్టుగా పేరొందిన డి.జి. వంజారా, డి.ఐ.జి., ఎం.ఎన్. దినేష్, రాజ్‌కుమార్ పాండియన్, అభయ్ చుడాసమ, ఎన్.కె. అమిన్. అమిన్ అప్రూవర్‌గా మారి వివరాలు చెప్తే, సిబిఐ కథనానికి బలం చేకూరే అంశాలు చాలా బయటపడవచ్చు.

సోహ్రాబుద్దీన్ తమ్ముడు రుబాబుద్దీన్ సుప్రీంకోర్టులో పిటిషన్ దాఖలు చేసినపుడు ఈ కేసు ఇంత ప్రకంపనలు రేపుతుందనుకోలేదు. ఓ చిన్న నేరగాణ్ణి 2005 నవంబర్ 26న ఎన్‌కౌంటర్ పేరుతో చంపితే పెద్దగా ఎవరూ పట్టించుకోరని పోలీసులు అనుకున్నారే కాని తమ మెడకు ఉరి తాడువలె చుట్టుకుంటుందని ఊహించలేదు. ముఖ్యమంత్రి నరేంద్ర మోడీని చంపడానికి కుట్ర పన్నిన టెర్రరిస్టు అని పోలీసులు సోహ్రాబుద్దీన్ గురించి కథలు అల్లారు. ఆ కరడుకట్టిన ఉగ్రవాదికి భార్య కౌసర్ బీ, ప్రజాపతి సహ నేరస్తులని నమ్మబలికారు. తనని చంపడానికి వచ్చిన టెర్రరిస్ట్ కాదని కనీసం హోం మంత్రి షా ద్వారా ముఖ్యమంత్రికీ తెలియదంటే నమ్మడం కష్టం. అనుమానం రాగానే పరిశోధన జరగాలని, ఫిర్యాదును ముందు ఎఫ్.ఐ.ఆర్.గా నమోదు చేసి దర్యాప్తు ప్రారంభించాలని చట్టాలు చెప్తున్నాయని, ఎన్ని నీతులు మనం వల్లె వేసుకున్నా, నిజానికి సుప్రీంకోర్టు వెంట పడితేనే ఈ కేసులో పరిశోధన ఒకొక్క అడుగు ముందుకు సాగింది. జనవరి 2010న సిబిఐకి అప్పగించేదాకా అతను టెర్రరిస్టు అనే అనుకున్నారు. పాలరాతి వ్యాపారుల దగ్గర డబ్బు వసూలు చేసే ముఠాల మధ్య తగాదా, ఈ ముఠా నేతలను పోషించే రాజకీయ పార్టీలు మంత్రి వర్గాల అండదండలు వారి అడుగులకు మడుగులొత్తే పోలీసు ఉన్నతాధికారుల చర్యలు, ఈ అధికారులు చెప్పినట్లు చేసే కింది అధికారులు కలిసి ఒక హంతక ముఠాగా మారి ఆ ముగ్గురిని అన్యాయంగా అంతమొందించారన్నది అసలు కథ అని సిబిఐ తేల్చింది. హోంమంత్రి అమిత్ షాను తనను సిబిఐ వారు అరెస్టు చేస్తారని తెలిసి పారిపోయాడు. చివరకు ఏం చేయాలో ఎక్కడికి వెళ్లాలో తోచక లొంగిపోయాడు.

హోంమంత్రి అరెస్టుతో సిబిఐ తాను చాలా సీరియస్‌గా పనిచేస్తున్నానని ప్రపంచానికి చాటి చెప్పింది. ఈ దేశంలో కూడా హంతకులైన పోలీసులకు మంత్రులకు శిక్షలు పడే అవకాశం ఉందనే చిన్న ఆశ మొగ్గతొడిగింది. బూటకపు ఎన్‌కౌంటర్లు అనేవి పోలీసులకు మంచి లాభసాటి వ్యాపారాలు. సోహ్రాబుద్దీన్‌ను తొలగించాలనుకునే వారు కోట్ల కొద్దీ డబ్బులు ఇస్తారు. అతను టెర్రరిస్టు అని రుజువు చేస్తే బోలెడు రివార్డులు. తాను ఇస్లామిక్ టెర్రరిస్టు బెదిరింపులకు వెరవకుండా సాహసోపేతంగా పనిచేస్తున్నానని రొమ్ము విరిచి చెప్పుకునే అవకాశం మోడీకి వస్తుంది. సోహ్రాబుద్దీన్ ముస్లిం కావడం వల్ల కూడా కొంత ఉపయోగం. నవంబర్ 23, 2005 తెల్లవారు జామున హైదరాబాద్ నుంచి సాంగ్లీ బస్సులో వెళ్తున్న సోహ్రాబుద్దీన్ దంపతులను, ప్రజాపతిని బస్సు దింపి పట్టుకున్నారు. అహ్మదాబాద్‌లో దంపతులను ఫార్మ్ హౌజ్‌కు తీసుకువెళ్లారు. నవంబర్ 26న ఉదయం అహ్మదాబాద్‌లో సోహ్రాబుద్దీన్‌ను కాల్చి చంపారు. వంజారా తో సహా నలుగురు పోలీసులు అతనిపైన బుల్లెట్లు కురిపించారు. శరీరం నిండా బుల్లెట్లతో భయంకర టెర్రరిస్టు శవం అని మరునాడు వార్తలు ప్రచురించారు. పోలీసులు ఎప్పటిలాగే ఆత్మరక్షణ వాదం వినిపించారు. సోహ్రాబుద్దీన్ భార్య కౌసర్ బీని మరో ఫార్మ్ హౌజ్‌కి తరలించి అక్కడ ఆమెపై అత్యాచారం జరిపారు. సూది ద్వారా విషం ఎక్కించి చంపారు. శవాన్ని దహించి బూడిదను ఇల్లోల్ గ్రామం బావిలో కలిపారు. డిఐజి వంజారాగారి సొంత ఊరు ఇల్లోల్. తరువాత బావిని మూసి వేసారు.

జనవరి 2006న సోహ్రాబుద్దీన్ సోదరుడు రుబాబుద్దీన్ ఈ విషయం సుప్రీంకోర్టుకు ఒక లేఖ రూపంలో తెలిపారు. న్యాయస్థానం గుజరాత్ డిజిపికి దర్యాప్తు జరిపించాలని ఆదేశించింది. అక్కడినుంచి ఆదేశం (క్రైం) సి.ఐ.డి. విభాగం ఐ.జి.పి. అధికారిణి గీతా జోహ్రీకి చేరింది. సోహ్రాబుద్దీన్‌ను మరో ఇద్దరిని పట్టుకుని ఫార్మ్‌హౌజ్‌కు తరలించడం వరకు ఆమె నేతృత్వంలోని టీం పరిశోధన చాలా నిష్పాక్షికంగా జరిగింది. వంజారా, దినేష్, పాండ్యన్‌లు నేరగాళ్లనే విషయం ఆమె ఆధ్వర్యంలోని సి.ఐ.డి. నివేదికలోనే బయటపడింది. ఆమె చాలా ధైర్యంగా పరిశోధన సాగించి మన్ననలు కూడా అందుకున్నారు. డి.జి.పి., పి.సి. పాండేకు గీతా ఒక లేఖ రాస్తూ విచారణ తప్పుదారి పట్టించాలని రాష్ట్ర హోం మంత్రి అమిత్ షా ఒత్తిడి చేస్తున్నారని తెలిపారు. ఆ లేఖ ఒక సాక్ష్యంగా ఇప్పుడు కోర్టు ముందుకు వచ్చింది. ఆమె ప్రజాపతిని ఇంటారాగేట్ చేయాలని అనుకున్న విషయం తెలిసి ప్రజాపతిని 2006 డిసెంబర్ 28న బనస్‌కాంత పోలీసులు హత్య చేసారు. పోలీసు కస్టడీ నుంచి పారిపోతుండగా కాల్చితే చనిపోయాడని పోలీసుల కథనం. మరోవైపు గీతా జోహ్రీ పైన రాజకీయంగా తీవ్ర వత్తిడి పెంచారు. ఆమెకు అతను దొరికి ఉంటే వీరి కథ అప్పుడే ముగిసిపోయేది. ఆమె వినకపోతే పదవి నుంచి తప్పించారు. మరొకరిని కూడా తప్పించారు. మే 2007లో మళ్లీ గీతాను అదే పదవిలో నియమించారు. సోహ్రాబుద్దీన్‌ను పోలీసులు రివార్డుల కోసం చంపారని, ఇందులో రాజకీయ నాయకులకు ప్రమేయం లేదని గీతా జోహ్రీ రూపొందించిన నివేదిక ఆమె ప్రతిష్టను దిగజార్చింది. రుబాబుద్దీన్ మే 2007లో మరొక రిట్ పిటిషన్ వేసినా సి.ఐ.డి. పరిశోధన సరిగా సాగలేదు. దర్యాప్తులో లోపాలను పరిశీలించిన సుప్రీంకోర్టు ఈ పిటిషన్‌పైన జనవరి 2010లో సి.బి.ఐ. దర్యాప్తు చేయాలని

*సామాన్యులను నగర వీధుల నుంచి తరిమికొట్టి, సామాన్యులకు ఎంత మాత్రం ప్రయోజనం లేని, అవినీతి తప్ప క్రీడాస్ఫూర్తి మచ్చుకైనా లేకుండా జరుగుతున్న క్రీడా పోటీల గురించి వివరిస్తున్నారు* **సి. రాజశేఖర్**

# సామాన్యుల సంపద ఆటలకే చెల్లు

'కామన్' 'వెల్త్' 'గేమ్స్' అంటే సామాన్యుల డబ్బుతో ఆడే ఆటలని అనాలేమో. కామన్‌వెల్త్ గేమ్స్ 2010లో వెలుగు చూస్తున్న కుంభకోణాలు చూస్తుంటే ఇది నిజం అనిపిస్తుంది.

19వ కామన్‌వెల్త్ గేమ్స్ 2010 దేశ రాజధాని ఢిల్లీలో అక్టోబర్ 3 నుంచి 14 వరకు జరగనున్నాయి. ఇంతకు ముందు మన దేశంలో జరిగిన ఏషియన్ గేమ్స్ 1951, 1982ల తర్వాత నిర్వహించబోతున్న పెద్ద క్రీడా సంబరాలు.

దేశ ప్రతిష్ట పెంచుకోవడానికి, స్థానిక క్రీడాకారులకు ప్రోత్సాహం, అంతర్జాతీయ ఖ్యాతి, గుర్తింపు లభించడం కోసం అంతర్జాతీయ క్రీడలు నిర్వహిస్తారు. కానీ, ఇప్పుడు జరుగుతున్న ఈ క్రీడోత్సవాలలో వెలుగు చూస్తున్న అవినీతి కుంభకోణాలు, జరుగుతున్న జాప్యాలు దేశ ప్రతిష్టని దిగజారుస్తున్నాయి. 2006లో మొదలైన ఈ ప్రాజెక్ట్‌కు ముందుగా రు. 22,000 కోట్ల బడ్జెట్ నిర్ణయించారు. ఇప్పుడు అది నలభై శాతం పెరిగి రు. 30,000 కోట్లకు పెరిగింది.

ఈ కుంభకోణాలన్నిటికీ కామన్‌వెల్త్ గేమ్స్ ఆర్గనైజేషన్ కమిటీ (ఒ.సి.) చైర్మన్ సురేష్ కల్మాడి, జాయింట్ డైరెక్టర్ టి.ఎస్. దర్బారి, అధికారులు సంజయ్ మహింద్రూ, ఎం. జయచంద్రన్ ఇంకా తదితరులు బాధ్యులుగా ఉన్నారు. ఇవి వెలుగులోకి వచ్చిన పేర్లే. ఇంకా రాని వారి జాబితా చాలానే ఉంటుంది.

2003లో జమైకాలో జరిగిన ఈ బిడ్‌లో పాల్గొనే దేశానికి లక్ష డాలర్లు చెల్లించేటట్లుగా భారత ఒలంపిక్ సంఘం ఒప్పందం కుదుర్చుకుంది. వారికి రాను పోను ఎయిర్ టికెట్లు, భోజన, వసతి సదుపాయాలు, రవాణా సౌకర్యం, ఇలా అన్ని సదుపాయాలు సమకూరుస్తుంది. ఈ క్రీడల్లో 72 దేశాలు పాల్గొంటున్నాయి. 17 విభాగాలలో దాదాపు ఐదువేల మంది క్రీడాకారులు పోటీ పడనున్నారు.

వీరికి వసతి, రవాణా, భోజన, వైద్య, ఎంటర్‌టైన్మెంట్ సౌకర్యాల కల్పనకు భారత ప్రభుత్వం భారీగా ఖర్చు పెడుతోంది.

మన రాష్ట్రంలో ఎన్నో అవినీతి ఆరోపణలు ఎదుర్కొంటున్న ఎమార్ కంపెనీ పోటీలకు కామన్‌వెల్త్ విలేజ్ నిర్మాణ బాధ్యతలు చేపట్టింది. 2004లో దీనికోసం రు. 465 కోట్లు బడ్జెట్ అంచనా వేశారు. ఇప్పుడది రు. 1400 కోట్లు దాటింది. 158.4 ఎకరాలలో 34 టవర్‌లలో 1168 అపార్ట్‌మెంట్లు కడుతున్నారు. మార్చ్ 31, 2010 కల్లా పూర్తి కావాల్సింది. ఇంకా పనులు జరుగుతూనే ఉన్నాయి. ఈ క్రీడా గ్రామం ఢిల్లీలో అక్షర్‌ధామ్ గుడి దగ్గరలో నిర్మిస్తున్నారు. దీనికోసం

---

ఆదేశించింది. ఇదొక పెద్ద మలుపు. ఆరు నెలల గడువు మాత్రమే ఇచ్చినా సిబిఐ అద్భుతమైన ఫలితాలు రాబట్టింది. అమిత్ షా వసూళ్ల నేరాలపై 197 ఫిర్యాదులను వెలికి తీసింది. వేల గంటల ఫోన్ సంభాషణలను విశ్లేషించింది. సాక్షులు దొరికారు. అమిత్ షాపైన గురి పెట్టింది సి.బి.ఐ. హత్య కిడ్నాప్, బలవంతపు వసూళ్లు, నేర కుట్ర వంటి ఆరోపణలతో జూలై 25న అమిత్ షాను అరెస్టు చేసారు. 12 మంది పోలీసుల పైన పెద్ద నేరారోపణ పత్రాన్ని రూపొందించింది సిబిఐ. వ్యాపారులు దశరథ్, రమణ్ పటేల్ సోదరులు తమను హోం మంత్రి ఏవిధంగా వేధించాడో వివరంగా చెప్పారు. వారి మీద పటేల్ హౌజ్‌లో పోలీసుల చేత కాల్పులు జరిపించింది హోంమంత్రే.

డి.ఎస్.పి. నరేంద్ర కుమార్ అమిన్ సిబిఐకి చెప్పిన వాంగ్మూలం కీలకం. గుజరాత్ పోలీసులకు, నేరస్తులకు, రాజకీయ నాయకులకు మధ్య ఉన్న అక్రమ సంబంధాలను వివరించాడు అమిన్. మన కోర్టులకు సరిపోయే సాక్ష్యాలను సి.బి.ఐ. ఇవ్వగలిగితే ఇదొక చరిత్రాత్మకమైన కేసుగా మిగిలిపోతుంది. పోలీసులకు ఆత్మరక్షణ చేసుకునే హక్కు అందరికీ ఉన్నట్టే ఉంది. అయితే వారు ఆత్మరక్షణకే చంపారని ఎక్కడ ఎవరి ముందు ఏవిధంగా రుజువు చేస్తారు? వారిమీద హత్యకేసు నిందితులుగా కేసు దాఖలు చేయాలా వద్దా? పోలీసులే నిందితులుగా ఉన్న హత్యకేసులను పోలీసులు నమోదు చేసుకోకపోతే పౌరుడు ఏం చేయాలి? పోలీసులకు ఆత్మరక్షణ కోసం చంపే అధికారం ఉంది కనుక, కేసులు నమోదు నుంచి విచారణ నుంచి కోర్టుముందు ఆత్మరక్షణ రుజువు చేసుకునే బాధ్యతనుంచి మినహాయింపు ఉందా? ఉంటే మరి ఏ విధంగా ఆ ఘోరాలు రుజువు చేయాలి. ఒకవేళ ఆ మినహాయింపు ఉంటే వంజారాతో సహా 12 మంది పోలీసుల మీద ఇప్పుడు సిబిఐ పెట్టిన కేసులు ఉంటాయా? మినహాయింపు లేదని అయిదుగురు సభ్యుల రాష్ట్ర హైకోర్టు ధర్మాసనం 2009లో తీర్పు చెప్పింది. మినహాయింపు ఉందని ఈ కేసును సుప్రీంకోర్టు ముందుకు పోలీసు అధికారుల సంఘం తీసుకు వెళ్లి ఆ తీర్పు అమలుపై స్టే తెచ్చుకుంది. రాష్ట్ర హైకోర్టు తీర్పు ప్రకారం ముంబైలో కసబ్‌ను చంపినందుకు పోలీసుల మీద హత్యకేసు నమోదు చేయాల్సి వస్తుందని పోలీసులు వాదిస్తున్నారు. పోలీసులను దర్యాప్తు నుంచి మినహాయిస్తే ఎందరో సోహ్రాబుద్దీన్‌లు అవుతారని, ఎందరో మహిళలు రేప్‌కు, హత్యలకు గురయినా దిక్కు మొక్కు ఉండదని ముకుల్ సిన్హా వంటి న్యాయవాదులు వాదిస్తున్నారు. ఎన్‌కౌంటర్ మొట్టమొదటి సారి చట్టంతో ఎన్‌కౌంటర్‌ను ఎదుర్కొంటున్న ఎన్‌కౌంటర్ ఇది.

*(రచయిత నల్సార్ న్యాయశాస్త్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్)* వీ

ఢిల్లీ శివార్లలో నివసిస్తున్న పేదలను అక్కడి నుంచి తరిమేశారు. దాదాపు లక్షన్నర కుటుంబాలకు నిలువ నీడ లేకుండా పోయింది.

ఢిల్లీ నగరంలో అన్నిటి కంటే ముఖ్యంగా ట్రాఫిక్ సమస్య చాలా ఉంటుంది. ఫ్లై ఓవర్లు కట్టడానికీ, కొత్త రోడ్లు వేయడానికీ, ఉన్న రోడ్లకు మరమ్మత్తులు చేయడానికీ నగరమంతా గోతుల మయం చేసి పెట్టారు. సామాన్య ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ట్రాఫిక్‌ను క్రమబద్ధీకరించడానికి ముందుగా అనుకున్న రు. 40 కోట్లు రెండింతలై రు. 80 కోట్లకు చేరుకుంది. ఫ్లై ఓవర్ల నిర్మాణానికి మరో రు. 1650 కోట్లు. కాని, అంతర్జాతీయ విమానాశ్రయం నుంచి నగరం నడిబొడ్డు చేరుకోవడానికి సుమారు గంటన్నర సమయం పడుతుంది. ఇక ట్రాఫిక్ జామ్ అయితే అంతే సంగతులు.

ఢిల్లీ నగరాన్ని ఆధునీకరించేందుకు వెయ్యి కోట్ల రూపాయలు ఖర్చు చేస్తున్నారు. వీధుల్లో భిక్షాటన చేయడం నిషేధించారు. భిక్షాటన చేసేవారిని ఢిల్లీ దరిదాపుల్లో కనబడనీయకుండా చేసేందుకు వారిని అరెస్టు చేసి వారి స్వస్థలాలకు పంపించే ఏర్పాట్లు చేస్తున్నారు.

మొత్తం 19 స్టేడియంలలో ఈ పోటీలు నిర్వహించనున్నారు. జవహర్‌లాల్ నెహ్రూ స్టేడియం, ధ్యాన్‌చంద్ నేషనల్ స్టేడియం, ఇందిరా గాంధీ ఎరేనా, ఢిల్లీ యూనివర్సిటీ స్పోర్ట్స్ కాంప్లెక్స్, త్యాగరాజ్ స్టేడియం, సిరి ఫోర్ట్ స్పోర్ట్స్ కాంప్లెక్స్, డా. కర్ణీసింగ్ షూటింగ్ రేంజ్, తల్‌కటోర స్టేడియం, ఎస్.పి.ఎం. స్విమ్మింగ్ పూల్ కాంప్లెక్స్, ఆర్.కె. ఖన్నా టెన్నిస్ కాంప్లెక్స్, యమునా స్పోర్ట్స్ కాంప్లెక్స్.

2004లో వీటి నిర్మాణానికి, పాత స్టేడీయంలను పునరుద్ధరించడానికీ రు.1200 కోట్లు అంచనా వేశారు. ఇప్పుడు ఆ బడ్జెట్ కాస్తా రెండున్నర రెట్లు పెరిగి రు. 5,000 కోట్లకు చేరుకుంది. ఇంకా 13 స్టేడియంలలో పని కొనసాగుతోంది. ఈ స్టేడియంల నిర్వహణ, ఉపయోగం సంగతి గురించి ఇక చెప్పనక్కర్లేదు. పోటీలు అయిపోయిన తరువాత వాటిని ఎలా ఉపయోగిస్తారు అనేది పెద్ద ప్రశ్న.

స్టేడియం నిర్మాణానికీ, పునరుద్ధరణకూ దాదాపు నాలుగున్నర లక్షల మంది కార్మికులు పనిచేస్తున్నారు. రోజుకు వారికి 85 నుంచి 100 రూపాయలు ఇస్తున్నారు. కానీ, అక్కడ వారికి సరైన సదుపాయాలు, రక్షణ ఏర్పాట్లు లేవు. కార్మిక చట్టాల ఉల్లంఘన జరుగుతోంది. నిర్మాణ క్రమంలో ప్రమాదాలకు గురై దాదాపు 70 మంది వరకు మరణించారు. నిర్మాణం జరిగే ప్రాంతానికి సామాన్య ప్రజలకు ప్రవేశం లేదు.

29 అక్టోబర్ 2009న లండన్‌లో జరిగిన క్వీన్స్ బాటన్ రిలే నుంచి ప్రస్తుత క్రీడల కుంభకోణాల పర్వం మొదలయ్యింది. మూడు గంటల రిలే కార్యక్రమం గురించి రు. 670 కోట్లు ఖర్చు పెట్టారు. ఇది అంచనాలకు మించిన భారీ బడ్జెట్. అక్కడి టాక్సీలకు, ఆడియో-వీడియో కవరేజికి, వైద్య సదుపాయాలకు, హోటల్‌లో బసకు ఎక్కువ ధరలకు బేరాలు కుదుర్చుకున్నారు. అనామక కంపెనీలతో అధిక ధరలకు ఒప్పందాలు కుదుర్చుకున్నారు. ఒక రోజు కారు అద్దె 450 పౌండ్లుగా చూపించారు. మామూలుగా లండన్‌లో అతి ఖరీదైన బెంజ్ కారుకే రోజుకి 250 పౌండ్లు ఉంటుంది. మనవాళ్లు చెల్లించింది రెట్టింపు ధర. అది ఎవరి జేబుల్లోకి పోయింది.

అక్కడి నుంచి మొదలైన ఈ కుంభకోణాల పరంపర రోజుకొకటి బయటబడుతున్నాయి. ఇక కల్మాడీ ఆయన అనుచరుల విషయానికి వస్తే వారు వారి కుటుంబ సభ్యుల కంపెనీకి, వారి అనుయాయుల కంపెనీలకు అధిక ధరలకు కాంట్రాక్టులు కట్టబెట్టారు. అథ్లెట్‌లు ఉపయోగించే ట్రెడ్‌మీల్లులు, హాకీ టర్ఫ్‌లు, టెన్నిస్ లాన్‌లు, టాయిలెట్ పేపర్ రోల్స్, ఇలా అన్నింటిలో వాటిల్లోను కుంభకోణాలు వెలుగు చూస్తున్నాయి. నలభై ఐదు రోజులకు గాను ఒక ట్రెడ్‌మిల్‌కు పది లక్షల రూపాయలు చెల్లించి లీజుకు తీసుకున్నారు. కానీ, స్థానిక మార్కెట్‌లో అదే ట్రెడ్‌మీల్ నాలుగు లక్షలకు దొరుకుతుంది. ఇలాంటివి వెలుగులోకి వచ్చినవి కొన్నయితే, ఇంకా వెలుగులోకి రాని కుంభకోణాలు ఎన్నో ఉన్నాయి.

క్రీడోత్సవాల నిర్వహణకు భారత ప్రభుత్వం ఆర్గనైజింగ్ కమిటీకి రు. 1620 కోట్లు మంజూరు చేసింది. ఇది పూర్వం ప్రకటించిన రు. 767 కోట్లకు రెట్టింపు. ఢిల్లీ ప్రభుత్వం ఈ పోటీల నిర్వహణను ప్రతిష్ఠాత్మకంగా తీసుకుంది. దీని నిర్వహణకు గాను మునిసిపల్ కార్పొరేషన్ నిధుల నుండి రు. 171 కోట్లు మళ్లించింది. మునిసిపల్ కార్పొరేషన్ ఉద్యోగులకు, పెన్షన్‌దారులకు చెల్లింపులు తగ్గించారు. ఎస్.సి., ఎస్.టి. ఫండ్ నుంచి రు. 744.35 కోట్లు ఖర్చు చేశారు.

ఇంత భారీ వ్యయంతో, మానవ వనరులతో, ఎంతో మందిని ఇబ్బందులకు గురి చేస్తూ నిర్వహిస్తున్న ఈ కామన్‌వెల్త్ గేమ్స్ అసలు ఉద్దేశాలు ఏమిటి? సాధారణంగా క్రీడల ద్వారా దేశాల మధ్య స్నేహపూర్వక సంబంధాలు పెంచుకోవడానికీ, దేశ కీర్తిని ఎల్లలు దాటించడానికీ, క్రీడా స్ఫూర్తిని పెంచడానికీ, దేశీయ క్రీడాకారుల శక్తి సామర్థ్యాలను చాటడానికీ క్రీడా పోటీలు నిర్వహిస్తారు.

వంద కోట్లకు పైగా జనాభా ఉన్న భారతదేశం అంతర్జాతీయంగా క్రీడలలో అట్టడుగున ఉంది. మనకంటే చిన్న దేశాలైన ఆఫ్రికన్ దేశాలు ఇలాంటి క్రీడా పోటీలలో పథకాలు సాధించడంలో ఎంతో ముందున్నాయి. ఇప్పటికిప్పుడు ఈ పోటీలు నిర్వహించాల్సిన అవసరం ఏమీలేదు. దేశీయ క్రీడాకారులకు సరైన ప్రోత్సాహం కరువై దేశీయ క్రీడలు మరుగున పడుతున్నాయి. ఈ పెట్టుబడిని దేశీయ క్రీడలను అభివృద్ధి పరచి, స్థానిక క్రీడాకారులను అంతర్జాతీయ స్థాయికి తగ్గట్టుగా తీర్చిదిద్దడానికి ఉపయోగించవచ్చు. ఈ మొత్తాన్ని వినియోగిస్తే ఎంతో మంది క్రీడాకారుల నైపుణ్యం పెంపొందుతుంది.

డబ్బు చుట్టూ, లాభాల చుట్టూ తిరిగే, కాసులు కురిపించే క్రికెట్‌కు ఉన్నంత క్రేజ్ మన జాతీయ క్రీడ హాకీకి లేదు. మన దేశీయ క్రీడ అయిన కబడ్డీకి అంతర్జాతీయ గుర్తింపు లేదు. ప్రపంచంలోనే అతి సంపన్నమైన క్రీడా కమిటీగా క్రికెట్ ఉంది. మన దేశంలో క్రికెటర్లు, క్రికెట్ బోర్డు అధికారులు సంపాదిస్తున్న సంపాదన చూస్తే కళ్లు తిరుగుతాయి. ఇటీవల ఐ.పి.ఎల్.లో ఎన్నో వేల కోట్ల రూపాయల కుంభకోణాల నిలయంగా మారింది. కానీ, దానికి మాత్రం క్రేజ్ తగ్గలేదు.

ఇతర క్రీడలకు లేని ప్రాముఖ్యత క్రికెట్‌కే ఎందుకు? క్రికెట్ ఇప్పుడొక కార్పొరేట్ ఆట అయిపోయింది కనుక. ఇతర దేశీ క్రీడలకు ఎవ్వరూ స్పాన్సర్ చేయడం లేదు కనుక. ప్రభుత్వమే దేశీయ క్రీడలకు ప్రోత్సాహమిచ్చి, వాటిని వృద్ధి చేసుకునే దిశగా ప్రయత్నాలు చేయాలి.

'కామన్‌వెల్త్' అంటే సామాన్యుల సంక్షేమం. కానీ, ఈ కామన్‌వెల్త్ గేమ్స్ కొంతమంది స్వార్థపర పాలకుల, అధికారుల, కాంట్రాక్టర్ల లబ్ధి కోసమే జరుగుతున్నట్లు ఉంది. సగటు భారతీయుడికి సరైన తిండి, బట్ట, విద్య, వైద్యం, కనీస మౌలిక సదుపాయాలు కూడా అందడం లేదు. నేటికీ 40 శాతం మంది పేదరిక రేఖకు దిగువన ఉన్నారు. ఇటువంటి స్థితిలో మనకు ఈ 'కామన్‌వెల్త్ గేమ్స్' అవసరమా అనేది ఆలోచించుకోవాలి.

*(రచయిత వీక్షణం సబ్ ఎడిటర్, కరస్పాండెంట్)* వీ

ప్రజాస్వామ్యం ముసుగులో అమలవుతున్న దుర్మార్గాలను బయటపెట్టడంలో వికీలీక్స్ కొత్తదారి చూపించిందని అంటున్నారు **కె.వి. కూర్మనాథ్**

# రహస్య పాలనకు సామాన్యుల సవాల్

ప్రపంచ వ్యాప్తంగా నియంతలని, ప్రజాస్వామ్య వ్యతిరేక శక్తుల్ని అమెరికా పాలుపోసి పెంచుతుందనేది ఈరోజు కొత్తగా ఎవరూ చెప్పనక్కర్లేదు. ఇందుకోసం తన మిలిటరీ, ఇంటెలిజెన్స్ విభాగాలను ఎలా వాడుకుంటుందనేదీ అందరికీ తెలిసిందే.

ఈ రెండు విభాగాలు కలిసి ఈ మధ్య ముప్పై రెండు పేజీల రిపోర్ట్ ఒకటి తయారు చేసాయి. చాలా చిత్రంగా ఇందులో తాము ఏనాడూ గౌరవించని, అమలుపరచని ప్రజాస్వామ్య విలువల గురించి, పాత్రికేయ విలువల గురించి, మాట్లాడే హక్కు గురించి, ప్రైవసీ గురించి వివరంగా చర్చించాయి. జర్నలిస్టులు నిజానిజాలు తెలుసుకుని రాయాలని, అన్ని నిజాలు రాసెస్తే ప్రజలకు (అంటే ప్రభుత్వాలకు అని అర్థం చేసుకోవాలి) నష్టమని వాపోయింది.

ఈ రిపోర్ట్ తీసుకురావడం వెనక ఒక సందర్భం ఉంది. అది వికీ లీక్స్ (www.wikileaks.org). ఇంటర్నెట్‌లో ఉన్న లక్షల వెబ్‌సైట్లలో ఇది ఒకటి. ఏదో ఒకటి అయితే అమెరికా, చైనా, రష్యా, జింబాబ్వే వంటి అనేక దేశాల ప్రభుత్వాలకు ఇబ్బంది ఉండేది కాదు. నాలుగేళ్ల వయసున్న ఈ వెబ్‌సైట్ ప్రభుత్వాల్నీ, కంపెనీలనూ గడగడలాడిస్తున్నది. ఆ ప్రభుత్వాలు, అవి నడిపే మిలిటరీలు, కంపెనీలు చేస్తున్న ఘనకార్యాలను బయట పెడుతోంది.

అమెరికాను, ఇంకా ఇతర ప్రభుత్వాలను కలవరపెడుతున్నదే మిటంటే, ఇంటర్నెట్‌లో రూపుదిద్దుకుని, ప్రపంచవ్యాప్తంగా బలపడుతున్న ఒక నమూనా గురించి. కేవలం రహస్య సమాచారం సేకరించడం మాత్రమే కాకుండా, ఆ సమాచారాన్ని అందజేసే వాళ్ల వివరాలను గోప్యంగా ఉంచే ఏర్పాటు చేసింది.

తెర వెనుక పనిచేస్తున్న వందల మంది మేధావులు, సాంకేతిక నిపుణుల సహాయంతో ఒక పటిష్టమైన సాంకేతిక రక్షణ వలయాన్ని ఏర్పాటు చేసుకుంది. తన దగ్గరున్న సమాచారాన్ని కాపాడుకోవడానికి చాలా దేశాల్లో సర్వర్లను రహస్యంగా ఏర్పాటు చేసుకుంది. (ఇంటర్నెట్‌లో ఏ వెబ్‌సైట్‌నైనా ఎక్కడి నుంచైనా చూడొచ్చు కానీ, దానికి ఏదో ఒక సర్వర్‌లో చోటుండాలి. ఈ సర్వర్లు ప్రపంచంలో ఎక్కడైనా ఉండొచ్చు. వీటిని ఎవరో ఒకరు అద్దెకిస్తూ ఉంటారు. సంవత్సరానికింత అని వసూలు చేస్తారు.)

ఒకానొక సర్వర్ స్వీడన్‌లో ఉన్నట్టు వికీలీక్స్ నిర్వాహకులు ప్రకటించారు. అలా ధైర్యంగా ఎలా చెప్పగలిగారంటే, స్వీడన్ రాజ్యాంగం సమాచార వ్యక్తీకరణకు సంపూర్ణ స్వేచ్ఛనిస్తుంది. సమాచారం ఎవరు సంపాదించారన్న విషయాన్ని గోప్యంగా ఉంచవచ్చు.

రహస్యాలను బయటపెడితే ఏ ప్రభుత్వాలు సహిస్తాయి? అవి బయటపెట్టేవాళ్లని, తెలిసిన వాళ్లని వేటాడి వెంటాడి వేధిస్తాయి. అంతమొందిస్తాయి. మనదేశంలోనే సమాచార హక్కు కింద 'సమాచారాన్ని సేకరిస్తున్న వాళ్లని' ఎలా చంపుతున్నారో మనం చూస్తున్నాం. అందుకేనేమో, తమ సంస్థలో ఎవరెవరున్నారో, వాళ్లే దేశస్తులో, వాళ్లు ఎక్కడెక్కడి నుండి పని చేస్తున్నారో నిర్వాహకులు బహిర్గతం చెయ్యలేదు. ఒకరిద్దరు పేర్లు కంటే ఎక్కువ బయట పడలేదు.

### దీని వెనక ఎవరున్నారు?

ప్రజాస్వామ్య వ్యక్తీకరణకు ఎలాంటి స్వేచ్ఛలేని చైనాలోని (చైనా బయట) అసమ్మతివాదులు, జర్నలిస్టులు, సైంటిస్టులు, ఇన్ఫర్మేషన్

### ప్రభుత్వాలు ఎందుకు భయపడుతున్నాయి?

ప్రభుత్వాలన్నీ ప్రజా వ్యతిరేకమైనవే. వాటన్నిటికీ ఏదో కొద్ది శాతం ప్రజల ప్రయోజనాలను రక్షించే ఎజెండా ఉంటుంది. దీనికోసం వాళ్లు మెజారిటీ ప్రజల అవసరాలకు వ్యతిరేకంగా చట్టాలను తీసుకు రావాలి. (దీనికి ఎన్నో ఉదాహరణలు : మైనింగ్‌ను యథేచ్ఛగా చేసుకోడానికి, భారీ నీటి ప్రాజెక్టులు, న్యూక్లియర్ ప్లాంట్‌లు పెట్టడానికి అనువుగా చేసే చట్టాలు, చట్టాల్లో మార్పులు).

వికీలీక్స్ వంటి సైట్ల వల్ల ఇలాంటివి బయటకు రావచ్చు. ప్రభుత్వాల్లో అసమ్మతివాదులకు ఇది ఒక వేదికగా మారితే తమకు తలనొప్పిగా పరిణమించవచ్చని భయం కూడా వాళ్లను వెంటాడుతోంది.

ప్రజాస్వామ్యం పేరుతో తాము అమలుపరుస్తున్న అప్రజాస్వామిక విధానాలు బయట పడిపోతాయేమోనని, అమానుష హత్యాకాండల వివరాలు బయటకొస్తాయేమోనని ప్రభుత్వాల భయం. అంతేకాదు, ఏయే ప్రభుత్వాలు ఈ ప్రజావ్యతిరేక కార్యకలాపాలను అమలు పరచడం కోసం చేతులు కలుపుతున్నాయో ప్రపంచానికి తెలిసిపోతుంది.

ఇది అలవాటుగా మారి జర్నలిస్టులు, ఉద్యమకారులు రహస్య డాక్యుమెంట్లను సంపాదించి వికీలీక్స్‌కు పంపిస్తారేమోనని, ప్రభుత్వాలు, మిలిటరీల్లో పనిచేసి అన్యాయంగా ఉద్యోగాలు కోల్పోయిన వాళ్లు తమకు అందుబాటులో ఉన్న సమాచారాన్ని బయట పెట్టిస్తారేమోనన్న భయం కూడా వాళ్లని వెంటాడుతోంది.

ప్రపంచ వ్యాప్తంగా ప్రజాస్వామ్య విలువల్ని ప్రేమించే వాళ్లు పౌరహక్కుల కోసం పోరాడే వాళ్లు వికీలీక్స్ చూపిన తోవలో కొత్త కొత్త వెబ్‌సైట్లను తెరిచి కొత్త సవాళ్లను విసురుతారేమోనని ప్రభుత్వాలు ఆందోళన పడుతున్నాయి.

టెక్నాలజీలో అనుభవం ఉన్న వాళ్లు ఈ వెబ్‌సైట్‌కు వెన్నుదన్నుగా ఉన్నారు. అమెరికా, తైవాన్, యూరప్, ఆస్ట్రేలియా, దక్షిణ ఆఫ్రికా లాంటి దేశాల నుండి కూడా ఈ వెబ్‌సైట్ కోసం పని చేస్తున్నవారు ఉన్నారు.

'ఆసియా, సోవియట్ యూనియన్ నుంచి విడివడ్డ దేశాలు, ఆఫ్రికా, గల్ఫ్ దేశాల్లోని నియంతృత్వ ప్రభుత్వాల అసలు రంగు బయట పెట్టడమే మా లక్ష్యమ'ని వికీలీక్స్ నిర్వాహకులు ప్రకటించుకున్నారు.

'కేవలం ఆ ప్రభుత్వాలే కాదు, తమ తమ దేశాల ప్రభుత్వాలు, కంపెనీలు అనైతిక విధానాలను బహిర్గతపరచాలనుకునే ఎవరికైనా మా మద్దతుంటుందని' వాళ్లు ప్రకటించారు.

ఈ వెబ్‌సైట్‌ను తెరిచి నాలుగేళ్లయినా, ప్రపంచ వ్యాప్తంగా దృష్టిని ఆకర్షించింది మాత్రం ఏప్రిల్ 2010లో. ఇరాక్‌లో అమెరికన్ సైనికులు హెలికాప్టర్ నుండి కాల్పులు జరిపి పద్దెనిమిది మందిని కాల్చిచంపిన సంఘటనకి సంబంధించిన వీడియోని ప్రసారం చేసినపుడు అందరూ నివ్వెరపోయారు. ముప్పై తొమ్మిది నిమిషాల నిడివి ఉన్న ఈ వీడియో ప్రపంచాన్ని దిగ్భ్రమకి గురిచేసింది. చనిపోయిన వారిలో ఇద్దరు జర్నలిస్టులుండడంతో మీడియాలో ఇంకా ఎక్కువ ప్రచారం వచ్చింది.

ఈ వీడియోను యూట్యూబ్ (www.youtube.com) లో పెడితే కేవలం కొన్ని రోజుల వ్యవధిలోనే ఇరవై లక్షల మంది చూసారంటే అది ఎంత సంచలనం సృష్టించిందో ఊహించవచ్చు. న్యూయార్క్‌టైమ్స్ లాంటి పత్రికలు ఆ కాల్పుల ఉదంతంపై కథనాలు రాయక తప్పని పరిస్థితి ఏర్పడింది.

అమెరికా సైన్యం ఇట్లాంటి ఆకృత్యాలకు పాల్పడడం ఎవరికీ కొత్త కాదు గాని, ఇలా సాక్ష్యంతో సహా చూడడం వికీలీక్స్ వల్లనే సాధ్యమయింది. అంతవరకూ రాబర్ట్ ఫిస్కేలాంటి ఎవరో కొద్దిమంది జర్నలిస్టులు రాసింది చదవడమే గాని, ఇరాక్‌లో అమెరికా సైన్యం జరుపుతున్న మారణకాండ పై రావాల్సినంత ప్రచారం జరగలేదు. ఈ ఉదంతం గురించి అమెరికా మిలిటరీ ఏమనుకుంటుందో తెలుసుకుందా మనుకునే జర్నలిస్టులకు ఈనాటికీ సమాధానం లేదు.

గత నెలలో అఫ్ఘన్‌వార్ డైరీ పేరుతో 56 వేల డాక్యుమెంట్లను ప్రపంచం ముందుంచింది. ఇంకో ఇరవై వేల డాక్యుమెంట్లు, రిపోర్ట్‌లు తమ దగ్గర ఉన్నాయని వికీలీక్స్ నిర్వాహకులు ప్రకటించారు.

దాదాపు ఈ రెండు 'లీక్'లు ప్రపంచ వ్యాప్తంగా పెద్ద చర్చనే లేవదీశాయి. వికీలీక్స్ నిర్వాహకులకు వేధింపులు మొదలయ్యాయి. వీరి నెట్‌వర్క్‌ను ఛేదించడానికి, బలహీనం చెయ్యడానికి అమెరికా ప్రభుత్వ నేతృత్వంలో పెద్ద ఎత్తున ప్రయత్నాలు మొదలయ్యాయి. ఈ వెబ్‌సైట్‌తో సంబంధం ఉన్న వాళ్లను నీడలా వెన్నాడుతూ, రహస్య కెమెరాలతో ఫొటోలు తీస్తున్నారని నిర్వాహకులు ఆరోపించారు.

తాజాగా, నిర్వాహకుల్లో ఒకరైన అసాంగే పై స్వీడన్‌లో ఒక రేప్ కేసు నమోదైంది. వికీలీక్స్ అధికారిక సర్వర్ ఈ దేశంలో ఉందనేది గమనార్హం. సమాచార సేకరణ విషయంలో అక్కడ ఉన్న అసాధారణమైన హక్కులు ఉన్నాయి కాబట్టి వికీలీక్స్‌ను దెబ్బకొట్టడానికే ఈ కేసు నమోదయి ఉండొచ్చని ఒక బలమైన వాదన వినిపిస్తోంది. వెబ్‌సైట్ విశ్వసనీయతను దెబ్బకొట్టడం, అసాంగేని అరెస్టు చెయ్యడం, శిక్ష పడేట్టు

### కొన్ని ముఖ్యమైన లీక్‌లు

1) బ్రిటిష్ నేషనల్ పార్టీ (బి.ఎన్.పి.) అనే బ్రిటన్‌కు చెందిన ఫాసిస్టు వాసనలున్న పార్టీలో సభ్యుల వివరాలు. దాదాపు పద్నాలుగు వేల మంది బి.ఎన్.పి. సభ్యుల్లో పోలీసు అధికారులు, మతాధికారులు ఉన్నారు. ఇప్పటివరకూ ఈ సభ్యుల వివరాలు ఎవరికీ తెలియవు.
2) ఐక్యరాజ్య సమితికి చెందిన దాదాపు 600 రహస్య రిపోర్టులు.
3) ఆస్ట్రేలియా ప్రభుత్వం నిషేధించాలని అనుకున్న వెబ్‌సైట్ల వివరాలు.
4) ఐవరీ కోస్టులో విషపదార్థాలను వదలడం వల్ల వేలాది మంది ప్రజల ఆరోగ్యాలు పాడవడంపై రిపోర్టు. ఏయే విషపదార్థాలు, ఎంత మోతాదులో అక్కడికి తరలించారో – అన్ని వివరాలను బహిర్గత పరిచిన రిపోర్టు అది.
5) సెప్టెంబర్ 11 నాటి పేజర్ మెసేజ్‌లు. పెంటగాన్ (అమెరికా రక్షణ శాఖ ప్రధాన కార్యాలయం)కు న్యూయార్క్ సిటీ పోలీస్‌కు మధ్య నడిచిన ఐదు లక్షల డెబ్బై వేల మెసేజ్‌లు.
6) వికీలీక్స్‌పై అమెరికా ఇంటెలిజెన్స్ విడుదల చేసిన రిపోర్ట్.
7) బాగ్దాద్ వీథుల్లో హెలికాప్టర్ మీంచి జరిపిన కాల్పుల వీడియో.
8) అఫ్ఘన్ వార్ డైరీ.
9) యుద్ధతంత్రాలపై ఇండియన్ ఆర్మీ విడుదల చేసిన మూడు భాగాల రిపోర్ట్.

త్వరలో విడుదల : అఫ్ఘనిస్తాన్‌లో అమెరికా సైనికుల మారణకాండపై వీడియో లీక్.

చెయ్యడం ద్వారా వికీలీక్స్ అస్తిత్వాన్ని దెబ్బగొట్టడం ఈ కేసు ప్రధాన లక్ష్యం కావచ్చని అంటున్నారు.

కేవలం చందాల మీదనే ఆధారపడ్డ వికీలీక్స్ అన్ని రకాల వనరులూ, అధికారం, చట్టాల కవచాలూ ఉన్న ప్రభుత్వాలను ముఖ్యంగా, అమెరికా లాంటి ప్రపంచ పోలీస్‌ను ఎదుర్కొని మనగలడం అంత సులువేమీ కాదు.

ఏదో ఒకరోజు వికీలీక్స్ వెన్ను విరగొచ్చు. ఏదో ఒక విధంగా దాన్ని నీరసపరిచే అరెస్టులు జరగొచ్చు. సర్వర్ల మీద సాంకేతికపరమైన దాడులు జరగొచ్చు. లేదా కేసులు పెట్టి నిరాశకు గురిచెయొచ్చు. కానీ, వికీలీక్స్ అనే ప్రయోగం మూడో ప్రపంచ దేశాల్లోని ప్రజలకు గొప్ప ఊరట. ఇంటర్నెట్‌ను వాడుకుని ఎక్కువ ప్రయత్నమేమీ లేకుండానే ప్రజాస్వామ్యం ముసుగులో జరుగుతున్న మారణకాండను, హింసను బట్టబయలు చెయ్యవచ్చునని వికీలీక్స్ రుజువు చేసింది. 'ప్రజాస్వామ్యాలను' నిలబెట్టడానికి ఎన్ని అప్రజాస్వామిక దాడులు జరుగుతున్నాయో బహిరంగపరచవచ్చునని భరోసానిచ్చింది.

### భారతదేశానికి సంబంధించి...

వికీలీక్స్ ఉద్యమానికి ఇంకా రావాల్సినంత ప్రచారం, సహకారం రాలేదు. ఇట్లాంటి వెబ్‌సైట్లను వాడుకుని ప్రభుత్వాలు చేస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలను బహిర్గతం చెయ్యడానికి ప్రజలు పూనుకోడానికి ఇంకొంచెం సమయం పట్టొచ్చు. ఇట్లాంటి వెబ్‌సైట్లకు ప్రచారం కల్పించి ప్రజానుకూలమైన వార్తలను, హక్కుల హరణకు సంబంధించిన వివరాలను సేకరించి పంపేట్టు చేయగలిగితే ప్రభుత్వాల్ని ఇరకాటంలో పెట్టొచ్చు.

*(రచయిత పాత్రికేయులు)* వీ

*అరవై మూడేళ్ల దేశ స్వాతంత్ర్యం సామాన్య ప్రజలకు ఆహార భద్రత, విద్య, వైద్యం వంటి కనీస మౌలిక అవసరాలను కూడా తీర్చలేకపోయిందని అంటున్నారు* **వి. హనుమంతరావు**

# ప్రధాని హామీలు నీటి బుడగలు

'సస్య విప్లవం తరువాత వ్యవసాయంలో పెద్దగా ఏమీ సాంకేతిక మార్పు లేదు'; 'భూగర్భ జలాలు మరింత లోతుకుపోతున్నాయి. భూసారం అడుగంటిపోతోంది'; 'భౌతిక మౌలిక సౌకర్యాల కొరత పెద్దగా కానవస్తుంది'; 'పరిశ్రమలకు విద్యుత్ సరఫరాలో లోటు కనిపిస్తోంది'; 'మన రహదారులు, పోర్టులు, విమానాశ్రయాలు ప్రపంచ స్థాయికి చేరుకోలేదు'; 'గ్రామాల్లో, పట్టణాల్లో పారిశుధ్య సౌర్యాలు ఉండాల్సినంత స్థాయిలో లేవు'; 'నాయకుల రాజకీయ ఉపన్యాసాల్లో ఘాటైన, ఇబ్బంది కలిగించే మాటలు ఇటీవల కాలంలో ఎక్కువవుతున్నాయి'; జూన్ ఆఖరు వరకు ద్రవ్యోల్బణం పదిశాతం దాటింది. ఆహార ద్రవ్యోల్బణం 11.40 శాతానికి చేరింది'; 'రైతుకు కిట్టుబాటు ధర లభిస్తున్నందువల్ల ధరల పెరుగుదల అనివార్యమైంది'; 'మెట్ట ప్రాంత వ్యవసాయాభివృద్ధికి సాంకేతిక పరిజ్ఞానం అవసరముంది'.

ఇవన్నీ ప్రతిపక్షాలు తరచుగా చేస్తూ వస్తున్న విమర్శలు. 1947లో అధికార మార్పిడి జరిగినప్పటి నుంచి చేస్తూ వచ్చిన విమర్శలు. అవునా? అవును. కాని పై విమర్శలన్నీ ప్రధాని మన్మోహన్ సింగ్ ఆగస్ట్ 15న చేసిన ఉపన్యాసంలో భాగాలు. ఆంగ్ల పత్రిక 'బిజినెస్ స్టాండర్డ్' విలేఖరి పంపిన వార్తల్లోంచి ఉల్లేఖిస్తున్నా. ప్రజా సామ్యవాదులు, మేధావులు, అనేక మంది ఆర్థిక శాస్త్రవేత్తలు అసంఖ్యాక ప్రజానీకం కొన్ని దశాబ్దాలుగా వెలిబుచ్చుతూ వచ్చిన అభిప్రాయాలివి. ప్రజానీకం చేస్తున్న అందోళనలు, పోరాటాల ద్వారా వ్యక్తం చేస్తూన్న విషయాలను ఆకళింపు చేసుకోవడానికి మహా మేధావి మన్మోహన్ సింగ్‌కు ఇన్ని దశాబ్దాలు పట్టిందనుకోవాలా? లేక ప్రజల ఆగ్రహాలు కట్టలు తెంచుకొంటున్న వైనం నుంచి, బెంబేలెత్తి చేతల్లో కాకపోయినా, మాటల్లోనైనా వారిని జోకొట్టే ప్రయత్నమా? ఏమైనా, ప్రతిపక్షాలు, ముఖ్యంగా వామపక్షాలు చేస్తూ వచ్చిన విమర్శలు సహేతుకమైనవేనని ప్రధాని అంగీకరించి నందుకు సంతోషిద్దాం. కాని ఈ సమస్యలకు పరిష్కారాలేమైనా సూచించారా అని చూడబోతే, ఆ సంతోషం కాస్తా హరించుక పోతుంది. ద్రవ్యోల్బణాన్ని తగ్గించడం, ఆహారోత్పత్తి పెంచడం, మౌలిక సౌకర్యాలను ఏర్పాటు చేయడం దేశమెదుర్కొంటున్న ప్రధాన సమస్యలని చెప్పినపుడు, ప్రతి సమస్య పరిష్కారానికి ప్రభుత్వం ఏమి చేస్తుందో చెప్పాలిగా. కాని, ఈ సమస్య వివరాల్లోకి పోదలచుకోలేదని, 'ప్రభుత్వం చేయగలిగిందంతా చేస్తుంద'ని ఒక హామీ ఇచ్చారు. ఇలాంటి హామీలతో అరవై సంవత్సరాలు కాపురం చేసాం. ఈ హామీలు గాలిలో నీటి బుడగల్లాంటివని అనుభవంలో తెలుసుకొన్నాం. రాజ్యాంగంలో పొందుపరిచిన ఆదేశాల అమలుకే దిక్కులేదు. అలాంటిది హామీలో లెక్క?

## రైతుకు కిట్టుబాటు ధర

వీటన్నిటిలో 'రైతుకు కిట్టుబాటు లభిస్తున్నందువల్ల ధరల పెరుగుదల అనివార్యమైంది' అని ప్రధాని అనడం ఒక దారుణమైన స్టేట్‌మెంట్. నూటికి అరవై శాతంగా ఉన్న రైతాంగాన్ని అపహాస్యం చేయడమే. కిట్టుబాటు ధర నిర్ణయించాలని అశేష రైతాంగం సంవత్సరం తర్వాత సంవత్సరం కనీస ధరలు నిర్ణయించే కాలంలో ప్రభుత్వానికి నివేదించడం జరుగుతుంది. ఈ సంవత్సరం వరికి బోనస్‌తో కలిపి నిరుడు ఇచ్చిన ధరనే ఇపుడు ప్రకటించడం, అందులోనూ వ్యవసాయ కూలీలు లభించడం లేదని, ఎరువులు, విత్తనాలు కోసం వందల మంది బారులు తీరి క్యూలో నిల్చోవడం, కల్తీ సరుకు కొని భంగపడడం జరుగుతున్న నేపథ్యంలో రైతుకు కిట్టుబాటు ధర లభిస్తుందని ప్రధాని చెప్పడం పుండు మీద కారం జల్లినట్లుంది. ఈ రైతుల మూలానే ధరలు పెరుగుతూండడం అనివార్యం అనడం రైతుల పట్ల ప్రధాని అంతటి పెద్ద మనిషి అపచారం చేయడమే అవుతుంది. ఇది రైతాంగాన్ని ఆగ్రహానికి గురి చేయడమే. రైతాంగం అసంఘటితంగా ఉండడం వల్ల ప్రభుత్వం బతికిపోయింది గాని, వారి ఉద్యమానికి సంఘటిత స్వరూపమే ఉండి ఉంటే దేశం భగ్గున మండిపోయేది.

ఒక పక్క ద్రవ్యోల్బణం, ఆహార ద్రవ్యోల్బణం హద్దూ అదుపూ లేని విధంగా పెరుగుతూ వచ్చిందని ప్రభుత్వమే విడుదల చేసిన గణాంకాలు తెలియజేస్తున్నాయి. ధరలు పెరిగినపుడు వ్యవసాయానికి అవసరమయ్యే ఎరువులు, విత్తనాలు, ఇతర ముడిసరుకుల ధరలు కూడా పెరుగుతాయని, రైతు ఖర్చు పెరుగుతుందని ప్రధానికి చెప్పాల్సిన పని లేదు. అలాంటపుడు గత సంవత్సరం వరి ధరనే ఈ సంవత్సరం కూడా నిర్ణయించడం ఎంత అసంబద్ధమైన విషయమో ప్రధానికి తెలిసి కూడా రైతుకు కిట్టుబాటు ధర లభిస్తూందని అనడం ప్రజాభిప్రాయానికి వ్యతిరేకం. ప్రభుత్వమే నియమించిన స్వామినాథన్ కమిషన్ ఉత్పత్తి వ్యయానికి యాభై శాతం కలిపి రైతుకు మద్దతు ధర ఇవ్వాలని సిఫార్సు చేసి మూడేళ్లయింది. ప్రధాని ప్రకటన ఇందుకనుగుణంగా ఉందా?

పరిశ్రమలకు విద్యుత్ సరఫరా లోటు ఉందని ప్రధానికి ఇపుడే తెలిసిందా ఏమిటి? గత మూడు పంచవర్ష ప్రణాళికల కాలం నుంచి ప్రణాళికా లక్ష్యాలను సాధించలేక పోయిందని ఆయనకు తెలియని విషయమా? స్వయంగా ప్రణాళికా సంఘం అధ్యక్షుడైన ప్రధాని విద్యుత్ విషయంలో ఇపుడే మేల్కొన్నారా? వ్యవసాయ రంగంలో విద్యుత్ లోటు రైతులను ఎన్ని కష్టాలకు గురిచేస్తుందో ఆయనకు గుర్తురాకపోవడం, పరిశ్రమలకేర్పడిన ఇబ్బందే గుర్తురావడం చూస్తే దేశంలో కార్పొరేట్

రంగం పాలకుల ఆలోచనలను ఎలా ప్రభావితం చేస్తుందో తెలియ చేస్తుంది.

## ఉన్నత విద్య – ప్రాథమిక విద్య

ఉన్నత విద్యపై దృష్టి సారించాలట. ఇది ప్రధాని నోటి నుంచి రాలిన మరో ఆణిముత్యం. ఇది పునాదులు తవ్వకుండా భవనం నిర్మించడమే. ఆర్థిక సామ్రాజ్యవాదులు దేశపాలకులను ఎక్కేస్తున్నారు. దేశం అభివృద్ధి వైపు దూసుకుపోతోంది. అలాంటి దేశానికి మేధ స్సంపన్నులు, నిపుణులు కావాలి. అందుచేత మీకు విద్యాధికులు కావాలి. మరిన్ని విశ్వవిద్యాలయాలు, సాంకేతిక విద్య గరపే ఉన్నత విద్యాసంస్థలు కావాలి. మేము కూడా మీ దేశం వచ్చి మా విశ్వవిద్యాలయాల శాఖలు ఏర్పాటు చేస్తాం. మీకు చదువు చెప్తాం – ఇదీ ఆ దేశాల ప్రచార ధోరణి. ఇది ప్రభుత్వ వర్గ దృక్పథాన్ని తెలియజేస్తుంది. విద్యారంగంలో ఉన్నత స్థాయి చేరిన వారి గురించే ప్రభుత్వం కేంద్రీకరిస్తుందనీ, అట్టడుగున ఉన్న వారి సంగతిని గాలికి వదిలేసిందనీ స్పష్టం. ఏదోకంటి తుడుపుగా సర్వశిక్షా అభియాన్ లాంటి పథకాలతో ప్రాథమిక విద్యకు ఏదో వండి వొరగబెట్టినట్లు మాట్లాడుతుంది. నిన్నటి, మొన్నటి దక్కన్ క్రానికల్ పత్రిక ప్రత్యేక వార్తా కథనం ప్రకారం ఒకటవ తరగతిలో 2000–01లో 22.89 లక్షల మంది విద్యార్థులుండగా, వాళ్లు పదవ తరగతి స్థాయి చేరేనాటికి వారి సంఖ్య 10.67 లక్షలకు పడిపోయింది. అంటే 53.36 శాతం మంది డ్రాపవుట్ అయ్యారు. బహుళ ప్రచారంలో ఉన్న సర్వశిక్షా అభియాన్ అమలు చూడబోతే ఆ పథకం కోసం కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు 2000–01 నుంచి పదివేల కోట్లు ఖర్చు పెట్టినా, ఉచిత మధ్యాహ్న భోజనం, పాఠ్యపుస్తకాల పంపిణీ చేస్తున్నా, ఫలితాలు ఎంత నాసిగా ఉన్నాయో పై గణాంకాలు తెలియజేస్తున్నాయి. ఎస్.సి., ఎస్.టి.ల విద్య విషయానికొస్తే ఎస్.సి. విద్యార్థుల సంఖ్య పైన ఉదహరించిన కాలంలో 4,76,514 నుంచి 1,99,423కు, ఎస్.టి. విద్యార్థుల సంఖ్య 3,12,309 నుంచి కేవలం 72,606కు పడిపోయింది. 86 లక్షల మంది బాల బాలికలకు మధ్యాహ్న ఉచిత భోజనం పెడుతున్నామనేది ప్రభుత్వ లెక్క. కాని వారికి వండి పెట్టేవారికి ఆరేడు నెలల నుంచి జీతాలే ఇవ్వడంలేదు. కేంద్ర మంత్రి కపిల్ సిబాల్ విదేశీ విశ్వ విద్యాలయాలను మన దేశానికి ఆహ్వానించాలని మహా తొందర పడుతున్నారు. 1991లో దేశంలో ఆర్థిక సంస్కరణలను ప్రవేశపెట్టి దేశ గతినే మార్చేశామట. అలాగే విద్యారంగంలో విదేశీ విశ్వ విద్యాలయాలను ప్రవేశపెట్టి విప్లవకరమైన మార్పులు సాధించేయ వచ్చునట. అందుకోసం పార్లమెంట్‌లో ఒక బిల్లు కూడా ప్రవేశపెట్టారు. ఇందుకు ప్రధాని పచ్చజెండా చూపించాడు. ఇప్పటికే దేశంలో ఉన్నత విద్య ఖరీదు చాలా ఎక్కువ; సామాన్యులు, కింది మధ్యతరగతికి ఉన్నత విద్య అందుబాటులో లేదు. అది సంపన్నులకే పరిమితం. అలాంటి వారు ఈ విదేశీ విద్యాలయాల పట్ల కన్నెత్తి చూడనైనా లేరు. అలాంటి వారిప్పుడు విదేశాలకు చదువు కోసం వెళ్తున్నారు. మీరక్కడి దాకా వెళ్లనక్కరలేదు. ఆ విశ్వవిద్యాలయాలను ఇక్కడికే రప్పిస్తానని సిబాల్ ఆగర్భ శ్రీమంతులకు చెపుతున్నారన్న మాట. దీనినే ఇంగ్లిష్ భాషలో 'ఇన్‌స్టెడ్ ఆఫ్ మొహమ్మద్ గోయింగ్ టు ది మౌంటెయిన్, మౌంటెయిన్ విల్ కమ్ టు మొహమ్మద్'. ఇది ఇంక్లూజివ్ గ్రోత్ కాదు, ఎక్స్‌క్లూజివ్ గ్రోత్. మన విశ్వ విద్యాలయాలు ఎలా తగలడుతున్నాయో, ఇటీవల యూనివర్సిటీ గ్రాంట్స్ కమిషన్ అధ్యక్షుని మీద పడిన వేటు ఒక ఉదాహరణ. రాజకీయ జోక్యం, వైస్ ఛాన్సలర్ పదవుల కోసం రాజకీయ నాయకుల కాళ్లా వేళ్లా పడడం, మన రాష్ట్ర గవర్నర్ ఛాన్సలర్ హోదాలో ప్రస్తుత వైస్ ఛాన్సలర్ మీద కొరడా ఝుళిపించాల్సి రావడం లాంటి రోగాలతో మన విశ్వవిద్యాలాయలు గబ్బు కంపు కొడుతున్నాయి. ఏ విదేశీ విశ్వవిద్యాలయమో వచ్చి ఈ పరిస్థితిని మార్చలేవు. మనకు మనమే మారాలి. ప్రతి చిన్న పెద్ద సమస్య పరిష్కారానికి విదేశాల వైపు, విదేశీ రుణాల వైపు చూసే మన్మోహన్ ఆ మార్పు తీసుకొని వస్తారనుకోవడం భ్రమ. ప్రపంచంలో 76 కోట్ల మంది నిరక్షరాస్యు లుండగా, వారిలో సగానికి పైగా బంగ్లాదేశ్, చైనా, భారత్, పాకిస్తాన్‌లలో ఉన్నారని, ఈ దేశాల్లో భారతదేశం అగ్రస్థానంలో ఉందని ఐక్యరాజ్య సమితి గ్లోబల్ మానెటరింగ్ నివేదిక తెలియచేస్తోంది. అలాంటి పరిస్థితిలో ప్రాధాన్యత ఇవ్వాల్సింది ఉన్నత విద్యకా, ప్రాథమిక విద్యకా? మన్మోహన్‌జీ శలవిస్తారా?

## ఆహార అభద్రత

ఆహార భద్రత గురించి దేశమంతా ఆందోళన వెలిబుచ్చుతూంటే, ప్రధాని ఎర్రకోట ఉపన్యాసంలో ఆ విషయమే ప్రస్తావించక పోవడం క్షమించరాని నేరం. దేశంలో రెండు మూడు రాష్ట్రాలకు పెద్ద స్థాయిలో పరిమితమైన మావోయిస్టు ఉద్యమం గురించి మాట్లాడడానికి సమయం దొరికిందిగా గాని నూరు కోట్ల మంది ప్రజల పై వేటు పడబోతున్న ఆహార భద్రత గురించి ఎంత ప్రాధాన్యాత ఇవ్వాలి? కాని దాని ఊసే లేకపోతే, అలాంటి ప్రధానిని ఏం చెయ్యాలి? ప్రణాళికా సంఘం అంగీకరించిన టెండుల్కర్ కమిటీ నివేదిక ప్రకారం దేశంలో 40 శాతం మంది పేదరికపు రేఖ కింద ఉన్నారు. ఆయన నివేదిక రాసేనాటికి ఉన్న ధరల ప్రకారం అంచనా అది. అప్పటి నుంచి ధరలు ఎలా పెరిగాయో, మనందరికీ తెలిసిన విషయమే. అంటే పేదల లెక్క ఇంకా పెరుగుతుంది. వీరందరి ఆహార అభద్రతకు బాధ్యులెవరు? మన్మోహన్ సింగ్ ప్రధానిగా 2004లో బాధ్యత చేపట్టారు. ప్రముఖ పాత్రికేయులు పి. సాయినాథ్ సేకరించిన అధికారిక సమాచారం ప్రకారం 2005–08 మధ్యకాలంలో ప్రతీ భారతీయుడి తలసరి తిండి గింజల లభ్యత (అది లభ్యత మాత్రమే) కేవలం 436 గ్రాములు మాత్రమే. ఒక అర్ధ శతాబ్దం నాటి లభ్యత కన్నా సగం కన్నా తక్కువ. 1955–58 మధ్యకాలంలో 440 గ్రాములు. పప్పుల సంగతి చూస్తే 1955–58 మధ్యకాలంలో 70 గ్రాముల నుండి 35 గ్రాములకు పడిపోయింది. మానవులకన్నా ఎలుకలకు, పందికొక్కులకు ఆహార భద్రతను గ్యారంటీ చేస్తోంది మన్మోహన్ సింగ్ ఆధ్వర్యంలోని ప్రభుత్వం. గోదాముల్లో బయటా ఆహార ధాన్యాలు, ముక్కిపోతున్నాయని, పశువులు కూడా మూతి పెట్టవని ఈ మధ్య వార్తా పత్రికల్లో వస్తే, ఆహార శాఖ మంత్రి పవార్ ఇది దారుణమైన పరిస్థితి అని వ్యాఖ్యానించగా, అలా జరుగుతూంటే పేదలకు ఉచితంగా పంచడం మంచిదని సుప్రీంకోర్టు వ్యాఖ్యానిస్తే, అది సాధ్యం కాదని అనటం చూస్తే, ఆ మంత్రికి ఊహకందని శిక్ష విధించాలని అనిపించడం లేదూ? కోట్లాది మంది ప్రజలు ఆహార అభద్రత నెదుర్కొంటూంటే, కనీసం మాటల్లోనైనా సానుభూతి కూడా వ్యక్తం చేయని ప్రధానిని ఏమనాలి?

*(రచయిత సీనియర్ పాత్రికేయులు, వీక్షణం గౌరవ సంపాదకులు)* వీ

*దేశవ్యాప్తంగా ప్రజలు తమ నేల, నీరు, అడవిని మొత్తంగా మనుగడ కోసం చేస్తున్న శాంతియుత, అహింసాయుత పోరాటాలను విశ్లేషిస్తున్నారు* **అమిత్ సేన్ గుప్తా**

# ప్రజా ఉద్యమాలు అడుగుతున్నదేమిటి?

ఒడిషాలోని మారుమూల ఆదివాసీ ప్రాంతాలలో పెద్ద ఎత్తున జరుగుతున్న విస్థాపనకు, మైనింగ్ మాఫియాకు వ్యతిరేకంగా ప్రజలు విశిష్టమైన అహింసాయుత భూపోరాటాలు చేస్తున్నారు. తీవ్రమైన హింసాపూరిత పోలీసు అణచివేత వారిపై సాగుతున్నప్పటికీ ఎటువంటి ఆయుధాలను ఆశ్రయించలేదు. మరి ఈ రాజకీయ వ్యవస్థ ప్రజలను ఎందుకు గోడవారకు నెట్టేయాలని చూస్తోంది?

ఆదివాసీ ప్రజలు అహింసాయుతంగా చేస్తున్న పోరాటాన్ని అణచివేయడానికి మార్చ్ 30న మరోసారి ప్రయత్నించారు. అప్పటి నుంచి ఆ ఆదివాసీ గ్రామాలు పోలీసుల, టాటా వారి కిరాయి గూండాల, పాలక బి.జె.డి. మద్దతుదార్ల దిగ్బంధనంలో ఉన్నాయి. 'బయటివారిని' ఆ గ్రామాల్లోకి వెళ్లనీయడం లేదు. గ్రామ ప్రజలను బయటికి రానీయడం లేదు. ఆహారం, మందులు, బంధువులు, విలేకరులు, పౌర సామాజిక బృందాలు ఇలా ఎవ్వరిని అనుమతించడం లేదు. బిజెపి నాయకుల జవల్ ఒరామ్, కాంగ్రెస్ నాయకులపై 'బి.జె.డి.–టాటా కిరాయి గూండాలు' దాడిచేశారు. ఈ దాడికి సంబంధించి వివరాలను రికార్డ్ చేద్దామని ప్రయత్నించిన విలేకరులను తీవ్రంగా కొట్టారు. కెమెరాలను ధ్వంసం చేశారు. వారి విలువైన ఇతర వస్తువులను దోచుకున్నారు.

ఈ విషయాలను స్వతంత్రంగా పనిచేస్తున్న విలేకరులు తమ నివేదికలలో బహిర్గతం చేయగా, అక్కడి ఉద్యమ కార్యకర్తలు, డాక్యుమెంటరీ ఫిలిం నిర్మాతలు దీనిని ధృవపరిచారు. ఏప్రిల్ 9–11 మధ్య ఢిల్లీలో 'స్వతంత్ర ప్రజా కోర్టు' జరిగిన సందర్భంలో హార్డ్ న్యూస్‌తో ఈ విషయాలు వెల్లడించారు.

'మార్చ్ 30న జరిగిన దాడి నెలల తరబడిగా పోలీసులు, టాటా వారి గూండాలు చెదురుముదురుగా అమలు చేస్తున్న అణచివేతకు పరాకాష్ఠ. ఆ రోజు పోలీసులు తాము చేయాల్సిన 'శాంతి భద్రతల సంరక్షణ'ను గాలికొదిలి వాళ్లే మొదట ఆదివాసులపై రబ్బర్ బుల్లెట్‌ల, ప్లాస్టిక్ గుళ్ల వర్షం కురిపించారు. బాలిగోథా గ్రామంపై విరుచుకుపడి ఆహార నిల్వలను తగులబెట్టారు. బావుల్లో కిరోసిన్ పోశారు. పశువులను చంపేశారు. 2 జనవరి 2006న పోలీసు కాల్పుల్లో చనిపోయిన అమరుల జ్ఞాపకార్థం నిర్మించుకున్న జ్ఞాపికలను ధ్వంసం చేశారు. కోళ్లను, మేకలను, విలువైన వస్తువులను దోచుకెళ్లారు. టి.వి.లు, డి.వి.డి.లు, కుట్టుమిషన్‌లు, ఇతర ఎలక్ట్రానిక్ సామాగ్రిని సర్వనాశనం చేశారు...

ఆశ్చర్యకరంగా ఈ ఘటన జరగడానికి రెండు రోజుల ముందే జిల్లా మెజిస్ట్రేట్ గ్రామస్తులను కలిసి, సమస్యలను విని, వారి సమస్యలను పరిష్కరిస్తానని హామీ ఇచ్చాకే ఈ దాడులు చోటు చేసుకొన్నాయి. ఈ దాడుల్లో 27 ప్లాటూన్‌ల సాయుధ రక్షణ బలగాలు, రెండు ప్లాటూన్‌ల ఆపరేషన్ గ్రీన్‌హంట్ బలగాలు, వందమందికి పైగా టాటా కిరాయి గూండాలు పాల్గొన్నారు.'

ఉద్యమకారిణి మమతాదాస్ మాటల్లో 'కళింగనగర్ ప్రాంతాన్ని ఒక సైనిక స్థావరంగా మార్చేశారు. వైద్యం సకాలంలో అందక ముగ్గురి ప్రాణాలు గాలిలో కలిసిపోయాయి. వైద్యం అందించడానికి డాక్టర్లను కూడా అనుమతించలేదు. విలేకరులను అనుమతించలేదు. పోలీసులు అంతటా విస్తరించి ఉన్నారు. కిరాయి గూండాలకు పూర్తి స్వేచ్ఛను ఇచ్చారు. చాలామంది స్థానిక నాయకులను, ఆదివాసులను అరెస్టు చేశారు. ఇళ్లపై సోదాలు నిర్వహించి, ప్రజలను చితకబాదారు. గ్రామస్తులను ఎత్తుకెళ్లారు. ఈ మొత్తం క్రమంలో వారి ఉద్దేశం విస్థాపనను ప్రజలు వ్యతిరేకించకుండా ఒక పాఠం నేర్పడం, టాటాలకు స్వేచ్ఛనివ్వడం.'

శాంతియుతంగా జరుగుతున్న ఈ ఉద్యమ ప్రాంతాలలో సంఘర్షణ మండలాలలో ఇంకో ధోరణి కూడా ఈ అణచివేతలకు కొనసాగింపుగా అమలవుతోంది. వాటిలో అంతుచిక్కని మరణాలు, ఊహించలేని స్థలాలలో మృతదేహాలు కనబడడం, యాక్సిడెంట్లు, హత్యలు లాంటివి ఉన్నాయి. ఇవేకాక గుర్తింపు పొందిన ఆదివాసీ నాయకులపై హత్యా నేరాలతో సహా తప్పుడు కేసులు పెట్టడం, విచక్షణారహితంగా కొట్టడం, జైళ్లలో సుదీర్ఘకాలం నిర్బంధించడం లాంటివి చేస్తున్నారని అక్కడి కార్యకర్తలు చెపుతున్నారు. ఈ విధంగా జైలు వ్యవస్థ, న్యాయవ్యవస్థ, పోలీసుల దుర్మార్గమైన అణచివేతలతో ఆదివాసుల ఎదిరించే ఆత్మస్థైర్యాన్ని తొక్కివేయడమే వారి లక్ష్యంగా ఉంది.

టాటాలు, బి.జె.డి. నాయకత్వంలోని ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ ప్రభుత్వం ప్రజల పట్ల కక్షపూరిత, కఠిన వైఖరిని అవలంబిస్తున్నాయి. నవీన్ పట్నాయక్‌కు ఇప్పటి యు.పి.ఎ. (వెనకటి ఎన్.డి.ఎ.) ప్రభుత్వాల నుంచి అండదండలున్నాయి. వేలాది ఎకరాల విలువైన అడవులను, కొండలను మొత్తంగా మన దేశ నేలను ఇక్కడి సాధారణ వ్యాపారవేత్తల నుండి అంతర్జాతీయ అతి పెద్ద కార్పొరేట్ కంపెనీలకు, మైనింగ్ దిగ్గజాలకు కారుచవకగా కట్టబెడుతున్నాడు.

పర్యావరణ రీత్యా ప్రాధాన్యత ఉన్న విలువైన ప్రాంతాలను కూడా విడిచిపెట్టకుండా ప్రమాదకరమైన మైనింగ్ కంపెనీలకు అంటే, బ్రిటన్‌కు చెందిన వేదాంత లాంటి కంపెనీలకు ధారాదత్తం చేసేస్తున్నారు. ప్రజలు ప్రతిఘటించినప్పుడల్లా ప్లాటూన్‌ల కొద్దీ సాయుధబలగాలు, కాంట్రాక్టర్లు, కంపెనీ గూండాలు కలిసి అణచివేస్తున్నారు. లేదంటే, శాంతియుత జీవనం సాగిస్తున్న స్థానికులపై మావోయిస్టు ముద్రవేసి వేధిస్తున్నారు. ఒడిషాలోనూ,

దేశంలోని చాలా పురాతనమైన ప్రాంతాలలోనూ ఇవాళ్టి ఘర్షణా మండలాలలో అహింసాయుత, శాంతియుత నిరసన ఉద్యమాలపై ఇదే అణచివేత ధోరణి మనకు కనిపిస్తోంది. ఒడిషాలోని మల్కన్‌గిరి ప్రాంతం మినహాయిస్తే ఈ ప్రజాపోరాటాలకు హింసాపూరిత పోరాటరూపాలతో గానీ, మావోయిస్టులతో గానీ సంబంధం లేదు. మావోయిస్టులతో ఎటువంటి రాజకీయ సంబంధం లేకున్నా, సారంలో ఉద్యమ స్వభావం అలాగే ఉంది.

ఈ పోరాటాలన్నీ స్థానిక వీరగాథలు, తిరుగుబాట్లు, సామాజిక రాజకీయ ప్రకంపనలుగా, మార్క్సిజం–లెనినిజం, గాంధేయ సోషలిజం, అంబేద్కర్ ఆలోచనలు, స్థానిక తాత్విక ప్రేరణలతో, కొత్త ఆలోచనలతో, పలు కొత్త నిరసన రూపాలతో, మౌఖిక జానపదుల ప్రేరణలతో కొనసాగుతున్నాయి. అసంఖ్యాకమైన చారిత్రక తిరుగుబాట్ల ప్రేరణ వీటిలో అంతర్లీనంగా ఉంది. ఆదివాసుల చరిత్ర, గత తిరుగుబాట్ల సాహసం (దంతేవాడలో లాగ), బ్రిటిష్ వారికి వ్యతిరేకంగా చేసిన పోరాటాల నేపథ్యాలు ఉన్నాయి. ఇవాళ నయా ఉదారవాద విధానాలకు వ్యతిరేకంగా మళ్లీ ఆ మిలిటెంట్ ఉద్యమాల ఇంద్రధనస్సు మనముందు ఆవిష్కృతమవుతోంది. ఒడిషాలోని ప్రజలు చేస్తున్న ఈ పోరాటాలలో ఎక్కడా కూడా ఒక్క హింసాత్మక సంఘటన చోటు చేసుకోలేదు. అది జగత్సింగ్‌పూర్‌లో పోస్కో ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా కావచ్చు; నియంగిరి, కాశీపూర్‌లలోని మైనింగ్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా కావచ్చు; కోణార్క్– పూరీల మధ్య చేపడుతున్న వేదాంత యూనివర్సిటీ ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా కావచ్చు, కళింగనగర్ టాటాల ఉక్కు ప్రాజెక్ట్‌కు వ్యతిరేకంగా కావచ్చు.

మరి ఆదివాసుల సొంత నేలపై వారిని నేరస్తులుగా రాజ్యం ఎందుకు వెంటాడుతోంది. అన్యాయాల వలయంలోకి ఎందుకు నెడుతోంది. చితక్కొట్టడం, తప్పుడు కేసులు పెట్టడం, జీవితపు అంచులకు నెట్టేయడం, దుర్మార్గంగా చంపేయడం ఎందుకు చేస్తోంది. ఈ ప్రజాస్వామ్యమే ఒక ప్రహసనంగా కనబడుతోంది. తమ నేలను విడిచి వెళ్లమని వారు చెప్పాక వారిని బలవంతంగా ఎందుకు పంపేయాలని చూస్తోంది. కఠినంగా ఎందుకు అణచివేయాలని చూస్తోంది. దురాశా, లాభాలే లక్ష్యంగా విరామం లేకుండా మీడియా 'అభివృద్ధి' చిలక పలుకుల గజిబిజిలో, 'ముఖ్యంగా' కేంద్ర హోంమంత్రి మనుషుల ఆకాంక్షలను, తిరగబడే తత్వాన్ని అణచివేయగలరా? ప్రజలు ఏమంటున్నారు, వాళ్లు చెబుతున్నదేమిటి?

ప్రజలు కూడా పట్టుదలతోనే ఉన్నారు. గత ప్రాజెక్టులు ఇచ్చిన అమానవీయ పునరావాస అనుభవాలు వారికున్నాయి. గతంలో ప్రాజెక్టులకు వ్యతిరేకంగా పోరాడిన అనుభవం వారికుంది. తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కోవడమే కాకుండా, అడవుల లోపలికి పారిపోయి, తలదాచుకున్న స్థితిని కూడా అనుభవించారు. వారి తక్షణ వ్యతిరేకతకు ప్రస్తుతం నిర్మించ తలపెట్టిన ఉమ్మడి కారిడార్ ప్రాజెక్ట్ ఒక కారణం.

కళింగనగర్ పారిశ్రామిక బెల్ట్‌కు దగ్గర, 2 జనవరి 2006న హత్యలు జరిగిన పాడుబడిన స్కూల్‌కు అతి దగ్గరలోనే చాలామంది ఆదివాసులు నివసిస్తున్నారు. మళ్లీ ఈ దురదృష్టకర సంఘటన చోటు చేసుకున్న రోజు వందలాది మంది ఆదివాసులు తమ విల్లంబులు, బాణాలు, కొడవళ్లతో వెనువంటనే అక్కడ గుమిగూడారు. ఆ ప్రాంతంలో విశాలమైన పచ్చికబయళ్లు, దానిని ఆనుకుని పోయే పక్కా రోడ్డు, ఆ రోడ్డును ఆనుకుని దగ్గరలో ఫ్యాక్టరీలు ఉన్నాయి. అలా గుమిగూడిన వారిలో పెద్ద సంఖ్యలో స్త్రీలు కూడా ఉన్నారు. ఆ స్కూలు వెనకే టాటాలు గోడ కట్టడానికి ప్రణాళిక వేసుకున్నారు. దానికి సాయుధ బలగాల రక్షణ ఏర్పాటు చేశారు. ఈ చర్యను వ్యతిరేకిస్తూ శాంతియుతంగానే ప్రజలు అటువైపుగా కదిలారు. గట్టిగా అరుస్తూ పోలీసులు విచక్షణా రహితంగా వారిపై కాల్పులు జరిపారు. పద్నాలుగు మంది ఆ కాల్పుల్లో చనిపోయారు. చనిపోయిన వారిలో ముగ్గురు మహిళలు ఉన్నారు.

కారిడార్ మిషతో భౌతికంగా గ్రామాలను వేరు చేయడమే టాటాల లక్ష్యమని అక్కడి ప్రజలకు అర్థమయింది (ఆక్రమించిన పాలస్తీనా భూభాగంలో ఇజ్రాయిల్‌ల గోడలాగా). కారిడార్‌ను వాళ్లు అనుమతించ దలచుకోలేదు. అందుకే ఈ దిగ్బంధం. 'వాస్తవానికి ఆ రోడ్డు పరిశ్రమల ఉమ్మడి కారిడార్ వాడుకోవడానికి కాదు. రాబోతున్న టాటా ఉక్కు కర్మాగారం రాకపోకల కోసం ఉద్దేశించింద'ని బి.జె.డి. మద్దతుదారుల చేతిలో దెబ్బలుతిన్న జువల్ ఒరామ్ అన్నారు.

కళింగనగర్ ప్రాంత గ్రామాల గిరిజనులకు అందమైన లిపి ఉంది. చనిపోయిన వారి జ్ఞాపకార్థం వాళ్లు కవితా పాదాలు రాసి నివాళులు అర్పిస్తారు. ఈ అందమైన ప్రాంతంలో వాళ్లు ఇంటి ప్రహరీలు, కంచెల దగ్గరనే ఆత్మీయులను బొందపెడతారు. చనిపోయిన వాళ్ల జ్ఞాపకార్థం పూడ్చిన స్థలం వద్ద చాలా పెద్ద పెద్ద రాళ్లు పాతుతారు. కొన్ని వాటిలో చాలా పెద్దవిగా, భారీగా ఉంటాయి. కొన్ని రాళ్లనయితే చెక్కి చక్కగా మలచి పెడతారు. వాటిపై చిన్న చిన్న కథలు చెక్కుతారు. పిల్లలు ఈ రాళ్లపై ఆడుకుంటారు. అటుగా వెళ్లే అపరిచితులు సేద తీరుతారు. గత స్మృతులను, గాథలను పంచుకుంటారు. పెద్దగా వస్తువులు లేని శుభ్రమైన ఆరుబయట ఆ ఇళ్ల దగ్గర బాటసారులు సేదతీరుతారు. వాళ్లకు మంచినీళ్లు కూడా అందిస్తారు. రాత్రీ, పగళ్లు చనిపోయిన వారి జ్ఞాపికలను స్పర్శిస్తారు. మాట్లాడుతారు. వారు లేని వెలితిని, ఉన్న క్షణాలను అనుభూతి చెందుతారు. ఇంకా తమతోనే ఉన్నట్లుగా భావిస్తారు. విశాలమైన ఆ పచ్చికబయళ్లు గాలిలో తేలియాడే ఆకులా వారి జీవితంలో, జానపద గాథల్లో ఆ జ్ఞాపకాలను నిక్షిప్తం చేసుకుంటారు.

ప్రమాదవశాత్తు, లేక అసహజంగా చనిపోయిన వారిని మాత్రమే వాళ్లు దహనం చేస్తారు. తెగ పెద్ద ఇంటి వెనుక కాస్త ఎత్తయిన వేదికపై ఈ దహన సంస్కారం నిర్వహిస్తారు. పోలీసు కాల్పుల్లో చనిపోయిన ప్రతి ఒక్కరి జ్ఞాపకార్థం పద్నాలుగు సంకేతాలతో ఉన్న రాళ్లను నిలబెడతారు. ఆ రాళ్లపై చనిపోయిన వారి పేరు, సంక్షిప్తంగా నివాళులు చెక్కుతారు. అయితే కిరాయి గూండాలు చాలా దుర్మార్గంగా ఈ జ్ఞాపక చిహ్నాలను కూడా అవమాన పరిచారు. ఈ చర్య ఆదివాసుల హృదయాంతరాళాలను కత్తితో ముక్కలుగా నరకడం లాంటిదే. దీన్ని వాళ్లు ఒప్పుకోరు.

ప్రతి రాయిలో అక్కడ ఒక బిర్సా ముండా ఉన్నారు. ప్రతి తిరుగుబాటు గాథలో బిర్సా ముండా ఉన్నారు. బిర్సా ముండా అమూల్యమైన వారసత్వాన్ని కూడా మావోయిస్టు ముద్రతో అణచివేస్తారా?

ఈ ఏడాది జనవరి 2న బిర్సా ముండా మనవడు శుక్రా ముండా ఈ ప్రాంతానికి వచ్చాడు. జాజ్‌పూర్ జిల్లాలోని కళింగనగర్ ప్రాంతంలోని గ్రామాల ఆదివాసుల పోరాటాలకు సంఘీభావం తెలిపారు. వారిలో చాలా మంది బిర్సా ముండాను అనుసరించేవారే.

ఆదివాసీ పోరాట యోధుడు బిర్సా ముండా తిరుగుబాటు చోటా నాగ్‌పూర్‌లోని చయిబాసా, సింగ్‌భం ప్రాంతాల దట్టమైన అడవులలోంచి, శిలలు, పర్వతాల్లోంచి ప్రతిధ్వనించింది. ఆ ప్రాంతాలు ఇప్పటి జార్ఖండ్ రాష్ట్రంలో ఉన్నాయి. ఆ వీరోచిత గాథలు అక్కడి గుడిసెల గోడలపైన, వారి హృదయస్పందనల్లోను, దైనందిన జ్ఞాపకంగాను చెక్కి ఉన్నాయి. ఒడిషాలోని కళింగనగర్ లో బిర్సా వారసత్వం కొనసాగుతోంది. ఒక

పచ్చి గాయం లాగా, ఆశ్చర్యం, గర్వం కలిగించే మెరుపు జ్ఞాపకం లాగా అక్కడి ఆదివాసుల మనసులలో మెరమెరలాడుతూనే ఉంది. బిర్సా ముండా నేలకు దూరంగానే అయినా ఆ తిరుగుబాటు ప్రాంతేతరులపై రగిలించిన కసి, కోపం ప్రతి ఒక్కరిలో ఇప్పటికే ప్రకంపనలు సృష్టిస్తూనే ఉంది.

ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి సాగిన ఆదివాసీ సంప్రదాయ భౌగోళిక ప్రయాణంలో అపూర్వమైన వారసత్వ కొనసాగింపు ఉంది. ఎందువల్ల అంటే, వారి భౌగోళిక చిత్రపటాలు విభిన్నంగా రూపొందాయి. ఈ అలిఖిత మ్యాపులలో తడి నేలను ఒక రేఖలా, నది పక్కన ఉన్నట్లు సూచించారు. బురదతో రుద్దిన గోడలపై అందంగా గీసిన బొమ్మల్లాగా చూడముచ్చటైన లిపి వారి సొంతం.

ఆర్ధ్రత నిండిన వారి గాథలు మౌనంగా, గాఢంగా, అపూర్వంగా ఆదివాసీ రంగస్థలి పై అద్భుతంగా ఆవిష్కరించబడతాయి. పదునైన, లోతైన జ్ఞాపకాలను పలికిస్తాయి. వాళ్ల భూమి, చెట్లు, నదులు, అడవులు, నీటి చెలిమలు, మట్టి, ఆకాశం, పువ్వులు, పక్షులు, క్రూరమృగాలు, కవిత్వం, పాటలు, నృత్యాలు, నిప్పు, దాంపత్యం, ప్రేమ, ఉద్రేకం, నడిరాత్రులు, వాయిద్యాలు, అడవిలో ముదురుతేలిన దేహాలు, సూర్యుడు ఇవన్నీ కలగలిసి ఒక సాధారణ సమష్టి రూపాన్ని సంతరించుకొని, సహజీవన భావనను వెదజల్లుతాయి.

అక్కడ ఉన్నవన్నీ ప్రతి ఒక్కరికీ చెందుతాయి. ప్రకృతి ఇచ్చిన ప్రతి ఒక్కటీ అందరూ పంచుకోవాలి. భౌగోళికంగా, పుట్టుకతో వచ్చిన ఈ సంప్రదాయ హక్కును పరాయివాళ్లు ఎవరైనా (చాలాసార్లు తుపాకితో) లాక్కుపోతే వాళ్లు చనిపోతారు.

ఈ కథ దంతేవాడది. ఈ కథ తూర్పు కనుమలలోని పశ్చిమ ఒడిషాలోని కాశీపూర్‌ది. ఈ కథ భయసంభ్రమాలు కలిగించే, ఎవరూ తాకని, అందమైన, పర్యావరణానికి అత్యంత విలువైన నియంగిరి ప్రాంతానిది. ఈ కథ మైనింగ్ మాఫియాలకు, కార్పొరేట్లకు వ్యతిరేకంగా పాయలు పాయలుగా సాగుతున్న ఉద్యమాల ఇంద్రధనస్సులది.

పశ్చిమ బెంగాల్‌లోని నందిగ్రామ్ ప్రజలు తమపై హత్యలు, మానభంగాలు అమలు చేసిన సి.పి.ఎం. గూండాలకు, పోలీసులకు వ్యతిరేకంగా న్యాయమైన ఆగ్రహంతో ఊగిపోవడం మనం చూశాం. ఆ రైతాంగ ఉద్యమం చేసింది నిరుపేద దళితులూ, ముస్లింలూ. ఆ పోరాటం చారిత్రకమైంది. నిలువరించలేనిది. అక్కడ సంఘీభావం అణగదొక్కలేనిదిగా పరిణమించింది. కళింగనగర్ ఆదివాసులు చేయి చేయి కలిపి దానికి కొనసాగింపుగా నిలుచున్నారు. భాష వేరు కావచ్చు, ఆ భాష సమకాలీన ఉద్యమాలకు అర్థమయ్యేది. సిపిఎం ఆరోపించినట్టు అదేమీ మావోయిస్టు ఉద్యమం కాదు.

ఈ భాష ఒడిషాలోని కాశ్మీర్‌గా పేర్కొనబడే కాశీపూర్ ఆదివాసులది. అక్కడి అనంతమైన పర్వతాలు, నదులు, జలపాతాలు, వాగులు, అడవులది. దాదాపు దశాబ్ద కాలంపైగా ఆదివాసులు అలుపెరగక చేస్తున్న ఈ మిలిటెంట్ పోరాటం అహింసాయుత పద్ధతుల లోనే సాగుతోంది. పెద్ద పెద్ద కంపెనీల దూకుడును నిలువరించింది. బాక్సైట్ కోసం (శుద్ధి చేసిన అల్యూమినాను ఆయుధ పరిశ్రమలలో ఉపయోగిస్తారు), ఇతర సంపదల కోసం, విలువైన ఖనిజ వనరులున్న, జలపాతాలున్న కొండలను, అడవులను దోచుకోవడాన్ని ఎదురు నిలిచి అడ్డుకుంది.

విలేకరులను కాంట్రాక్టర్ల కిరాయి గూండాలు చితకబాదారు. ప్రజలను అరెస్టు చేసి జైళ్లలో పెట్టారు. లెక్కలేనన్నిసార్లు పోలీసు నిర్బంధం అమలయింది. కానీ, ఈ సంప్రదాయ తిరుగుబాటు తన అమాయకమైన తెగువను కోల్పోలేదు. ఇలా తీవ్రమైన నిర్బంధం అమలవుతున్నా, వారు పోరాటాన్ని గానీ, తమ నేలను గానీ వదులుకోదల్చుకోలేదు. అలుపెరుగని పోరాటం చేస్తున్నారు. తమ నేలను మాత్రం వదలడాన్ని తిరస్కరిస్తున్నారు. పక్కనే ఉన్న లంజిఘర్ ప్రాంతంలో వేదాంత అల్యూమినియం ప్లాంట్ చేసిన విధ్వంసాన్ని కళ్లారా చూశారు. విషతుల్యమై, పాడైపోయిన అక్కడి నదులూ, పర్వతాలూ, వాగులూ, చెట్లనూ చూశారు. అందుకే, పశ్చిమ కనుమలలోని తమ పచ్చదనాన్ని తగులబెట్టనీయకుండా మైనింగ్ మాఫియాకు ఎదురు నిలబడ్డారు.

ఆదివాసీ ప్రాంతంలోని మారుమూల మైకాంచ్‌లో జరిగిన కాల్పులలో చనిపోయిన వారి జ్ఞాపకార్థం చిన్న రాళ్ల కొండ శిఖరం పైన పెట్టారు. కొన్ని పువ్వులూ, ఆకులతో ఉన్న కొమ్మలతో అలంకరించారు. శాంతియుతంగా చేపట్టిన నిరసనపై జరిగిన పోలీసు కాల్పుల్లో చనిపోయిన వారి స్మృతిలో వాళ్లు సమర్పించుకున్న అతి సాధారణమైన నివాళి. డిసెంబర్ 2000లో జరిగిన 'మైకాంచ్ హత్యల'లో ముగ్గురు ఆదివాసీ యువకులు చనిపోయారు. వాళ్లు చేసిందల్లా ఉత్కళ్ అల్యూమీనియంకు వ్యతిరేకంగా నిరసన వ్యక్తం చేయడమే. ఈ ఉత్కళ్ అల్యూమీనియం కెనడా ఆల్కాన్, భారత్ హిండాల్కోల జాయింట్ వెంచర్. ఒడిషాలోని ఇతర ప్రాంతాలలోను జరుగుతున్న ఈ అహింసాయుత పోరాటాలు ఒక చారిత్రక వారసత్వ కొనసాగింపులో భాగంగా, చరిత్రపుటలలో అమూల్యమైనవిగా నిలిచిపోతాయి. నియంగిరి, జగత్సింగ్‌పూర్, అంతకు ముందు జార్ఖండ్‌లోని జాదుగోడా, ఒడిషాలోని గంధమార్ – ధానా కొండలు, చిలికా, మహారాష్ట్రలోని రాయఘర్, ఉత్తర్‌ప్రదేశ్‌లోని దాద్రి, ఇంకా నందిగ్రామ్, సింగూర్ ఇవన్నీ దేశవ్యాప్తంగా జరుగుతున్న అసంఖ్యాక పోరాటాలలో కొన్ని మాత్రమే. ఇంకా నర్మదా లోయ, ఘర్వాల్ కొండలలో జరుగుతున్న పోరాటాలు ఉన్నాయి. విజయవంతమైన, ఇంకా పోరాడుతున్న, ఓడిపోయిన, ఇంకా ఓడిపోని పోరాటాలుగా కొనసాగుతూనే ఉన్నాయి.

జగత్సింగ్‌పూర్ ప్రాంతం చూస్తే భౌగోళికంగా విభిన్నమైనది. విలువైన, అద్భుత జీవవైవిధ్యంతో కూడుకున్న ప్రాంతం. ఎన్నో నదులు, వాగులు, వంకలు, సారవంతమైన నేల, చేపలు పట్టడం, వ్యవసాయం, కూరగాయల పెంపకాలతో సముద్రానికి దగ్గరగా ఉన్న ప్రాంతం. ఈ ప్రాంతాన్ని విధ్వంసం చేసే అనేక మిలియన్‌ల పెట్టుబడితో బహుళజాతి సంస్థ పోస్కోకు చెందిన ప్రాజెక్ట్ అక్కడి ఆదివాసుల నెత్తిపై కత్తిలా వేలాడుతోంది. పోస్కో మన ప్రధానమంత్రి గారికి ప్రియమైన ప్రాజెక్ట్. అవసరమైతే క్రూరమైన బలగాల సహకారంతో అక్కడి ఆదివాసుల గుండెలను చీల్చివేయడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ ప్రాంతంలో మెత్తని, తియ్యని, నోట్లో పెడితే కరిగిపోయే తమలపాకులను వాళ్లు పండిస్తారు.

దోపిడీదారులను, ప్రాంతేతరులను రానీయకుండా అక్కడి ఆదివాసులు కంచెలు కట్టి మార్గాన్ని నిరోధించారు. ప్రాజెక్ట్ ప్రాంతానికి వెళ్లే దారిని మూసి వేశారు. గ్రామస్తులు అక్కడి నుంచి కదలడానికి నిరాకరించారు. వాళ్లు ప్రజలను విభజించాలని చూశారు. పోలీసులు రైడ్‌లు చేశారు. చాలా తీవ్రమైన ఫలితాలు ఉంటాయని ప్రజలను హెచ్చరించారు. ఉద్యమాన్ని తొక్కిపడేయాలని చూశారు. వారి నాయకుడు సి.పి.ఐ.కి చెందిన అభయ్ సాహూని పది నెలలు జైల్లో పెట్టారు. ఆయన చేసిన నేరం ఏమీలేదు. చేసిందల్లా అహింసాయుత ఉద్యమాన్ని ముందుండి నడపడమే.

ఇటీవల ఆదివాసులు పారాదీప్ పోర్టు నుంచి పూరి వరకు పాదయాత్ర చేశారు. స్థానికులు, ఒడిషాలోని వివిధ ఉద్యమాల ప్రతినిధులు పెద్ద ఎత్తున పాల్గొని తమ సంఘీభావం తెలిపారు. 'ఇవాళ్టికి ప్రతిరోజూ స్త్రీలు, పురుషులు శాంతియుతంగా కూర్చుని తమ నిరసనలు తెలుపుతూనే ఉన్నారు. అయినా వాళ్లు మమ్మల్ని మావోయిస్టులుగా ముద్ర వేస్తున్నారు. అరెస్టులతో, ఇళ్లపై దాడులతో మా స్థైర్యాన్ని దెబ్బతీయాలని చూస్తున్నారు. వాళ్ల గూండాలు గ్రామస్తులను బెదిరిస్తూనే ఉన్నారు. పోలీసుల దుర్మార్గాలకు ప్రజలు భయభ్రాంతులవుతున్నారు' అని అభయ్ సాహు హార్డ్ న్యూస్‌కు తెలిపారు.

అసలు నిజమేమంటే అన్యాయానికీ, న్యాయానికీ మధ్య కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అన్యాయం వైపు నిలుచుంటున్నాయి. ప్రజల వైపా, కార్పొరేట్ కంపెనీల వైపా అన్న ప్రతి సందర్భంలో రాజ్యం కార్పొరేట్‌ల వైపు నిలుస్తోంది. చంపి, భయపెట్టి సాయుధ బలగాలు ప్రజలను ఆందోళనకు గురిచేస్తున్నాయి. సాయుధ ఉద్యమానికి, నిరాయుధ అహింసాయుత ఉద్యమానికి మధ్య రాజ్యహింస సాధికారికంగా చలామణి అవుతోంది.

ఇక కేవలం మావోయిస్టులను వారి హింసతోసహా, రాజ్యాంగాతీత వ్యూహాలను తప్పుపట్టాల్సిందేముంది? రాజకీయ వర్గాలకు, కార్పొరేట్‌లకు రాజ్యాంగ అతీతంగా వ్యవహరించడం, వ్యూహాలు, హింస అమలు చేయడం నిత్యకృత్యమైపోయాయి. రాజ్య, రాజ్యేతర పాత్రలుగా మొత్తంగా అమలు చేస్తున్నది రాజ్యాంగాతీత చర్యలే. మావోయిస్టులే లేని ఈ ప్రాంతంలో వాళ్లు ఏం చేస్తున్నట్లు?

దంతేవాడ స్త్రీలు స్వతంత్ర ప్రజా ధర్మాసనం ముందు హృదయాన్ని కలచివేసే అక్కడి దుర్మార్గాలను, కర్కశత్వాన్ని, నిరాశను కథలుగా వినిపించారు. మూడు లక్షలకుపైగా ప్రజలు అక్కడ నిరాశ్రయులయ్యారు. 700 గ్రామాలను తగులబెట్టారు. కొల్లగొట్టారు. అసంఖ్యాకంగా స్త్రీలు చెరచబడ్డారు. సామూహిక అత్యాచారాలకు గురయ్యారు. కొంతమంది హత్యలకు గురయ్యారు. కొంతమంది పురుషులను కాల్చిచంపి, మావోయిస్టులుగా ముద్రవేశారు. సాక్షులను చంపేశారు. కొంతమంది కనబడకుండా పోయారు. మరికొంత మంది కిడ్నాప్‌లకు గురయ్యారు. చివరకు చంపేయబడ్డారు. ఇవి దంతేవాడలో జరిగిన, జరుగుతున్న కొన్ని సంఘటనలు. బి.జె.పి. పాలనలో ఉన్న పోలీసులు, కాంగ్రెస్ నాయకుడు మహేంద్రకర్మ ఆధ్వర్యంలో నడుస్తున్న సాయుధ సల్వాజుడుం ఇవన్నీ చేస్తుంటే రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు వీటిని పోషిస్తున్నాయి. గాంధేయవాది హిమాంశు కుమార్ ఆశ్రమాన్ని అనేకసార్లు కూల్చివేశారు. విస్థాపనకు గురైన ఆదివాసులను సుప్రీంకోర్టు ఉత్తర్వుల తర్వాత పునరావాసం కల్పించే ప్రయత్నంలో ఆయన అనుయాయులను అరెస్టు చేశారు. చిత్తగ్గొట్టి జైలులో పెట్టారు.

పోలీసులు చెప్పినదే మీడియా వినిపిస్తోంది. కేవలం మావోయిస్టుల హింసను మాత్రమే మీడియా రిపోర్ట్ చేస్తోంది. వాటికి కూడా కత్తిరింపులు ఉంటాయి. రాజ్యాంగాతీతంగా జరిగిన ఎన్‌కౌంటర్‌లు, హత్యలు, రేప్‌ల గురించి మావోయిస్టులు ఇచ్చిన ప్రకటనలు అసలు అచ్చువేయదు.

ఇక్కడ అభివృద్ధి అన్న మాటకు అవకాశమే లేదు. వెనుకబాటుతో సహా రాజ్యాంగ హక్కులు, న్యాయం అనేవి మచ్చుకు కూడా కానరావు. దంతేవాడ ప్రజల జీవితాలే సాక్ష్యాలుగా లెక్క లేనన్ని దుర్మార్గాలకు, పీడనలకు రుజువుగా, ఊహించలేని అన్యాయాలకు గాథలుగా ఉన్నాయి. ఇక్కడ ఎవరైనా సల్వాజుడుం స్పెషల్ పోలీస్ ఆఫీసర్స్, పారా మిలిటరీ బలగాలు, పోలీసుల చేతిలో రేప్‌లకు, హత్యలకు, అరెస్టులకు, ఎన్‌కౌంటర్ పేరిట కాల్చివేతలకు గురికావచ్చు.

అరుంధతీరాయ్ ప్రజాధర్మాసనం ముందు దంతేవాడలోని అనేక కథల్లోంచి ఒక కథను వినిపించారు. ఆ కథ గుండెను పిండే కథ. ఆ కథ భ్రమలను తొలగించి, ముక్కలైపోయిన ప్రజాస్వామ్య దర్పణాన్ని ఆవిష్కరించే కథ – 'నేను చమ్రీని కలిసాను. ఆమె 6 జూలై 2009న కాల్పుల్లో చనిపోయిన దిలీప్ తల్లి. ఆమె కొడుకును చంపేశాక పోలీసులు అతని శవాన్ని ఒక గుంజకు పశువును కట్టినట్టు కట్టి మోసుకెళ్లారు. (వేరే ఎవరైనా ప్రతిఫలాన్ని లాక్కొనే లోపు, వెంటనే మృతదేహాన్ని చూపించి క్యాష్ రివార్డ్ పొందాలి.) చమ్రీ వారి వెనుకే పోలీసు స్టేషన్ వరకూ పరుగెత్తింది. వారు పోలీసు స్టేషన్ చేరేసరికి మృతదేహంపై చిన్న గుడ్డ ముక్క కూడా మిగల్లేదు. దారిలో పోలీసులు టీ, బిస్కెట్‌ల కోసం ఒక ధాబాలో ఆగినప్పుడు మృతదేహాన్ని రోడ్డుపక్కన పడేశారు (తాగిన టీ బిస్కెట్‌లకు డబ్బులు ఇవ్వలేదు). ఆ దృశ్యాన్ని మనం ఊహించుకుంటే, ఒక తల్లి కొడుకు మృతదేహం కోసం అడవి పొడుగూతా పరిగెత్తి కొడుకును చంపిన హంతకులు టీ తాగే వరకు ఎదురు చూడడం.... ఇంత చేసినా ఆమెకు కొడుకు మృతదేహాన్ని ఇవ్వలేదు. గౌరవపూర్వకమైన అంత్యక్రియలు జరుపుకోవడానికి కూడా అవకాశం ఇవ్వలేదు. ఆ రోజు కాల్పుల్లో చనిపోయిన ఇతరులందరితో పూడ్చేటప్పుడు, ఆమెను కూడా గుప్పెడుమట్టి వేయడానికి అనుమతించారు. చమ్రీ ప్రతీకారం తీర్చుకుంటా నన్నది. 'దెబ్బకు దెబ్బ, రక్తానికి రక్తం' అని ఆమె ప్రతినబూనింది.

ఈ ముక్కలైన అద్దంలో ఏంటి మావోయిస్టుల హింస ఒక్కటే నిజమా? ఇలాంటి నిశ్శబ్ద బాధమయ, నిరాశతో ఆవరించిన మండలంలో జనసాధికారత సాధించుకుంటున్న మావోయిస్టులు ఒక వైపు, తన సాధికారతను కోల్పోతున్న భారత ప్రభుత్వం మరొకవైపు ఎదురెదురుగా నిలుచున్నాయి. ఆపరేషన్ గ్రీన్‌హంట్ మొదలైనప్పటి నుంచి ఇప్పటికి వంద మంది ఆదివాసులు, మావోయిస్టులు చంపబడ్డారని' స్థానిక ప్రజలు, మావోయిస్టులు చెపుతున్నారు. మీడియా వీటిగురించి ఎందుకు రాయడం లేదని ప్రశ్నిస్తున్నారు.

మీడియా ఎప్పటికీ చెప్ప నిరాకరించే విషయాన్ని ప్రజాధర్మాసనం కూడా గుర్తించింది – రెండు అతిపెద్ద పారిశ్రామిక శిబిరాల మైనింగ్‌ను, అపారమైన ఖనిజ వనరులున్న దంతెవాడ, బస్తర్ జిల్లా ప్రజలు, మావోయిస్టులు వ్యతిరేకించాకే 2005లో సల్వాజుడుం పుట్టింది. ఈ వ్యూహాన్ని కాల పరీక్షకు వదిలేశారు. అధికార యంత్రాంగాన్ని వాడుకోవడం, ప్రజలను ప్రజలకు వ్యతిరేకంగా నిలబెట్టడం, వారి గ్రామాలను తగులబెట్టడం, రేప్ చేయడం, చంపేయడం, నిర్వాసితులు గావించడం, చెల్లాచెదురుగా తరిమికొట్టడం, అంతిమంగా వారి భూములను, అడవిని, భూమి లోపలి పొరల్లో ఉన్న ఖనిజ సంపదను, అభివృద్ధి, శాంతిభద్రతలు, జాతీయత వంటి పేర్లతో స్వాధీనపరచు కోవడంగా ఉంది.

'భారత ప్రభుత్వాన్ని మావోయిస్టులు విసిరి పారెయ్యాలని చూస్తున్నారని అంటున్నారు కాని, నేను భారత ప్రభుత్వాన్ని కార్పొరేట్ కంపెనీలు ఎప్పుడో విసిరి పారేశాయని అంటాను' అని ప్రజా ధర్మాసనం ముందు అరుంధతీరాయ్ అన్నారు.

*(హార్డ్ న్యూస్ సౌజన్యంతో ఫ్రాంటియర్‌లో వచ్చిన 'దే ఆర్ నాట్ మావోయిస్ట్స్'కు అనువాదం)*

*(తెలుగు సేత డి.వి. రామకృష్ణారావు)*

వీ

*డెబ్బై వేల మంది కాశ్మీరీలను చంపిన భారత సైన్యానికి ఎదురుగా చిన్న రాయి పట్టుకుని నిలుచున్న ఆమ్ కాశ్మీరీ ఆంతర్యం ఏమిటో వినమని అడుగుతున్నారు* **జాహిద్ రఫీక్**

# కాశ్మీర్ - శాంతి కాముకుడి ఆగ్రహం

భౌతికంగా కొట్లాడుకోవడం నాకెప్పుడూ ఇష్టం లేదు. కాలేజీలో చదివే రోజుల్లో నేనొక బృందంలో భాగమే. అయినా, నేను కొట్లాటలకు సిద్ధపడనని, బలహీనుడినని స్నేహితులు వెక్కిరిస్తుండేవారు. నామీదికి ఎవరైనా వచ్చినా నేను వాళ్లను కొట్టనని గేలి చేసేవారు. కాని, నేనేమీ బలహీనుడిని కాను. నిజంగా కొట్లాట మొదలయ్యే కీలక క్షణాన ఇదంతా అనవసరం కదా అనిపించేది నాకు. శాంతి కాముకుడు అనే మాట అంటే నాకసహ్యం. కాని, లోలోపల నేను శాంతి కాముకుడినే. ఘర్షణలను నివారించడానికి చర్చలో, సంప్రదింపులో అటువంటి హింస కన్న మెరుగైన మార్గాలు ఉంటాయి గదా అనిపించేది నాకు. కాని, ఇవాళ నేనొక జర్నలిస్టును కాకపోయి ఉన్నట్టయితే, రచన అనేది ఒక రకమైన ధిక్కార చర్య కాకపోయినట్టయితే, నేను కూడా నా స్నేహితులందరి లాగానే శ్రీనగర్ వీథుల్లో రాళ్లు విసురుతూ ఉండేవాణ్ని.

నాకు ఊహ తెలిసినప్పటినుంచి కాశ్మీర్‌లో అణచివేతలను, హత్యాకాండలను చూస్తూ ఉన్నాను. ఎల్లప్పుడూ దృశ్యమంతా అలుక్కుపోయినట్టు కనిపించేది. కాని, గత రెండు నెలలుగా కాశ్మీర్ ఒక నలుపు తెలుపుల చిత్రపటంలో కనబడుతోంది. ప్రపంచం మొత్తం నిశ్శబ్దంగా ఉండాలని కుట్ర చేసుకొని, పెదాలకడ్డంగా వేలు పెట్టుకొని నిలబడినట్టు ఉంది. మూతబడిన పెదాల మీద అడ్డుగా నిలిచిన వేలు వేదికగా శాంతివాదం ప్రతిరోజూ బలి అయిపోతోంది. మొత్తం హింస అంతా ఈ మౌనం నుంచే జరుగుతోంది. ఇంటి నుంచి నాకు వచ్చే ప్రతి ఫోన్ కాల్ నా గుండెను బద్దలు చేస్తుంది. ఆ మాటలు వింటుంటే నా లోలోపల నుంచి హింస, రాయి మీద రాయి పేర్చినట్టు ఎలా నిర్మాణం అవుతుందో నాకు తెలుస్తోంది.

నేను ఢిల్లీలో ఉండగా మా అమ్మ నాకు ఫోన్ చేసి మా ఇంటి దగ్గరలో ఉండే కూరగాయల దుకాణం పెద్దాయనను కాల్చేశారని చెప్పింది. నేను ఇంటి నుంచి ఢిల్లీ వస్తున్నప్పుడు చూసిన చిట్టచివరి మనిషి ఆయనే. నాకు వీడుకోలు చెపుతూ ఆయన చిరునవ్వు నవ్వాడు. చేయి కలిపాడు. ఆయనను చంపేశారంటే ఆ హంతకులను చంపేయాలన్నంత ఆగ్రహం కలిగింది నాకు. మరొక ఫోన్‌లో మా తమ్ముడు మరొక సంగతి చెప్పాడు. మా వీథిలో సి.ఆర్.పి.ఎఫ్. జవానులు ఇష్టారాజ్యంగా ఉన్మాదంగా విరుచుకుపడ్డారట, కిటికీలు బద్దలుకొట్టారట. వీథిలో ఎవరైనా కనబడితే చావతందాం అన్నట్టు చూశారట. ఢిల్లీలోనే పనిచేసే మరొక కాశ్మీరీ మిత్రుడు ఒక సాయంత్రం ఫోన్ చేశాడు. కాశ్మీర్ గురించి రెండోస్థాయి పరిష్కార ప్రయత్నాలు అని పిలిచే మేధో బృందంలో పనిచేస్తున్నాడు అతను. అతను ఏడుస్తూ, ఎక్కుతూ చెప్పిన వాటిలోంచి నాకర్థమయింది ఏమంటే, బటమాలూలో సి.ఆర్.పి.ఎఫ్. జవానులు కొట్టి చంపేసిన సమీర్ అహ్మద్ అనే తొమ్మిదేళ్ల పిల్లవాడి ఫొటో చూసి ఆయన ఏడుస్తున్నాడు. ఆ పిల్లవాడి వంటి నిండా కమిలిన దెబ్బల గుర్తులున్నాయి. అతని నోట్లో ఇంకా సగం చప్పరించిన చాక్లెట్ కనబడుతోంది. ఏడుస్తున్న నా స్నేహితుడు నా ఓదార్పు కోసం ఫోన్ చేశాడు. కాని, ఒకరినొకరం ఓదార్చుకోవల్సి వచ్చింది. తానిక ఢిల్లీ వదిలేసి మర్నాటి ఉదయం కాశ్మీర్ వెళ్లిపోతున్నానని చెప్పాడాయన. 'ఇక్కడ ప్రతి ఒక్కడూ అబద్ధాలాడుతున్నాడు. తాము ఆడే అబద్ధాలను తామే నమ్ముతున్నారు' అన్నాడాయన.

భారతదేశంలో ఒక మహా అబద్ధం వ్యాప్తిలో ఉంది. ప్రచార సాధనాలలో మితవాద వర్గాలు ఆ అబద్ధాన్ని పెద్ద ఎత్తున ప్రచారం చేస్తున్నాయి. సైన్యమూ, సి.ఆర్.పి.ఎఫ్. బలగాలూ కాశ్మీరీలనూ పరిరక్షించడానికే అక్కడ ఉన్నాయనేది ఆ అబద్ధం. కానీ, వాస్తవం ఏమంటే సైన్యమూ, సి.ఆర్.పి.ఎఫ్. తమను పరిరక్షిస్తాయని ఒక్క కాశ్మీరీ కూడా అనుకోవడం లేదు. భారతదేశంలోని ప్రజలు సైన్యాన్నీ, సి.ఆర్.పి.ఎఫ్.నూ భద్రతా బలగాలు అని పిలుస్తాయి. కాశ్మీరీలను తీవ్రవాదుల నుంచి రక్షిస్తాయని నమ్ముతాయి. కాని, కాశ్మీరీలను రక్షించవలసింది వారి నుంచే. ఈ బలగాలు తమ నేలను ఆక్రమించిన బలగాలనీ, అవి అక్కడి నుంచి వైదొలగాలని కాశ్మీరీలు భావిస్తున్నారు. ఈ బలగాల పట్ల కాశ్మీరీలలో ఉన్న భావాలు భయం, ద్వేషం, ప్రతీకార వాంఛ మాత్రమే.

గత రెండు నెలల్లో కాశ్మీర్‌లో పోలీసులూ, సి.ఆర్.పి.ఎఫ్. జరిపిన కాల్పులలో 55 మంది నిరాయుధ సాధారణ ప్రజలు చనిపోయారు. వారిలో అత్యధికులు పోలీసుల మీద రాళ్లు రువ్వుతున్న చిన్నపిల్లలో, తమ వీథి మొగలో ఆడుకుంటున్న చిన్నపిల్లలో మాత్రమె. ఈ ఆందోళన ప్రారంభమైనప్పుడు నేను కాశ్మీర్‌లో ఉన్నాను. అక్కడ నేను హాజరయిన ప్రతి అంత్యక్రియలోనూ కాశ్మీరీలలో ఎంత ఆగ్రహం ఉన్నదో నేను కళ్లారా చూశాను. గంగ్‌భాగ్‌లో ఒక పదిహేడేళ్ల పిల్లవాడి అంత్యక్రియలు జరుగుతున్నప్పుడు పోలీసులు కర్ఫ్యూ విధించినా దాన్ని ధిక్కరించి వేలాది మంది హాజరు కావడం నేను కళ్లారా చూశాను. ఆ పిల్లవాడిని పోలీసులు పట్టుకుపోయినప్పుడు పక్కనే ఉండిన ఇద్దరు స్నేహితులు జరిగినదంతా కెమెరాల ముందు చెప్పారు. కానీ, పోలీసులు మాత్రం ఆ పిల్లవాడు ఈత కొడుతూ చనిపోయాడని అబద్ధం చెప్పారు. నిజానికి ఆ పిల్లవాడు చాలా మంచి ఈతగాడు. శవపరీక్షలో అతని తల మీద రెండు మొరటు సాధనంతో కొట్టిన గాయాలు కనిపించాయి. మరుసటి రోజు

ఎన్.డి.టి.వి. ఇంటర్వ్యూలో మాట్లాడుతూ ముఖ్యమంత్రి ఒమర్ అబ్దుల్లా ఏమన్నాడో తెలుసునా? 'ఆ కుర్రవాడి జీవితం అంత ముఖ్యమైనదైతే, పక్కనే ఉన్న ఇద్దరు కుర్రాళ్లు అతన్ని అరెస్టు కాకుండా ఎందుకు కాపాడలేదు?' ఈ మాట అనడం ఎంత దుర్మార్గమైన మొరటుతనమో చెప్పనక్కరలేదు. కానీ, ఒమర్ అబ్దుల్లా ప్రాపంచిక దృక్పథం అది. ఆయన దృష్టిలో కాశ్మీరీలో విశ్వాసపాత్రులు కాని మనుషులు. పి.డి.పి.నో, ఐ.ఎస్.ఐ.నో డబ్బులు వెదజల్లితే చచ్చిపోవడానికి సిద్ధంగా ఉన్న మనుషులు. ఆయన జీవితంలోని నలభై ఏళ్లలో అత్యధిక భాగం భారతదేశంలో గడిపాడు. ఈ ప్రాపంచిక దృక్పథం ఆయనకు అక్కడే అలవడింది. ఇక పి.డి.పి. నాయకులైన ముఫ్తీల విషయానికి వస్తే కాశ్మీర్ రాజకీయాలలో వాళ్లు ఒక సన్నని తీగ మీద నడుస్తూ ఉంటారు. వాళ్లు ఎప్పుడు ప్రత్యేవాదులవుతారో, ఎప్పుడు భారత జాతీయ వాదులవుతారో చెప్పడం చాలా కష్టం. వాళ్లకు కావలసిందల్లా అధికారం. కేంద్ర ప్రభుత్వం ఒమర్ అబ్దుల్లాను తొలగించి ఆ స్థానంలో మెహబూబా ముఫ్తీని పెడితే వాళ్లకు చాలు.

కాశ్మీరీలకూ అబ్దుల్లాలకూ మధ్య ఛేదించడానికి వీలులేని ఒక విభజన రేఖ ఉంది. కాశ్మీరీల మీదికి ఎల్లవేళలా ఒక తుపాకీ గొట్టం గురిపెట్టబడి ఉంటే, ఇదే ఇంటర్వ్యూలో ఒమర్ అబ్దుల్లా తన గురించి తాను సముచితంగా చెప్పుకున్నట్టు, ఆ తుపాకి అబ్దుల్లాల భుజం మీద ఉంటుంది. తాము ఎందుకు ఇంత 'ఆత్మహత్యా' సదృశంగా కర్ఫ్యూలను ధిక్కరిస్తూ, రాళ్లు విసురుతూ ఉన్నామో అబ్దుల్లాలూ, ముఫ్తీలూ ఎన్నటికీ అర్థం చేసుకోజాలరని కాశ్మీర్‌లో జనం చెపుతారు. ఎందుకంటే గత రెండు దశాబ్దాలలో కాశ్మీర్‌లో మొలిచిన డెబ్బైవేల సమాధి రాళ్ల కింద అబ్దుల్లాలకూ, ముఫ్తీలకూ చెందిన సొంత మనుషులెవరూ లేరు. మా బంధువులలో చిరకాలంగా నేషనల్ కాన్ఫరెన్స్‌కు కరడుగట్టిన సానుభూతి పరుడు అయిన ఒక వృద్ధుడు ఉన్నారు. ఆయన అబ్దుల్లాలు తనను మోసం చేశారని ఎందుకు ఎప్పుడు వాపోతుంటాడో నాకు ఇప్పుడర్థమవుతుంది. ఆయన ప్రతిరోజూ ఒక మాట గొణుగుతుంటాడు: 'షేర్ – ఎ – కాశ్మీర్ షేక్ అబ్దుల్లా కాశ్మీరీలను డోగ్రా మహారాజుల నిరంకుశ పాలన నుంచి విముక్తి చేయడానికి వీరోచితంగా పోరాడాడు. కానీ, ఆ పాలన స్థానంలో మరింత కర్కోటకమైన పాలనను నిర్మించాడు.'

శ్రీనగర్‌లో హజూరిభాగ్‌లో తన చిన్నారి కొడుకు మృతదేహాన్ని కరచుకుని విలపిస్తున్న ఒక వృద్ధుడి చిత్రం చూశాను. అరడజను మంది పోలీసులు ఆ మృతదేహం నుంచి ఆయనను పక్కకు లాగడానికి ప్రయత్నిస్తున్నారు. ఆయన తన కొడుకు శవాన్ని వదలడం లేదు. ఆయన చొక్కా నిండా రక్తం మరకలు. తెల్లని ఆయన గడ్డంలో అక్కడక్కడా ఎర్రని రక్తం మరకలు. నేనా ఫొటోను చూసినకొద్దీ నాకు దానిలోంచి చెవులు బద్దలయ్యే శబ్దాలు వినిపించాయి. కొడుకు మృతదేహాన్ని కావలించుకుని ఏడ్చే తండ్రిని బలవంతాన లాగడం అనేది ఎంత దుస్సహమైన దృశ్యమో నేను ఊహించలేకపోయాను. ఒమర్ అబ్దుల్లా వంటి వాళ్లు ఎన్ని విజ్ఞప్తులు చేయనీ, ఆ ముసలి తండ్రి కర్ఫ్యూనూ ధిక్కరించకుండా, 'ఆందోళనకారుల గుంపు' లో చేరకుండా ఆపగలరా? ఒక తండ్రిగా, ఒక ముఖ్యమంత్రిగా ఒమర్ అబ్దుల్లానే ఆ ముసలి తండ్రి స్థానంలో ఉంటే ఏం చేసి ఉండేవాడు? ఆయన నగరాన్ని అల్లకల్లోలం చేసి ఉండేవాడు కాదా? అటువంటి స్థితే వస్తే శ్రీనగర్ భస్మీపటలం అయి ఉండేదని నా ఊహకు అందుతోంది. ఆ ఊహ తరువాత కాశ్మీర్‌లో నేను చూసిన తండ్రులనూ, అన్నలనూ, చిన్నాన్నలనూ, మామలనూ, మిత్రులనూ, ఇరుగుపొరుగు వారినీ గుర్తుకు తెచ్చుకున్నాను. వారందరూ చనిపోయిన తమ ప్రియాతి ప్రియమైన మనుషులను మేల్కొల్పడానికి ప్రయత్నిస్తున్నారు. అలా మేల్కొల్పడానికి రాళ్లు విసిరినా, పోలీసు స్టేషన్‌లను తగులబెట్టినా, స్పెషల్ ఆపరేషన్స్ గ్రూప్ శిబిరాలను తగులబెట్టినా, వాళ్లు చేస్తున్నది ఒమర్ అబ్దుల్లా చేసే ఉండేదాని కన్న చాలా చాలా తక్కువ అని అనిపించింది.

కాశ్మీర్ గాథ ఎంత సుదీర్ఘమైనదీ, ఎంత విషాదకరమైనదీ, ఎంత రక్తసిక్తమైనదీ అంటే, దాన్ని కేవలం శాంతి భద్రతల సమస్యగా చూడడం అసాధ్యం. కాశ్మీర్‌లో సాయుధ బలగాల వల్ల అనాథలైపోయిన పిల్లలందరూ రాళ్లు విసరడం మొదలుపెడితే వీధుల్లో అరవై వేల మంది రాళ్లు విసిరేవాళ్లు తయారవుతారు. సాయుధ దళాల వల్ల సహచరులను కోల్పోయిన స్త్రీలు అందులో కలిస్తే మరొక ముప్పై వేల మంది స్త్రీలు రాళ్లు విసరడం మొదలుపెడతారు. ఆ రాళ్లు ప్రతి బంకర్‌నూ, ప్రతి శిబిరాన్నీ, ప్రతి సైనికుడినీ గురిపెడతాయి. నిజానికి, కాశ్మీర్‌లో ఒక పిల్లవాడు తన చేతిలో రాయితో సాయుధ సైనికుడివైపు నడుస్తున్నప్పుడు ఆ పిల్లవాడికి తమ ఇద్దరి మధ్య అధికారంలో ఉన్న తేడా గురించి స్పష్టంగా తెలుసు. ఆ పిల్లవాడు ఎంత గురిచూసి సైనికుడి మీద రాయి విసిరినా అది ఆ సైనికుడికి ఒక బొప్పిని మిగులుస్తుంది. లేదా, కొన్ని కుట్లు పడవచ్చు. అదైనా ఆ కుర్రవాడి రాయి సైనికుడి కాళ్లకు అడ్డంగా ఉన్న రక్షణ కవచాన్నీ, బుల్లెట్‌ప్రూఫ్ జాకెట్‌నూ, హెల్మెట్‌నూ దాటి ముందుకు వెళ్లగలిగితే. కానీ, సైనికుడి చేతిలో ఉన్న తుపాకి గానీ, బాష్పవాయువు గోళం గానీ, ఆ పిల్లవాడిని ఒక్క దెబ్బకు చంపి పారేస్తాయి. తీవ్రంగా గాయపరుస్తాయి. ఈ సంగతి పిల్లవాడికి స్పష్టంగా తెలుసు. కానీ, ఒక రాయిని తన ఆయుధంగా ఎంచుకోవడం అనే చర్యలోనే ఆ పిల్లవాడు తనను తాను ఒక ఉన్నత నైతిక పునాది మీద నిలబెట్టుకుంటున్నాడు. ఆ పిల్లవాడి లక్ష్యం సైనికుడిని చంపడం కాదు. ఎక్కడో ఏదో పెద్ద పొరపాటు జరిగింది అని చెప్పడం మాత్రమే ఈ రాయి లక్ష్యం. అందువల్లనే గత రెండు సంవత్సరాల రాళ్లు విసిరిన ఘటనలలో ఒక్క సైనికుడుగానీ, పోలీసు జవాను గానీ మరణించలేదు. నిజానికి, అయిదుగురు రాళ్లు విసురుతున్న కుర్రవాళ్ల మధ్య ఒకే ఒక సైనికుడు ఉన్న దృశ్యాలు కూడా మనం అనేకం చూశాం.

భారతదేశం కానీ, ప్రపంచం కానీ తమ గోడు వింటారని కాశ్మీరీలు ఎంతో కాలంగా ఎదురుచూశారు. కాని, వాళ్ల భాష ఏ ఒక్కరికీ అర్థమైనట్టు లేదు. ఇక మానవ మాత్రులందరికీ అర్థమయ్యే ఆదిమ భాషలోనే మాట్లాడక తప్పదని కాశ్మీరీలు గుర్తించినట్టున్నారు. గత రెండు నెలలుగా వాళ్లు రాళ్ల భాషలో మాట్లాడుతున్నారు. తమ పిల్లలను ఇళ్లలోనే నిర్బంధించి ఉంచాలని తల్లులకు ఒమర్ అబ్దుల్లా విజ్ఞప్తి చేశాడు. కానీ, ఆ తల్లులే రాళ్లు విసురుతూ వీధుల్లోకి వచ్చారు. గత నెల టెలివిజన్ తెరల మీద ఈ రాళ్లు విసిరే దృశ్యాలెన్నిటినో నేను చూశాను. ఆ రాళ్లు విసిరే వాళ్లను లష్కరే తొయిబా కిరాయికి పెట్టుకున్న ఏజెంట్లు రెచ్చగొడుతున్నారని వ్యాఖ్యలు విన్నాను. కానీ, ఈ 'కిరాయి మూక'లో నాకు మా ఇరుగు పొరుగు వాడల నుంచి పరిచయస్తుల ముఖాలెన్నో కనబడ్డాయి. ఇద్దరు అక్కాచెల్లెళ్లు రాళ్లు విసురుతుండడం చూశాను. వాళ్లిద్దరు నాకు తెలుసు. 2005లో వాళ్ల సోదరుడిని బి.ఎస్.ఎఫ్. జవానులు ఎత్తుకుపోయారు. ఆ ఇద్దరిలో ఒకరు ఆ బి.ఎస్.ఎఫ్. జీపు వెంట పరిగెత్తారు. పదిరోజుల తరువాత వాళ్ల సోదరుడు ఒక మాంసం ముద్దగా మరొక వీధిలో దొరికాడు. ఆయన చర్మం తగులబడి ఉంది.

ఆయన శరీరం మీద బరువైన రోలర్లు తిప్పినట్టు గుర్తులున్నాయి. ఆయనకు పురుషాంగంలో కరెంటు వైర్లు జొప్పించి ఉన్నాయి. ఆయన ఒక ప్రాణం ఉన్న యువకుడిలా లేదు. అలాగే, ఆ గుంపులో మరొక మధ్యవయసు స్త్రీని నేను చూశాను. ఆమె భర్త 1995లో మాయ మయ్యాడు. ఇప్పటిదాకా జాడలేదు. నాకు తెలిసిన మరొక స్త్రీ కొడుకును సాయుధ బలగాలు చంపేశాయి. వాళ్లు విసిరే రాళ్లు సైనికుల దాకా చేరడమే లేదు. కానీ, అది ముఖ్యం కాదు. వాళ్లు వాళ్ల ఇళ్ల నుంచి బయటికి వచ్చి ప్రకటిస్తున్న విషయం, రాళ్లు సైనికులకు తగలాలని కాదు. ఆ విసిరే చర్య ద్వారా తమ ఆగ్రహం ప్రకటించాలని మాత్రమే.

ఈ మొత్తం ఘర్షణలో ఇంతకాలంగా స్త్రీలు మౌనంగా ఈ వేదననంతా అనుభవిస్తున్నారు. సైన్యం సాగించే సైకొలాజికల్ ఆపరేషన్స్‌లో భాగంగా అత్యాచారాలు జరిగాయి. అవమానాలు జరిగాయి. అవేవీ పత్రికలకు ఎక్కలేదు కానీ, భరించిన స్త్రీలకు తెలుసు కదా? ఈ బాధితులకు చికిత్స చేసిన, ఉపశమనం ఇచ్చిన మెడిసిన్స్ సాన్స్ ఫ్రంటీయర్స్ సంస్థకు చెందిన కౌన్సిలర్‌లకూ, ఎంతోమంది మానసిక వైద్యులకూ తెలుసు కదా? ఈ రాళ్లు విసరడం ఆ బాధితులకు ఒక రకమైన ఉపశమనం అని వాళ్లంటారు. కొండల లాగా బరువెక్కిన తమ హృదయాల భారాన్ని ఈ ఒక్కొక్క రాయి కొంత కొంత తగ్గిస్తుంది.

కొన్ని రోజుల కింద బటమాలూలో మా చిన్నమ్మ కొడుకు అయిదు సంవత్సరాల అత్తర్ వాళ్ల ఇంటి గేటు తెరిచి బయటకు వెళ్లబోయాడు. సైనికులు వాడి వైపు పరుగెత్తుకొస్తూ 'హమ్ మార్‌డాలేంగే (చంపేస్తాం)' అని కేకలు పెట్టారు. వాడు దిగ్భ్రాంతితో లోపలికి పరుగెత్తుకొచ్చాడు. మాట పడిపోయినట్టు అయిపోయాడు. తల్లి ఎంత బతిమిలాడినా, ఏం జరిగిందో చెప్పలేకపోయాడు. పది నిమిషాల పాటు బుజ్జగిస్తే సైనికులు తనను చూసి ఏమని అరిచారో చెప్పాడు. కామర్స్ పట్టభద్రురాలైన మా చిన్నమ్మ కోపంతో తన దుఃఖాన్ని దిగమింగి వాణ్ని భుజాల మీద కూర్చోబెట్టుకొని తమ ఇంటి దగ్గరలో జరిగే ఒక ఆజాదీ అనుకూల ఊరేగింపుకు తీసుకువెళ్లింది. వాళ్లిద్దరూ ఆజాదీ అనుకూల నినాదా లిచ్చారు. ఆ నినాదాలిస్తేనే వాళ్ల మనస్సులో భయం కరిగిపోయింది. నిజానికి అటువంటి ఊరేగింపులో పాల్గొనడం, ఆ నినాదాలు ఇవ్వడం వాళ్లకు అదే మొదటిసారి. ఇప్పుడు మా చిన్నమ్మ తన చేతికందిన ప్రతి కరెన్సీ నోటుమీద 'గో ఇండియా, గో బ్యాక్' అని రాస్తోంది. మా అత్తర్‌కు తెలిసిన ఏకైక ఇంగ్లిష్ వాక్యం. వాడది గోడల నిండా రాస్తున్నాడు. ఇటువంటి చిన్నారి పిల్లల వల్లనే శ్రీనగర్ అనే 'తలుపులు మూసుకున్న' ఖాళీ రహదారుల నగరంలో దుమ్ము నిండిన గోడల నిండా మూసిన తలుపుల మీదా ఆజాదీ అనుకూల నినాదాలు కనబడుతున్నాయి.

ఇవాళ కాశ్మీర్‌లో ఉద్యమం పాకిస్తాన్ నీడ నుంచి, అఫ్ఘనిస్తాన్ నీడ నుంచి చాలా దూరం వచ్చేసింది. కాశ్మీర్ తుపాకుల నుంచి నినాదాలకు పరిణమించింది. అన్నిరకాల నిరసనలను ప్రభుత్వం బలవంతాన అడ్డుకున్నప్పుడు రాళ్లు చేపట్టింది. 2008లో కాశ్మీర్‌లో వీథులలో లక్షలాది మంది ఊరేగింపులలో పాల్గొన్నారు. మానవ హారాలు ఏర్పాటు చేశారు. కానీ, అప్పుడు బంకర్‌లను, సైనికులను ఎవరూ ముట్టుకోలేదు. ఈ సంవత్సరం కాశ్మీరీలు అహింసాయుతంగా ప్రదర్శనలు జరపడాన్ని ప్రభుత్వం విజయవంతంగా అడ్డుకుంది. ప్రదర్శన కారులను చెదరగొట్టడానికి కాల్పులు జరపమని సాయుధ బలగాలకు మొట్టమొదటి ఉత్తర్వు ఇచ్చింది. ఈ సంవత్సరం ఎటువంటి పరిస్థితుల లోనూ ప్రజలు గుమిగూడడాన్ని సాయుధ బలగాలు అనుమతించలేదు. చివరికి శవయాత్రల మీద కూడా డజన్ల సార్లు కాల్పులు జరిపారు. చివరికి ఆ ప్రదర్శకులు రాళ్లు విసిరే వాళ్లయ్యారు.

ఇవాళ్టికివ్వాళ కాశ్మీర్‌లో తీవ్రవాద శక్తులకు ఆశ్రయం ఇచ్చే ఇళ్లు లేవు. సహకరించే చేతులు లేవు. భారతదేశంతో తమ వివాదాన్ని తుపాకులతో సంబంధం లేకుండా పరిష్కరించుకోవాలని కాశ్మీరీలు కోరుకుంటున్నారు. ఇటువంటి స్థితిలో కాశ్మీరీలను పాకిస్తాన్ కిరాయి మూకలుగానో, పి.డి.పి. కార్యకర్తలుగానో చిత్రించడం చూస్తే నాకు దుఃఖం కలుగుతోంది. నిజానికి శ్రీనగర్‌లో అన్నిటికన్నీ స్థానాలను గెలుచుకున్నది నేషనల్ కాన్ఫరెన్స్. పి.డి.పి. కాదు. మరి ఇవాళ ఆ శ్రీనగరే రాళ్లు విసరడానికి కేంద్రంగా ఉన్నదని ప్రభుత్వం చెబుతోంది. ఈ సంవత్సరం మొదట్లో ఒమర్ అబ్దుల్లాను ఇంటర్వ్యూ చేస్తూ నేను ఒక ప్రశ్న అడిగాను. ఆయన తనను తాను కాశ్మీరీల నాయకుడిగా భావించుకుంటున్నాడా, లేక, ఒకానొక కాశ్మీర్ రాజకీయవేత్తనను కుంటున్నాడా అని. ఆయన చాలా ఆందోళనపడినట్టు కనిపించి, తనకు అరవై శాతం ఓట్లు వచ్చాయని, అదే జవాబు అని అన్నాడు. మరి, ఆ ఓట్లన్నీ ఇప్పుడేమయిపోయాయని ఆయన అనుకుంటున్నాడు?

ఇవాళ రాళ్లు విసిరే వాళ్లను, నిరసన తెలిపేవాళ్లను తీవ్రవాదులనే ముద్రవేసి చంపడం కొనసాగిస్తే, కాశ్మీరీలు మళ్లీ ఒకసారి తమ పాత తుపాకులను తవ్వి తీయక తప్పదు. మరొకవైపు ప్రపంచంలోకెల్లా అతి ఎక్కువ ఆయుధాలు దిగుమతి చేసుకొనే, కాశ్మీర్‌లో ఏడు లక్షల మంది సైనికులను మోహరించిన భారత ప్రభుత్వం మరొక సాయుధ తిరుగుబాటు జరిగితేనే బాగుండు అనుకుంటున్నట్టుంది. ఆ తిరుగుబాటును తీవ్రవాద ఉద్యమం అని పిలవదలచుకున్నట్టుంది. కాని, ప్రస్తుత తరం కాశ్మీరీలు తమ చేతిలో రాయితో సహా ఏకే – 47 వైపు నడుస్తున్న కాశ్మీరీలు ఆ ఆయుధాన్నే చేతబడితే అది 1990ల కన్నా ఘోరమైన పరిస్థితి అవుతుంది. సాయుధ విప్లవం అనేది తమ పిల్లలనే ఎట్లా బలిగొంటుందో కాశ్మీర్‌కు తెలుసు. కాని, ఇప్పుడిక ఆ తెలివిడి కూడా వాళ్లను ఆపబోవడం లేదు. కాశ్మీర్ మొత్తం రాళ్ల గుట్టగా మారిపోయే మాట నిజమే. కానీ, వాళ్ల చుట్టూ నిలిపిపెట్టిన అభేద్యమైన గాజు భవనాలు కూడా ముక్కలుచెక్కలైపోతాయి. అది ఒక యుద్ధం. నా లోలోపల నుంచి శాంతి కాముకుడు ఆ యుద్ధాన్ని నివారించాలని కోరుతున్నాడు.

కాశ్మీర్‌లో ఇస్లాం ప్రవచనం ద్వారానే ప్రవేశించింది. కాశ్మీరీలు దాన్ని తమ ప్రత్యేకమైన పద్ధతిలో ఆమోదించారు. మా అమ్మ ప్రార్థనా స్థలాలకు వెళుతుంది. నా స్నేహితురాలు కూడా ప్రార్థనా స్థలానికి వెళుతుంది. నాకు తెలిసిన స్త్రీలందరూ వెళతారు. మా దగ్గర ప్రార్థనా స్థలాలు ఎప్పుడు చూసినా నిండా జనంతో ఉంటాయి. నిజం చెప్పాలంటే, మసీదులలో కన్న ఎక్కువ జనం అక్కడ ఉంటారు. సూఫీ ఇస్లాం మా దగ్గర వంద సంవత్సరాల కన్న ఎక్కువగా సజీవంగా వ్యాప్తిలో ఉంది. ఒకవేళ ఇవాళ్టి ఛాందస మతవాదులు ఎప్పుడైనా ఈ సూఫీ ఇస్లాంను ఓడించడమే జరిగితే అది కేవలం రాజ్య నిర్బంధంవల్ల మాత్రమే. భారత ప్రభుత్వం కొనసాగించదలచిన యథాతథస్థితి వల్ల మాత్రమే. భారత ప్రభుత్వం సూఫీ కాశ్మీరీలను లొంగదీయదలచింది. వారి సహనాన్ని బలహీనతగా భావిస్తోంది.

ఇక కాశ్మీరీ పండిత్‌ల విషయంలో 1990లలో ఏం జరిగిందనే విషయానికి వస్తే, అప్పటికి నేను చాలా చిన్నవాడిని కనుక నాకు ప్రత్యక్షంగా తెలియదు. ఆ కథ మాత్రం అప్పటికీ ఇప్పటికీ ఎన్నెన్నో

మలుపులు తిరిగింది. నా తరం కాశ్మీరీ ముస్లింలు పండిత్‌లను చూడలేదు. కాని, ఆ సంవత్సరం ఏం జరిగిందో వేరు వేరు కథనాలు విన్నాం. ఆ కథనాలను పోల్చి ఏం జరిగిందో కచ్చితంగా తేల్చుకుందామని నేను ప్రయత్నించినప్పుడల్లా దృశ్యం చాలా అస్పష్టంగా కనబడింది. మా నగరంలోని ఇరుకు సందులలో బాష్పవాయువు పొగల మధ్య దారి తెలియకుండా పోయినట్టయింది. కాని, మా అమ్మ, మా మామలు, చిన్నాన్నలు జ్ఞాపకం చేసుకున్న పాత గాథలలో కాశ్మీరీ పండిత్‌ల గురించి చాలా విన్నాం. మా పాత ఫొటో ఆల్బంలలో వారిని చూశాం. పండిత్‌లకు వ్యతిరేకంగా పల్లెత్తు మాట అనడం మా ఇంట్లో నేరం. చివరికి మితవాద పండిత్ గ్రూప్‌లకు గురించి అయినా సరే, కాశ్మీర్ రాజకీయ ఉద్యమం మతోన్మాద పూరితమైనదని అనే పండిత్‌ల గురించి అయినా సరే వ్యతిరేకంగా మాట్లాడకూడదు అని మా ఇంట్లో నియమం. ఎప్పటికైనా పండిత్‌లు తమ స్వస్థలానికి తిరిగి రావాలని, మాలాగ కాకుండా ఒక కొత్త తరం పండిత్‌లతో కలిసి స్నేహపూర్వకంగా ఎదిగి రావాలని, ఈ పరాయితనం పోవాలని నా కోరిక.

నా వరకు నాకు కాశ్మీర్ గురించిన దృశ్యం హెన్రీ కార్టియర్ బ్రెస్సన్ తీసిన ఫొటోగ్రాఫ్ లాగా ఉంటుంది. అందులో ఇద్దరు కాశ్మీరీ స్త్రీలు కోహీమారన్ కొండల మీద నిలబడి రెండు చేతులూ ప్రార్థిస్తున్నట్టుగా పైకెత్తి ఉంటారు. వారిలో ఒకరు పాత కాశ్మీరీ బుర్ఖా ధరించి ఉంటారు. దానిలో కళ్లను మాత్రం కప్పిన ఒక జాలి ఉంటుంది. మరొక స్త్రీ ఒదులుగా, సాంప్రదాయికంగా ఉండే కాశ్మీరీ గౌన్ ధరించి ఉంటుంది. కింద ప్యాంటు లాంటిది ఉండదు. వాళ్లిద్దరూ పక్కన పక్కన నిలబడతారు. నిర్మల వినీలాకాశంలోకి చూస్తూ ఉంటారు. సమున్నత పర్వతాలు కనబడుతుంటాయి. వారొక అదృశ్య భగవంతుడిని ప్రార్థిస్తూ ఉంటారు. తమ ఇద్దరి మధ్య భేదాలున్నాయని వారికి తెలియనట్టుగానో, పట్టించుకోకుండానో ఉంటారు. ఇటువంటి స్త్రీలను ప్రస్తుత ఘర్షణ ఇప్పటికే అనామకత్వంలోకి నెట్టేసింది. నిరాయుధ నిరసనకారులను ఈ విధంగానే చంపడం కొనసాగిస్తే, ఒకానొక నాటికి ఆ ఇద్దరు స్త్రీలను, కలిసి చూసిన ఆ కొండలు కూడా అదృశ్యమైపోతాయి. మా కలల్లో, ఆకాంక్షలలో నిత్యం మాకు తెలిసిన కాశ్మీర్ మరెన్నటికీ కనబడకుండా పోతుంది.

ఆజాదీ కొరకు ఆకాంక్ష కనుమరుగైపోయిందని అయిదేళ్ల కింద నేననుకున్నాను. కాని చూడగా అది తుపాకుల నుంచి రాళ్లకు మారిన నిశ్శబ్ద పరిణామ క్రమంలా ఉంది. 1953లోని ప్లెబిసైట్ ఫ్రంట్ నుంచి, 1970ల తొలిరోజుల్లోని అల్‌ఫతా నుంచి, 1989 నాటి జమ్మూ కాశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ నుంచి, ఇవాళ్టి తొమ్మిదేళ్ల రాళ్లు విసిరే పిల్లవాడి దాకా కాశ్మీర్‌లో ఆజాదీ భావోద్వేగం సజీవంగా నిలిచి ఉంది. భారతదేశం వంటి ఒక మహా ఆర్థికవ్యవస్థ, ఒక విస్తరిస్తున్న ఆధిపత్య శక్తి కాశ్మీరీల హృదయాలను, ఆలోచనలను చూరగొనడానికి వేలాది కోట్ల రూపాయలు ఖర్చుపెట్టింది. కాని, ఆ కొనుగోలు సాగుతున్నట్టు లేదు. సంతోషంగా డబ్బు తీసుకుంటున్న చోట కూడా ఆ భావోద్వేగాన్ని ఒదులుకుంటున్నట్టు లేదు. మొదటిస్థాయి చర్యలు ఎప్పుడో గాడి తప్పాయి. ఇప్పుడు స్థాయి చర్యలు అయిదు నక్షత్రాల హోటళ్లలో పనికిరాని మనుషులను వెతకడంలో దారితప్పుతున్నాయి. ఏ చర్యలూ పనికిరాలేదు.

కాశ్మీర్ సమస్యను నిజంగా పరిష్కరించాలంటే, భారతదేశం తన డబ్బును, తన తుపాకిని పక్కనపెట్టి కాశ్మీరీలతో మాట్లాడడం మొదలుపెట్టాలి. కాశ్మీర్‌ను చేరుకోవడానికి న్యూఢిల్లీ ముందర రెండు మార్గాలున్నాయి. ఇది ఒక వివాదంగా గుర్తించి దాన్ని పరిష్కరించే లక్ష్యంతో సమస్కందులతో మాట్లాడినట్టుగా మాట్లాడడం ఒక మార్గం. లేదా, దీన్నంతా ఒక శాంతిభద్రతల సమస్యగా పరిగణించి అసలు వ్యాధిని ముట్టుకోకుండా పైపైన రోగ లక్షణాలకు చికిత్స చేయడం. నేషనల్ కాన్ఫరెన్స్, పి.డి.పి. వంటి ప్రధాన స్రవంతి పార్టీలు స్వపరిపాలన గురించి, స్వతంత్ర ప్రతిపత్తి గురించి పత్రాలు సమర్పించాయి. అవన్నీ భారత రాజ్యాంగ పరిధి లోపలే మాట్లాడుతాయి. కానీ, కేంద్ర ప్రభుత్వం ఆ పత్రాలన్నిటినీ చెత్తబుట్టకు దాఖలు చేసింది. మరొక పక్క పీపుల్స్ కాన్ఫరెన్స్ నాయకులు సజ్జాద్ లోనీ రెండు సంవత్సరాల పాటు కృషి చేసి, 'సాధించగలిగిన జాతీయత' అనే విధానాన్ని రూపొందించారు. కాని, అది చర్చకే రాలేదు. హురియత్ నాయకుడు మిర్వేజ్ ఉమర్ ఉన్నట్టు, 'న్యూ ఢిల్లీతో మాట్లాడదలచుకున్న వారెవరైనా వాళ్ల ప్రతిష్టనూ, ప్రాణాలనూ కూడా ప్రమాదంలో పెట్టుకున్నట్టే'. భారత ప్రభుత్వం చర్చల ప్రతిపాదన గురించి మరికొంత నిజాయితీతో ఉండాలి. చర్చల ప్రతిపాదనలు కేవలం కలిసి ఫోటోలు దిగడం మాత్రమే కాదని గుర్తించాలి. ఇక భారత సైనికుల విషయానికి వస్తే వాళ్లలో అత్యధిక సంఖ్యాకులు మైదాన ప్రాంతాల నుంచి వచ్చిన నిరుపేద గ్రామస్తులు. వాళ్లు తమ జీవితాలను కాశ్మీర్‌లోని ఒంటరి ఇసుక బంకర్‌ల మధ్యన గడపవలసి వస్తోంది. తమ మీదికి కురుస్తున్న రాళ్లవర్షాన్ని ఎదుర్కొంటూ కాశ్మీరీ యువకుల ప్రాణాలు తీస్తూ బతకవలసి వస్తోంది. వాళ్ల జీవితాల చుట్టూ ముళ్ల కంచెలు పడి ఉన్నాయి. అందువల్లనే వారిలో ఆత్మహత్యల సంఖ్య పెరిగిపోతోంది. లేదా, ఆ అసహనాన్ని తీర్చుకోవడానికి కాశ్మీర్‌లో తమ సోదరుల ప్రాణాలు బలితీస్తున్నారు. భారత ప్రభుత్వమే గనుక వారిని జాతీయవాదపు పావులలాగా వాడుకోకుండా గౌరవనీయమైన పౌరులలాగ చూస్తే అది సైనికులకు కూడా విముక్తి అవుతుంది. భారత ప్రభుత్వం కాశ్మీర్‌లో కేవలం తుపాకుల ద్వారా ముందుకు సాగజాలదు. లేదా, డబ్బులు పోసి అక్కడి మనోభావాలను రద్దు చేయజాలదు. కనీసం కాలయాపన అయినా చేస్తుందంటారా, ఇప్పటికే అరవై మూడు సంవత్సరాలు గడచిపోయాయి.

*(రచయిత పాత్రికేయులు, ప్రస్తుతం ఢిల్లీలో తెహల్కా పత్రికలో పనిచేస్తున్నారు)* వీ

**వచ్చే సంచికలలో...**

- ❖ **ఫోకస్ - అక్టోబర్ 2010 : రాజకీయ వ్యవస్థను బాగు చేయడం ఎలా?**
- ❖ **ఫోకస్ - నవంబర్ 2010 : యాభై నాలుగవ ఏట ఆంధ్రప్రదేశ్ భవిష్యత్తు**
- ❖ **గనులను జాతీయం చేస్తే ? - ఇ.ఎస్. బ్రహ్మచారి**
- ❖ **ఆత్మహత్యలను నివారించగలమా? - సహచరి**

*అభివృద్ధి నిరోధక రాజకీయార్థిక విధానాలలో భాగంగానే మద్యం దోపిడీ కొనసాగుతోందనీ, అనేక అనర్థాలకు కారణమవుతున్న మద్యానికి వ్యతిరేకంగా పోరాడాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* **ఎ. నర్సింహారెడ్డి**

# ప్రజారోగ్యమా? ఖజానా లాభమా?

మద్యం దోపిడీలో ఆర్థికం, రాజకీయం, వ్యాపారం, సంస్కృతి లాంటి అనేక అంశాలు ఇమిడి ఉన్నాయి. ఇది కేవలం నైతిక సమస్య మాత్రమే కాదు. ఈరోజు పెట్టుబడిదారీ వర్గాలు, పాలక వర్గాలు ప్రజల్ని దోపిడీ చేసే అనేక రూపాల్లో 'మద్యం' ఒక రూపమై ఉంది. విచిత్రమేమిటంటే సారాయి, బ్రాందీల అమ్మకం ద్వారా వచ్చే ఆదాయం తోనే బడుగువర్గాల సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించగలుగుతున్నామని ప్రభుత్వం నిస్సిగ్గుగా చెప్పుకుంటోంది. భారత రాజ్యాంగం 47వ ప్రకరణ 'జూదం, వ్యభిచారం, మత్తు పదార్థాలు, లాటరీలు, గుర్రప్పందాలు వంటివి ప్రభుత్వపు ఆదాయ వనరులు కారాదు. వైద్య అవసరాలకు తప్ప మత్తు పదార్థాల వినియోగాన్ని నిషేధించాలి' అని స్పష్టంగా పేర్కొంది. ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజ్యం తన సంక్షేమ కార్యక్రమాలకు పర్యాటకరంగం మీద, మద్యం అమ్మకాల మీద ఆధారపడడం, అలా ఆధారపడడాన్ని సమర్థించుకోవడం అమానుషం, దుర్మార్గం.

రెండు శతాబ్దాలు ఇండియాను పాలించిన బ్రిటిష్ వలసవాదులు వ్యవసాయం, చేతి వృత్తులను ధ్వంసం చేశారు. దేశాన్ని నిలువు దోపిడి చేయడంతో పాటు ప్రజల్లో పరిమితంగా ఉన్న తాగుడు అలవాటును తమ దోపిడీకి వనరుగా మలుచుకున్నారు. అప్పటికి భూమికే పరిమితమై ఉన్న శిస్తును మద్యానికి కూడా విస్తరింపచేశారు. 1790లోనే ఎక్సైజ్ విధానాన్ని రూపొందించి అమలుపరిచారు. దేశంలో ఉత్పత్తి అయ్యే మద్యానికి శిస్తు విధించారు. ఎక్కువ రెవెన్యూ ఇచ్చినవారికే షాపులు ఇచ్చారు. తమ ఖజానాను మరింత పెంచుకోవడానికి 1862లో కేంద్రీకృత డిస్టిలరీ పద్ధతిని ప్రవేశపెట్టారు. దీనికి పరాకాష్టగానే ఎక్సైజ్ శాఖను నెలకొల్పి, 1871లో సారా దుకాణాల వేలం పాటల పద్ధతిని ప్రవేశపెట్టారు. ఎంతో మంది కల్తీ మద్యం తాగి ప్రాణాలు కోల్పోయారు. ఫలితంగా దేశ వ్యాప్తంగా మద్యపానానికి వ్యతిరేకంగా 1907లో మద్యం దుకాణాల ముందు ధర్నాలు, పికెటింగ్‌లు జరిగాయి. స్వాతంత్ర్య ఉద్యమ కాలంలో మద్యపాన నిషేధం రాజకీయ ఎజెండాలోకి వచ్చింది. దీని గురించి గాంధీ ఎంతో ప్రచారం చేశాడు. ప్రజాభిప్రాయాన్ని సమీకరించే ప్రయత్నం చేశాడు. 1921లో కాంగ్రెస్ పార్టీ మద్యాన్ని నిషేధించాలని డిమాండ్ చేసింది. 1937లో వివిధ రాష్ట్రాల్లో కాంగ్రెస్ ప్రభుత్వాలు మద్యాన్ని నిషేధించాయి.

దేశంలో మద్యపాన నిషేధం అమలు జరపాలనే అభిలాషను మన రాజ్యాంగ నిర్మాతలు సూచించినా రాజ్యాంగ సభలోని మెజారిటీ సభ్యులు ఆమోదాన్ని తెలుపనందున ఆదేశిక సూత్రాలలో (అధికరణ 47) పొందుపరిచారు. ఈ అభిలాషను ఆచరణీయం చేసే బాధ్యతను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలపై ఉంచారు. రాజ్యాంగం అమలులోకి రాకముందే కొన్ని ప్రాంతాలలో మద్య నిషేధం అమలులోకి వచ్చింది. నిషేధాన్ని జాతీయ విధానంగా విస్తరించేందుకు కొంత కృషి జరిగింది. నిషేధం అమలు ప్లానింగ్ కమిషన్‌కు అప్పగించారు. కమిటీలు వేశారు. లోక్ సభలో తీర్మానాలు చేశారు. దీనిని ఒక సాంఘిక సంక్షేమ కర్తవ్యంగా పరిగణించారు. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో కేంద్ర హోంశాఖ ఆధ్వర్యంలో ఒక కేంద్రీయ నిషేధ కమిటీని నియమించారు. మూడవ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రాల ఆధ్వర్యంలో నిషేధం అమలు సంతృప్తికరంగా జరగడం లేదని నిషేధాన్ని సాంఘిక సంక్షేమ ఉద్యమంగా పరిగణించాలని కేంద్ర ప్రభుత్వం భావించింది. ఆ తర్వాత 1963లో జస్టిస్ టేక్‌చంద్ ఆధ్వర్యంలో ఒక అధ్యయన కమిటీని కేంద్రం నియమించింది. 1964లో ఆ కమిటీ తన నివేదికను సమర్పించింది. ఈ నివేదిక 1265 పేజీలు రెండు సంపుటాలలో ఉంది. సారాయి తయారీ, వ్యాపారం, వాడకం, పర్యవసానాలు, సారా వ్యతిరేక ఉద్యమాల చరిత్ర, సమస్యలు, నిషేధ చట్టాల వైఫల్యం ఇత్యాది విషయాలన్నీ ఇందులో పొందుపరిచింది. 1970 అక్టోబర్ 2 గాంధీ శతజయంతి నాటికి దేశ వ్యాపిత నిషేధాన్ని సాధించాలని లక్ష్యంగా ప్రకటించింది. వాస్తవంలో దీనికి భిన్నంగా మహాఘోరమైన పరిహాసం జరిగింది. కాంగ్రెస్ రాష్ట్ర ప్రభుత్వాలు కొద్దికాలం నిషేధం విధించినా క్రమంగా దాన్ని ఎత్తివేసి ప్రభుత్వ ఖజానాకు ఆదాయ వనరుగా భావించాయి. రాజ్యాంగంలోని 47వ అధికరణ ఘోరంగా తిరస్కరించబడింది. డా. అంబేద్కర్ భావించిన ఆదేశిక సూత్రాల స్ఫూర్తి దెబ్బ తినింది. ఒక్క గుజరాత్‌లో తప్ప అన్ని రాష్ట్రాలలో 1960-70ల మధ్య కాలంలోనే మద్య నిషేధాన్ని ఎత్తివేశారు. రెండున్నర దశాబ్దాలు కొన్ని సమస్యలు ఎదురైనా మద్య నిషేధం పలు రాష్ట్రాలలో అమలు జరిగింది. ఇప్పటికీ గుజరాత్ రాష్ట్రంలో మద్య నిషేధం అమలు కొనసాగుతోంది.

మద్యం తయారీ, అమ్మకం, కొనుగోలు ఎన్నో సంక్లిష్టమైన అంశాలతో ముడిపడి ఉంది. మద్యానికి బానిస కావడం ప్రత్యక్షంగానో పరోక్షంగానో మన సమాజాన్ని, వ్యక్తిగత జీవితాలను విపరీతంగా ప్రభావితం చేస్తోంది. ఇది కేవలం వ్యక్తిగత, కుటుంబ పరమైన సమస్య మాత్రమే కాదు, మొత్తం సమాజానికి సంబంధించిన సమస్య. మద్యపానం పేదరికానికి, ఆకలికి, అప్పులకు దారి తీస్తే అవన్నీ కలిసి స్త్రీలపైన హింసకు దారితీస్తుంది. ఇంట్లో పిల్లల్ని చెడు మార్గం పట్టిస్తుంది. నేడు మద్యం ప్రవేశించని చోటులేదు, అది ప్రభావితం చేయని రంగం లేదు. మద్యం సేవించడం ఒక వ్యసనంగా మారినపుడు భయంకర రూపం దాల్చుతుంది. తాగుడుకు అలవాటు పడినవారిని బానిసలుగా చేసుకుంటుంది. వివేచన కోల్పోయేలా చేస్తుంది. విచక్షణా జ్ఞానాన్ని

ధ్వంసం చేస్తుంది. ఎంతైనా తెగించేలా చేస్తుంది. ఎన్నో నేరాలను, ఘోరాలను చేయిస్తుంది. తాగిన మైకంలో స్త్రీలపై అత్యాచారం ఆపైన హత్య, తాగి వాహనం నడుపుతూ ప్రమాదవశాత్తూ మరణం లేదా ఇతరుల ప్రాణాలకు ప్రమాదం కలిగించవచ్చు. కల్తీ మద్యం సేవించి ఎంతో మంది దుర్మరణం పాలవడం, తాగుబోతు భర్త వేధింపులు భరించలేక భార్య ఆత్మహత్యలకు పాల్పడడం, తాగిన మత్తులో ఇతరులను హత్య చేయడం లాంటి ఎన్నో దుస్సంఘటనలు నిత్యం మనం దిన పత్రికల్లో చూస్తూనే ఉన్నాం.

1970 వరకు సారా వ్యాపారాన్ని ఒక సామాజిక నేరమనుకునే వారు. అవినీతిగా పరిగణించేవారు. దొంగ వ్యాపారులు, నేరస్తులు, సంఘ వ్యతిరేక శక్తులు మాత్రమే దీనిలో ఉంటారనుకునేవారు. కాని 1970 తర్వాత రాజకీయవేత్తలు సారావ్యాపారులుగా, సారా వ్యాపారులు రాజకీయవేత్తలుగా అవతారమెత్తారు. సారాయి వ్యాపారం, తాగుడు వ్యసనం పర్యవసానాలు రెండురకాలుగా ఉంటాయి. ఒకటి సామాజికం, రెండు రాజకీయ పరమైనవి. మొదటి విషయానికొస్తే, తాగే మగవాడే కుటుంబ సంపాదనలో అధిక భాగం తాగుడుకు వ్యయం చేస్తాడు. కుటుంబ ఆదాయం తరిగిపోవడమే గాక కుటుంబ హింస కూడా పెరుగుతుంది. ఇంట్లో ఉండే ఆకలి, పస్తుల సమస్య, పిల్లల ఆరోగ్యం, చదువు సమస్యలు పెరుగుతాయి. ముఖ్యంగా పిల్లల భవిష్యత్తు బాగు చేయలేనంతగా పాడవుతోంది. పసితనంలోనే ఆటపాటలకు, పలక బలపానికి దూరమై ఎంతో మంది బాల కార్మికులుగా, బాల నేరస్తులుగా మారుతున్నారు. రెండవ విషయానికొస్తే సారాయి కాంట్రాక్టర్లు, రాజకీయ వేత్తల విడదీయరాని బంధం వలన గూండా రాజకీయం, సామాజిక అభద్రత పెరిగి ప్రజాస్వామిక రాజకీయాలు మృగ్యమై ప్రజలకు మెరుగైన బతుకుకు రాజకీయ పరిష్కారం దొరుకుతుందన్న ఆశలు సన్నగిల్లి పోయాయి. ఇక ఎన్నికలను కండబలం, ధనబలంతో పాటు సారా బలం కూడా ప్రభావితం చేస్తోంది.

1970లో కాసు బ్రహ్మానంద రెడ్డి ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు నూతన అబ్కారీ విధానాన్ని అమలులోకి తేవడం ద్వారా మద్య నిషేధానికి తూట్లు పొడిచాడు. నాటి నుండి నేటివరకు చూస్తే రాష్ట్రంలో మద్యం వాడకం పెరిగింది. మద్యం ధరలు పెరుగుతున్నాయి. మద్యం ధరల నిర్ణయం, పన్నులు, రెంటల్లు ప్రభుత్వ లెక్కల ప్రకారమే చూసినా వేల కోట్ల రూపాయల నిరుపేదల సొమ్మును ఎలా పిండుకుతింటున్నారో తెలుస్తుంది. సంక్షేమ కార్యక్రమాలకు వెచ్చించే దానికన్నా ఎక్కువగా మద్యం అమ్మకాల ద్వారా దోపిడి జరుగుతోంది. మద్యనిషేధాన్ని అమలు జరుపాలని మొదటగా సింగరేణి కార్మికులు 1990లో ఉద్యమించారు. ఆ తర్వాత 1992లో నెల్లూరు జిల్లా దూబగుంటలో మహిళలు సారాయి విక్రయానికి వ్యతిరేకంగా ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ ఉద్యమాన్ని విప్లవోద్యమం, మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు రాష్ట్ర వ్యాప్తంగా విస్తరింపజేశాయి. ఉద్యమాన్ని పోలీసు జోక్యంతో అణచివేయడానికి ప్రయత్నాలు జరిగాయి. పైగా పోలీస్ స్టేషన్లలోనే సారాయిని అమ్మే స్థాయికి కూడా ప్రభుత్వం దిగజారడం జరిగింది. ప్రభుత్వ నిర్బంధా లేమున్నా విస్తృత స్థాయిలో సారాయి అమ్మకాల మీద ప్రజా నిషేధం కొనసాగింది.

ఇదే సందర్భంలో రాష్ట్రంలో 1994 అసెంబ్లీ ఎన్నికలొచ్చాయి. ఎన్.టి.ఆర్. మద్యపాన నిషేధం, రెండు రూపాయల కిలో బియ్యం తన రాజకీయ ఎజెండాలో చేర్చి ఎన్నికల బరిలో దిగాడు. మహిళలు తెలుగుదేశం పార్టీకి బ్రహ్మరథం పట్టారు. తాను ముఖ్యమంత్రిగా అధికారంలోకి రావడంతోనే 1994లో మద్యపాన నిషేధానికి ఉత్తర్వు లిచ్చాడు. ఈ నిర్ణయంతో అక్రమ సంపాదనపరులకు పెద్దదెబ్బే తగిలింది. ఈ పరిస్థితే తెలుగుదేశం పార్టీ అంతర్గత సంక్షోభానికి దారితీసి ఎన్.టి.ఆర్.ను పదవీచ్యుతున్ని చేయడానికి కారణమయ్యింది. నారా చంద్రబాబునాయుడు వైస్రాయి హోటల్ కుట్ర ద్వారా ఎన్.టి.ఆర్.ను ముఖ్యమంత్రి పదవి నుండి కూలదోసి ముఖ్యమంత్రి పదవి చేపట్టిన వెంటనే మద్యపాన నిషేధాన్ని రద్దుచేశాడు. 1995-96 నుండి 2001-2002 మధ్యకాలంలో ఎక్సైజ్ రెవెన్యూ రు. 78 కోట్ల నుండి రు.1651 కోట్లకు పెరిగింది. 2003-2004 లో ఇది రు.2188 కోట్లకు చేరింది. చంద్రబాబు, ఆ తర్వాత 2004లో ముఖ్యమంత్రి పదవిలోకి వచ్చిన వై.ఎస్.రాజశేఖరరెడ్డి మద్యం అమ్మకాలను ప్రభుత్వానికి ఆదాయ వనరుగా భావించారు. వారిద్దరికీ మద్యనిషేధం పట్ల ఆసక్తి లేకపోవడం లో ఆశ్చర్యమేమీలేదు. మద్యం వ్యాపారాన్ని పెంచుతూ, అర్ధరాత్రి బార్లు తెరిచి, రకరకాల వికృతమైన వినోదాలకు లైసెన్స్‌లిచ్చి పల్లెల్లో పేదలను, పట్టణాల్లో యువతను బలహీనులుగా చేయడం 1990వ దశకం నుండి బాగా పెరిగింది.

వ్యక్తిగత స్వేచ్ఛా వాదం బలం పుంజుకున్న రోజులవి. ప్రతి ఒక్కరికి తమ జీవితాలను తమకు నచ్చిన రీతిలో గడిపే హక్కు ఉంది. ఏ వ్యక్తి ప్రవర్తన అయినా అతని అలవాట్లపై చాలా వరకు ఆధారపడి ఉంటుంది. అలాగే వ్యక్తి జీవితంలో ముఖ్యపాత్ర వహించేవి అలవాట్లు, వాటిని అందుకోగలిగే అవకాశాలు మాత్రమేనన్నది కూడా యదార్థమే. క్రికెట్ చూడడం, జూదం ఆడడం, మద్యం సేవించడం, పొగతాగడం, గుర్రప్పందాలు లాంటివి స్వేచ్ఛకు ప్రతీకలుగా భావించబడుతున్నాయి. అయితే మద్యం గురించి మాత్రమే ఇంత రభస ఎందుకు? ఇంత అసహనమెందుకు? ఇన్ని ఉద్యమాలెందుకు? ఈ ఉద్యమాలలో మహిళలు క్రియాశీలపాత్ర పోషించడం ఎందుకు జరుగుతోంది, అంటే, ఇంట్లో మగవాడు తాగుడుకు బానిసైతే ఆ కుటుంబమంతా పునాదులతో సహా ఛిద్రమవుతుంది. కాబట్టే మద్యపాన నిషేధం గురించి మొదటగా మహిళలు గళమెత్తారు. అందుకే మద్యపానం అనగానే సామాజిక, జెండర్ అవగాహనతో మాట్లాడవలసివస్తుంది. ఎవరి లాభాల కోసం, వ్యాపార ప్రయోజనాల కోసం ఎవరి జీవితాలను ఎవరి భవిష్యత్తును పణంగా పెడుతున్నారన్నది మన ముందున్న ప్రశ్న.

గత సంవత్సరం సెప్టెంబర్‌లో వై.ఎస్. రాజశేఖరరెడ్డి మరణానంతరం ముఖ్యమంత్రి పదవి చేపట్టిన కె. రోశయ్య మద్య నిషేధాన్ని తీసుకురాలేకపోయినా మద్యం విక్రయాలను, వినియోగాన్ని నియంత్రిస్తాడని ప్రజలు ఆశించారు. ఎందుకంటే మద్యపానాన్ని నిరుత్సాహపరుస్తానని కాంగ్రెస్ పార్టీ 2009 ఎన్నికల ప్రణాళికలో పేర్కొంది. కానీ, రోశయ్య అధికారంలోకి వచ్చాక మద్యపానాన్ని ఇంకా పెంచే విధంగా వేగంగా పావులు కదుపుతున్నారు. కొందరు మంత్రి పుంగవులే 'ప్రజలకు ఆదాయాలు పెరిగి తాగుతున్నారు' అని మాట్లాడడం సిగ్గుచేటు. ఎక్సైజ్ రెవెన్యూను దెబ్బతీస్తే ప్రజల సంక్షేమం కోసం ఖర్చు పెట్టడానికి ప్రభుత్వం దగ్గర నిధులెక్కడుంటాయని వాదించే దాకా మంత్రులు, పార్టీ నాయకులు పోతున్నారంటే ఈ సిగ్గుమాలినతనం ఎంత పెరిగిందో అర్థం అవుతుంది. పేదవాళ్ల చేతనే తాగించి, మద్యం ద్వారా ప్రభుత్వానికొచ్చే ఆదాయాన్ని వారి మేలుకోసమే ఖర్చు పెడతామనడం ఏ రకమైన తర్కం?

ప్రజల ఆర్థిక, ఆరోగ్య పరిస్థితుల కంటే కూడా ప్రభుత్వ ఆదాయాన్ని పెంచుకోవడం, తమ సారా సామ్రాజ్యాన్ని స్థిరపరచు కోవడమే ప్రధానంగా కనిపిస్తుంది. సారా వ్యాపారం ద్వారా సమకూరిన అక్రమ సంపాదన రాజకీయాలను ప్రభావితం చేస్తోంది. నిజానికి ప్రభుత్వ

వనరుల సమీకరణకు ఎన్నో మార్గాలున్నాయి. ప్రభుత్వ కనుసన్నల్లో మెలిగే బడాబాబులు స్విస్ బ్యాంక్‌లో 70 లక్షల కోట్ల రూపాయలు దాచుకున్నారు. భారత ఆర్థిక వ్యవస్థలో సగ భాగం (25 లక్షల కోట్లు) నల్ల ధనమేనన్నది అందరికీ తెలుసు. ప్రత్యక్ష పన్నులు చెల్లించకుండా తప్పించుకు తిరిగే మహానుభావులెందరో ఉన్నారు. ప్రభుత్వ నిర్వహణ వ్యయాన్ని పొదుపుగా వాడుకోవచ్చు. మన రాష్ట్రపతి ప్రతిభాపాటిల్ నివాసమైన రాష్ట్రపతి భవన్ కరెంట్ ఖర్చు సంవత్సరానికి ఆరుకోట్ల అరవై లక్షల రూపాయలు. దారుణమైన పేదరికం, నిరక్షరాస్యత, నిరుద్యోగం వంటి సమస్యలతో సతమతమవుతున్న మన దేశానికి ఇంతటి దారుణమైన దుబారా అవసరమా? కామన్‌వెల్త్ క్రీడల నిర్వహణకు రు. 35 వేల కోట్లు ఖర్చు చేయడం వృథా కాదా? ఎవరి దగ్గర ఎంత సంపద ఉందో అన్న గణాంకాలు ప్రభుత్వం ఎందుకు సేకరించదు? ఎందుకు ప్రకటించదు? ఆ పనిచేస్తే సంపద ఎక్కడ పోగవుతోందో, దాని నుండి ప్రభుత్వ రెవెన్యూకు రావలసిన ఆదాయంలో ఎంత భాగం రాకుండా పోతుందో ప్రజలకు తెలిసే అవకాశం ఉంటుంది.

రాష్ట్రంలో మద్యం అమ్మకాలు, షాపుల లైసెన్సుల విధానం అడ్డదిడ్డంగా ఉండడంతోనే అక్రమ వ్యాపారం యథేచ్ఛగా సాగుతోందని, అలాంటి అక్రమాలకు అడ్డుకట్ట వేసి ఒక క్రమ పద్ధతిలో ఎక్సైజ్ కార్యకలాపాలు కొనసాగే విధంగా చేసేందుకే ఒక నిర్దిష్టమైన మార్గదర్శకాలతో పటిష్టమైన విధానాన్ని ప్రవేశ పెట్టామని ముఖ్యమంత్రి రోశయ్య చెప్పడం విడ్డూరంగా ఉంది. ఈ నూతన విధానంతో అక్రమ మద్యం వ్యాపారాన్ని నియంత్రించడానికి, ప్రభుత్వ ఖజానాకు రావలసిన ఆదాయం పక్కదారి పట్టకుండా ఉంటుందన్న సదాశయంతోనే 723 ఉత్తర్వులిచ్చామని ఆయన పేర్కొనడంలో ప్రజా సంక్షేమం ఇసుమంతైనా లేదన్నది సుస్పష్టం.

ఇప్పుడు నిత్యకళ్యాణం, పచ్చతోరణంలా వెలిగిపోతున్న లాభసాటి వ్యాపారం ఏదైనా ఉన్నదీ అంటే అది మద్యం వ్యాపారం అనడం అతిశయోక్తి కాదు. ప్రభుత్వానికి ఆదాయం పెరగాలి. వ్యాపారులకు లాభాలు రావాలి. అధికారులకు ముడుపులు కావాలి. అందుకే వేలం పాటలో పోటీ పెరిగేలా చేసింది. మద్యం దుకాణాలకు ప్రారంభ ధరను గతం కంటే 15 శాతం పెంచింది. మద్యశాలల – దుకాణాల లైసెన్స్ ఫీజులు పెంచింది. చౌక ధరలకు లభించే మద్యం రకాలను దుకాణాల నుండి తొలగించాలని ఆలోచిస్తున్నట్లు వార్తలు వచ్చాయి. పేదలు సేవించే మద్యం ఉత్పత్తి పెంచేందుకు డిస్టిలరీలకు ఉదారంగా అనుమతులిచ్చింది. మద్యం అమ్మకాలు పెంచేందుకు అధికారులపై ఒత్తిడి పెంచుతున్నట్లు కూడా వార్తలొస్తున్నాయి. ప్రభుత్వం తన ఆదాయం పెంచుకోవడానికి ప్రయత్నిస్తున్నట్లే మద్యం దుకాణదారులు కూడా అనేక అక్రమ పద్ధతుల్లో తమ లాభాలు పెంచుకునే ప్రయత్నాలు చేస్తున్నారు. గత కొన్ని సంవత్సరాలుగా బెల్టు షాపులు తామర తంపరగా ప్రభుత్వ కనుసన్నల్లోనే పెరుగుతున్నాయి. రాష్ట్ర వ్యాప్తంగా నేడున్న మద్యశాలల సంఖ్య 1,454 కాగా, మద్యం దుకాణాల సంఖ్య 6,596. ఇక బెల్టు షాపులు లక్షన్నర పైగానే ఉంటాయని అంచనా. ఈ మొత్తం ఎక్సైజ్ విధానం ద్వారా ప్రజల ఆరోగ్యాలు క్షీణించినా, అప్పుల పాలైనా, కష్టాలకు గురైనా ప్రభుత్వానికి మద్యం కాంట్రాక్టర్లకు, ఎక్సైజ్ అధికారులకు ఆదాయం మాత్రం పెరుగుతుంది.

జనాన్ని మద్యం మత్తులో ముంచి తేల్చడమే పరమావధిగా పెట్టుకున్న రాష్ట్ర సర్కార్ జూలై రెండున జారీ చేసిన 723 జి.ఒ.తో మరింతగా బరి తెగించింది. విద్య, వైద్యం, బ్యాంకింగ్, పోస్టల్ తదితర సేవా రంగాల్లో జనాభా ప్రాతిపదికగా ఇంతమందికి ఇన్ని ఉండాలి అనే నిబంధనలు, విధి విధానాలున్నా, అవి పాటించని మన రాష్ట్ర ప్రభుత్వం, జనాభా ప్రాతిపదికగా 12 వేలమందికి ఒక బారు, 16 వేలమందికి ఒక వైన్ షాపు ఏర్పాటుకు లైసెన్స్‌లు ఇస్తామని ప్రకటించడం సిగ్గుమాలిన చర్య. ఐదు దశాబ్దాల క్రితం డా. కొఠారీ కమిషన్ సూచించిన ఉమ్మడి పాఠశాల విధానాన్ని అమలు చేయక విద్యను ప్రైవేటీకరించడం చూస్తున్నాం. ప్రతి 30 మందికి ఒక తరగతి గది ఉండాలి, కాని 200 మందికి ఒకటి ఉంది. 30 వేల మంది జనాభాకు ఒక ప్రాథమిక ఆరోగ్య కేంద్రం (పి.హెచ్.సి) ఉండాలన్నది నిబంధన కాగా, మన రాష్ట్రంలో సగటున 50 వేల మందికి ఒక్కో ప్రాథమిక ఆరోగ్య కేంద్రం ఉంది. ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లోనూ డాక్టర్ల ఖాళీలు భర్తీ చేయడం లేదు. ప్రతి 500 మందికి ఒక డాక్టరు ఉండాలి. కాని గ్రామాల్లో 10 వేల మందికి ఒక డాక్టరు కూడా లేడు. ఊరికో బారు, వీధికో లిక్కర్ షాప్‌తో శక్తి వంచన లేకుండా మద్యాన్ని అందుబాటులోకి తెస్తున్న ప్రభుత్వం, ప్రజలంతా తాగేనీటిని కూడా ఉచితంగా సరఫరా చేయలేకపోవడం శోచనీయం. పైగా తాగే నీటిపై కూడా పన్ను విధిస్తూ ఉత్తర్వులు జారీ చేయడం విడ్డూరంగా ఉంది. ప్రజల విద్య, వైద్య సౌకర్యాలకు సంబంధించిన విషయాలలో ప్రభుత్వానికి ఉలుకు పలుకు లేదు. కానీ బార్లు, వైన్ షాపులు తెరవడానికి ప్రభుత్వం తెగ వెంపర్లాడడం సిగ్గుచేటు. ఖజానాను అడ్డదారిన, దొడ్డి దారిన నింపుతున్న సర్కార్ ఆ నిధులతో ప్రజా సంక్షేమం చేపడతానని పైకి ఎన్ని మాటలు చెప్పినా వాస్తవంలో సంక్షేమానికి తిలోదకాలిస్తోంది. ఇప్పటికే రేషన్ కార్డుల కోత, ఫించన్ల కత్తిరింపు, ఫీజు రీయింబర్స్‌మెంట్‌కు ఎగనామం లాంటి ప్రజాకంటక చర్యలకు పాల్పడింది.

ఈ ఆర్థిక సంవత్సరంలో మద్యం అమ్మకాల ద్వారా వ్యాట్‌ను మినహాయించి ఎక్సైజ్ ఆదాయంగానే రు. 7600 కోట్లు పొందాలని బడ్జెట్‌లో అంచనా వేశారు. ఇప్పటి జి.ఒ. పూర్తిస్థాయిలో అమల్లోకి వస్తే మరో రెండు వేల కోట్ల రూపాయలకు పైగా ప్రభుత్వానికి 'ఆదాయం' వస్తుంది. రాష్ట్రంలో ఇప్పటికే 1,400 పైగా బార్లుండగా ఈ జి.ఒ.తో మరో 600 బార్లు కొత్తగా రావొచ్చు. జనాభా ప్రాతిపదికన బార్లను మంజూరు చేయాలని, రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం వల్ల రాజధాని హైదరాబాద్‌లోనే 450 వరకు మద్యశాలలు అదనంగా పెరుగుతాయని అంచనా. విశాఖపట్టణంలో 167, గుంటూరులో 80 మద్యశాలలు అదనంగా ఏర్పాటు కావచ్చు. ఈ విధంగా పట్టణ ప్రాంతాల్లో వీటి సంఖ్య పెరిగిపోతుంది. రాష్ట్ర ప్రభుత్వ కొత్త విధానం ప్రకారం – మూడు లక్షలమంది జనాభా ఉన్నచోట 30 వేలమందికి ఒక మద్యశాల ఉంటుంది. ఆ పైన 7 లక్షల జనాభా వరకు 20 వేల మందికి ఒకటి, ఆ తరువాత 7 లక్షల పైన జనాభా ఉన్న నగరాలలో 12 వేల మందికి ఒకటి వంతున మద్యశాలలకు అనుమతి ఇవ్వాలనేది రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయం. ప్రభుత్వం మహిళలను, పిల్లలను కూడా లెక్కించింది. సాధారణంగా మద్యం సేవించే తరగతినే లెక్కిస్తే 3,600 మందికి ఒక మద్యశాల ఉంటోందని తెలుస్తోంది. జనాభా ప్రాతిపదికలతో నిమిత్తం లేకుండా ఏదైనా మూడు నక్షత్రాల హోటల్‌లో బార్ పెడతామని దరఖాస్తు చేస్తే ఎలాంటి షరతులు లేకుండా లైసెన్స్ మంజూరు చేస్తామంది. ఒక అధ్యయనం ప్రకారం 1980లో మద్య సేవనను ప్రారంభించే వారి సగటు వయస్సు 28 సంవత్సరాలు కాగా 2010 నాటికి అది

***మద్యానికి అలవాటు పడ్డవారు ఎనభై శాతం ఆదాయం దీనిపైనే ఖర్చు పెడుతున్నారనీ, కుటుంబ భారాన్నీ, హింసనూ మహిళలూ, పసిపిల్లలూ మోస్తున్నారనీ అంటున్నారు* వి. సంధ్య**

# ప్రజలపై మద్యాన్ని రుద్దుతున్న ప్రభుత్వం

మనిషి మద్యాన్ని తాగితే, ఆ తర్వాత అది మనిషిని తాగుతుంది. మింగుతుంది. ఇల్లూ, ఒల్లూ గుల్ల చేస్తుంది. విచక్షహీనుణ్ని చేస్తుంది. బానిసగా మారుస్తుంది. మద్యం మగవాడు తాగితే మైకం అతడిది. దుఃఖం స్త్రీది. పిల్లలది. ఆ మత్తులో జరిగే విధ్వంసం అంతా, ఇంతా కాదు. కుటుంబానికే కాదు సమాజానికి కూడా.

ఇవాళ రాష్ట్ర ప్రభుత్వం మత్తును మృత్యువుగా, ఆర్థిక వనరుగా, సామాజిక, కుటుంబ హింసకు సాధనంగా, చైతన్యం నీరు కార్చడానికి ప్రజల ముంగిట జల్లుతోంది. రాజకీయ, ఆర్థిక ప్రయోజనాలకి వారధిగా వాడుకుంటోంది. దీనికి రాష్ట్ర మద్య నిషేధ అమలు శాఖ (ఆబ్కారీ శాఖ) రాష్ట్ర టూరిజం బోర్డు (పర్యాటక శాఖ)లను ఆయుధాలుగా వాడుకుంటోంది. ప్రజల బలహీనితను సొమ్ము చేసుకుంటే తప్ప ఖజానాకు దిక్కు లేదనట్లుగా వ్యవహరించే ప్రభుత్వం మద్యాన్ని బలవంతంగా రుద్దడానికి సిద్ధమయింది. అందులో భాగంగానే జి.ఒ. 723, 734, 735లతో మద్యం వరదకు గేట్లెత్తింది. పల్లె, పట్నం, నగరం, గుడి, బడి తేడా లేకుండా మద్యం మత్తులో ముంచి, కుటుంబాలను కూల్చి ఖజానా నింపుకునేందుకు ప్రణాళికను రూపొందించింది. అందుకే జనాభా ప్రాతిపదికన బార్ల ఏర్పాటుకు కొత్త మార్గదర్శకాలు తయారు చేసింది. జి.ఒ. 723 ద్వారా మున్సిపాలిటీ పరిధిలో మూడు లక్షల జనాభా ఉన్న చోట ప్రతి ముప్ఫై వేల మందికి, మూడు నుండి ఏడు లక్షల జనాభాకు ప్రతి ఇరవై వేల మందికి, ఏడు లక్షల పైగా జనాభా ఉన్న చోట ప్రతి పన్నెండు వేల మందికి ఒక బారు ఏర్పాటు చేయాలని మార్గదర్శకాలను తీసుకువచ్చింది. ఈ జి.ఒ.పై పెద్ద ఎత్తున నిరసనలు రాగా, అదే రోజు రాత్రి జి.ఒ. గ్రేటర్ హైదరాబాద్‌కి మాత్రమే వర్తిస్తుందనీ, మిగతా చోట్ల తగినన్ని బార్లు ఇప్పుడే ఉన్నాయని బుకాయించింది. 2003-04తో పోలిస్తే ప్రస్తుతం బార్లు, దుకాణాల సంఖ్య తక్కువగానే ఉందని ప్రభుత్వం వాపోయింది. ఎన్ని వేల కోట్ల అమ్మకాలు పెంచేసారో మరిచి పోయినట్లుంది. బార్ల కోసం రెండేళ్లుగా 701 లైసెన్సులు పెండింగ్‌లో ఉన్నట్లు, వాటి పరిశీలనకు ప్రాతిపదిక అంటూ ఉండాలి, కాబట్టి జనాభా

20 సంవత్సరాలకు తగ్గింది. ఇప్పటికే రాష్ట్రంలో మద్యం సంబంధిత నేరాలు, అసాంఘిక కార్యకలాపాలు పెరిగాయి. ఇప్పుడు మరింత విశృంఖలం అవుతోంది.

ప్రతిపక్ష పార్టీలు, మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు ప్రభుత్వ వైఖరిని తూర్పారబట్టాయి. ప్రజాగ్రహం ముంచెత్తడంతో 723 జి.ఒ.కు సవరణ 734 నెంబర్‌తో మరో జి.ఒ. జారీచేశారు. మౌలికంగా విధానపరమైన ఎలాంటి సవరణలూ ఇందులో లేవు. పైపెచ్చు జనాభా ప్రాతిపదికన కంటే ఇప్పటికే అదనంగా ఎక్కడైనా బార్లు, వైన్ షాపులుంటే వాటిని తగ్గించబోమని భరోసా ఇచ్చారు. ఇక 1970లో మద్యం అమ్మకాల ద్వారా ప్రభుత్వానికి రు. 100 కోట్ల ఆదాయం సమకూరగా, ప్రస్తుత సంవత్సరంలో రు. 17 వేల కోట్ల వరకు సమకూరనుంది. జూన్‌లో జరిగిన మద్యం షాపుల వేలంలో నడికుడిలో ఒక షాపు ఏకంగా 5 కోట్ల 21 లక్షల రూపాయలకు టెండర్ పడింది. రాష్ట్రంలో ఈ రెండేళ్లకు టెండర్ల ద్వారా రు. 3,680 కోట్లు ఆదాయం వస్తుందని అంచనాలేస్తే అది దాదాపు రెట్టింపుగా రు. 6,918 కోట్లు లభించింది. రాష్ట్ర మంత్రులతో సహా అనేకమంది పాలక పార్టీ నాయకులూ, వారి కుటుంబ సభ్యులు ప్రత్యక్షంగా, పరోక్షంగా మద్యం టెండర్లు, బార్ల లైసెన్సులు పొందడంలో అగ్ర భాగాన ఉన్నారు. మద్యం అమ్మకాల్లో రాజకీయంగా పలుకుబడి కలవారు కీలకపాత్ర వహిస్తూ 'మాఫియా'గా మారి నేరసామ్రాజ్యాన్ని ప్రోత్సహిస్తున్నారు. ఇటీవల జరిగిన మద్యంవేలం కేంద్రాలలో 53 మంది శాసన సభ్యులు, కొందరు మంత్రులు ప్రత్యక్షంగా పాల్గొన్నారు. అందువల్ల మన రాష్ట్రానికి ఈ దౌర్భాగ్యం పడుతోంది.

పేద, బలహీన వర్గాల ప్రజలను మద్యం బానిసలు కాకుండా కాపాడగలిగితే వారి ఉత్పాదక శక్తి పెరగడంతో పాటు ప్రజల జీవితాలు మెరుగుపడే అవకాశముంటుంది. రాష్ట్ర మద్య నియంత్రణ ఉద్యమ కమిటీ రాష్ట్ర గవర్నర్‌ను కలిసి ఆంధ్రప్రదేశ్‌ను మద్యం విషాదం నుంచి కాపాడి, ప్రజల ఆరోగ్యాన్ని, జీవితాలను రక్షించాలని డిమాండ్ చేసింది. మద్యం వ్యాపారాన్ని నైతిక విషయంగానైనా, ప్రజా సంక్షేమానికి సంబంధించిన విషయంగానైనా సరే, వెంటనే మద్య నిషేధాన్ని అమలు చేయాలి. ప్రజల ఆరోగ్యాలను కాపాడడంలో, వాళ్ల జీవితాలను వీలైనంత వరకు మెరుగుపరచడంలోనే ప్రజా సంక్షేమం ఉంటుంది. ఏ ప్రజాస్వామ్య ప్రభుత్వానికైనా అది ప్రధాన బాధ్యత కావాలి. అపమార్గం పడుతున్న రాష్ట్ర సర్కారును ప్రజాసంక్షేమ మార్గం పట్టించడానికి ఉద్యమాలు, ఆందోళనలే శరణ్యం. అందుకోసం సామాజిక బాధ్యత కలవారంతా నడుం బిగించడం అవసరం. ప్రజల జీవనాన్ని ఛిద్రం చేస్తూ తాకట్టు పెడుతున్న ప్రభుత్వ విధానాలను ఎండగట్టాల్సి ఉంది. పాలకుల దోపిడీ రూపాన్ని, సారాన్ని ప్రజలకు వివరించాల్సి ఉంది. అందుకు నిరంతరం దోపిడీ వ్యవస్థకు వ్యతిరేకంగా, సంపూర్ణ మద్య నిషేధం కోసం ఉద్యమించడం, అలా ఉద్యమిస్తున్న వారికి సంఘీభావాన్ని తెలుపుతూ ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవడం ప్రజాస్వామిక వాదుల, అభ్యుదయ వాదుల కనీస కర్తవ్యం.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

ప్రాతిపదికన మార్గదర్శక సూత్రాలు వెల్లడించింది. అంటే, పెండింగులో ఉన్న దరఖాస్తుల కోసమే ఈ జి.ఒ. అన్నది స్పష్టం. మహిళా సంఘాల ఆందోళన తర్వాత జి.ఒ. ను సవరిస్తూ జి.ఒ. 734, 735లకు సవరణలు తెచ్చారు తప్ప, రద్దు చేయలేదు. ప్రస్తుతం వైన్ షాపులను కూడా బార్లుగా మారుస్తున్నారు.

అంచెలంచెలుగా మద్య నిషేధాన్ని, బెల్టు షాపుల రద్దుకు హామీ ఇచ్చి అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం మద్యం షాపులను, బెల్టు షాపులను పెంచేసింది. టార్గెట్లు పెట్టి మరీ మద్యాన్ని రుద్దుతోంది. మద్య నియంత్రణ ఆ శాఖ పేరులో తప్ప మరెక్కడా లేదు. ప్రజలకు కనీస అవసరాలను తీర్చలేని ప్రభుత్వం, సాగునీరు, తాగునీరు అందించడం చేతకాని ప్రభుత్వం మద్యం అమ్మకాలు మాత్రం విచ్చల విడిగా సాగిస్తోంది. అందుకే మద్యం టెండర్లకు ఎన్నడూ లేనంతగా కోట్ల రూపాయల వేలం పాడి షాపులను చేజిక్కించుకుంటున్నారు వ్యాపారులు.

రోశయ్య సర్కారు 2010-12 ద్వై వార్షిక టెండర్ల ద్వారా 15 శాతం అదనపు అమ్మకాలను ఆశించి, జూన్ 7న టెండర్లకు పిలిచింది. ప్రభుత్వమే బిత్తరపోయేలా 'మద్యం సిండికెట్లు' టెండర్లు వేశారు. కేవలం టెండర్ల ద్వారానే రు. 8,000 కోట్ల ఆదాయం సమకూర్చుకుంది ప్రభుత్వం. 2003-04లో రు. 3,572 కోట్లు మద్యం అమ్మకాలు ఉండగా 2010 నాటికి 25 వేల కోట్ల రూపాయలకు పెంచేసింది. అన్ని శాఖల్లో ఆదాయం తగ్గినా ఒక్క ఆబ్కారీ ఆదాయమే నానాటికీ పెరిగిపోతోంది. అంచెలంచెలుగా పెంచుకుంటున్న మద్యం ఆదాయం వలన దేశంకెల్లా అత్యధిక తాగుబోతులు గల రాష్ట్రంగా, మహిళలపై హింస, ఇతర నేరాలు పెరుగుతున్న రాష్ట్రంగా దిగజారింది.

రాష్ట్రంలో మంచినీళ్లు దొరకని ప్రాంతాలున్నాయి. బడులు, ఆసుపత్రులు అందుబాటులో లేని గ్రామాలు, బస్తీలున్నాయి. కానీ, మద్యం దొరకని ప్రాంతం అంటూ లేదు. ఇప్పటికే 1,454 బార్లు ఉన్నాయి. ప్రభుత్వం తాజా నిర్ణయం ద్వారా రాష్ట్ర రాజధానిలో 450, విశాఖలో 167, గుంటూరులో 80, విజయవాడలో 154, వరంగల్‌లో 85 అదనంగా పెరుగుతాయి. మొత్తంగా పట్టణ ప్రాంతంలో వీటి సంఖ్య పెరగనున్నది. వైద్యం, విద్య జనాభా ప్రాతిపదికన ప్రజలకు అందుబాటులో ఉంచాల్సిన ప్రభుత్వం, మద్యాన్ని మాత్రమే సులువుగా అందుబాటులో ఉంచుతానంటోంది.

అభివృద్ధి పేరిట విధ్వంసం అవుతున్న కుటుంబాలకు ప్రస్తుత మద్యం పాలసీతో మరింత గడ్డుకాలం రాబోతోంది. తమది సంక్షేమ ప్రభుత్వం అని చెప్పి అధికారంలోకి వచ్చి పచ్చి ద్రోహం చేస్తోంది కాంగ్రెస్ ప్రభుత్వం.

మద్యం వేలం పాటల్లో పోటీలు పడి, దౌర్జన్యంతో సిండికేట్లుగా వ్యవహరించి కోట్లతో టెండర్లు చేజిక్కించుకున్న వ్యాపారులు ఎక్కువగా రాజకీయ నాయకులే. రియల్ ఎస్టేట్ పడిపోయిన కారణంగా వీరంతా మద్యం వ్యాపారంపై దృష్టి సారించారు. ఒకప్పుడు రాజకీయ నాయకులకి ఆర్థికంగా, హార్దికంగా తమ కిరాయి సైన్యంతో ఉపయోగపడిన లిక్కర్ మాఫియా, సిండికేట్లు ఇప్పుడు మళ్లీ ప్రత్యక్ష రాజకీయాల్లోకి వచ్చాయి. వీరంతా మద్యం వ్యాపారంపై దృష్టి పెట్టడంతో పోటీ పెరిగింది. వేలం కోట్లకు పెరిగిపోయింది. ఒక్క షాపుకు అయిదు కోట్ల రూపాయల వరకు వేలం పాడారంటే ప్రభుత్వం సహకారం ఎంతగా ఉంటుందో ఊహించుకోవచ్చు. 'ఉపాధి హామీ పథకం'లో కల్పించిన పనిదినాల గ్యారంటీ, చెల్లిస్తున్న వేతనాలు అన్నీ కొల్లగొడుతూ పేదల పాలిట బందిపోటులా వ్యవహరిస్తోంది ప్రభుత్వం. ఉపాధి పనులు జరిగే చోట్ల, శ్రామికులు ఎక్కువగా జీవించే దగ్గర బెల్టుషాపులు పెట్టడానికి అధికారికం గానే అనుమతులు ఇస్తున్నారు. బెల్టు షాపులా? అవెక్కడ ఉన్నాయి? అని అహంకారంగా ప్రశ్నించిన రాజశేఖరరెడ్డి హయాంలో అనధికారికంగా ఉన్న బెల్టు షాపులకు రోశయ్య హయంలో వేలం కూడా వేశారు.

సంక్షేమ పథకాలన్నింటికీ కలిపి రు. 15,000 కోట్లు వెచ్చిస్తూ మద్యం ఆదాయం ద్వారా మాత్రం రు. 25,000 కోట్లు సంపాదించు కోడానికి సిద్ధమయ్యారు. అంటే ప్రజల రక్తాన్ని మద్యంగా మార్చి, వారి జీవితాలను ధ్వంసం చేసి వాటి నుంచే సంక్షేమం చేస్తానంటోంది ప్రభుత్వం. ఇందులో అందరికీ భాగం ఉంది అన్నట్లుగా, మద్యం వ్యాపారంతో సంబంధం లేకుండా తమకి మనుగడే లేదన్నట్లుగా తయారయ్యాయి రాజకీయ పార్టీలు. ఈ సంవత్సరం 6,596 మద్యం షాపులకు టెండర్లు వేయగా, వాటిలో కాంగ్రెస్‌కి 1,179, తెలుగుదేశం పార్టీకి 605, ప్రజారాజ్యం పార్టీకి 227 దక్కాయి. మిగతావి వీరి సహకారంతో నడుస్తున్న మద్యం వ్యాపారులవి. అన్ని నియమ నిబంధనలకు, విలువలకు తిలోదకాలిచ్చి అమ్మకాలు పెంచడానికి వీరు ప్రభుత్వంపై చాలా ఒత్తిడి తెస్తున్నారు. కనిష్ట ధరలు పాటించకుండా, లక్షన్నరకు పైగా బెల్టు షాపులతో ఇష్టారాజ్యంగా వ్యవహరించినా కిమ్మనకుండా ఉండాలని ఆబ్కారీ శాఖకు ఆదేశించింది ప్రభుత్వం.

రాష్ట్రాన్ని మద్యపాన కేంద్రం, వ్యభిచార కేంద్రంగా మార్చడం వల్ల టూరిజం బాగా అభివృద్ధి చెందుతుందని గత ప్రభుత్వాలు భావించాయి. అదే పాలసీని కొనసాగిస్తోంది ప్రస్తుత ప్రభుత్వం. టూరిజం ప్రమోషన్ బోర్డు ఉత్తర్వులతో ప్రతి స్టార్ హోటల్‌లో మద్యం అందుబాటులో ఉంచాలని. దానికి జనాభా ప్రాతిపదిక, రాత్రి వేళల నిబంధనలు మినహాయింపు కల్పించింది. అందుకే అర్ధరాత్రి వరకు బార్లు తెరిచి ఉంచాలని నిర్ణయించింది. బార్లు ఎక్కువవ్వడంతో వీటి మధ్య పోటీ పెరిగి బార్లలో అశ్లీల నృత్యాలు, డిస్కోథెక్, క్లబ్ డాన్సులు ఏర్పాటు చేసి అదనపు ఆకర్షణలు కల్పిస్తున్నారు. వ్యసనపరులను మరింతగా ఆకర్షించడానికి హైటెక్ వ్యభిచారాన్ని ప్రోత్సహిస్తూ యువతను పెద్ద ఎత్తున పెడదోవ పట్టించడానికి రుద్దుతున్న విష సంస్కృతి ఇక్కడ తాండవిస్తోంది. పేద యువతులను, బాలికలను ప్రలోభాలకు గురిచేసి వ్యభిచారంలోకి దించడానికి వచ్చినవే ఈ బార్లు. పేద కుటుంబాల్లో తిండి గడవక, పిల్లల ఆకలి తీర్చడానికి కొందరు, వినియోగదారీ సంస్కృతికి బానిసలయి విలాసాలకు అలవాటు పడి మరికొందరు ఈ సంస్కృతికి బలవుతున్నారు. వాటికి నిలయాలుగా మారిన బార్లలో అనేక అరాచక, అసాంఘిక కార్యకలాపాలు కూడా జరుగుతున్నాయి.

మొత్తంగా నేర సంస్కృతి పెరగడానికి, హీన సంస్కృతిని రుద్దడానికి దోహదపడేవే ఈ బార్లు. పెంచుతున్న మద్యం అమ్మకాలతో మహిళలకు రక్షణ, భద్రత కరువయ్యే ప్రమాదముందని, కుటుంబాలు మరింతగా ధ్వంసమవుతాయని మహిళా సంఘాలు అనేకసార్లు ఆందోళనలు నిర్వహించినా ప్రభుత్వం బుర్రకి మాత్రం ఎక్కలేదు. ఈ విధానాల వల్ల రాబడి, విరాళాలు, ముడుపులు గణనీయంగా పెరుగుతాయి. వైన్ షాపులు, బార్లతో పాటు రిసార్టులు, గెస్ట్ హౌస్‌లు, క్లబ్‌ల సంఖ్య పెరిగిన కొద్దీ టూరిజం అభివృద్ధి, రాజకీయ నాయకుల, రౌడీల, వ్యాపారుల 'ఐశ్వర్యాభివృద్ధి' జరుగుతుంది. దానికి టూరిజం పేరుతో కూడా దండుకోవడానికి పడరాని పాట్లు పడుతున్నారు.

మద్యం సమస్య మహిళలకు మాత్రమే సమస్య కాదు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక సమస్యగా గుర్తించాలి. అసలే పితృస్వామ్యం, ఆ పైన మద్యపానం. ఇక మహిళల పాట్లు ఏమని చెప్పాలి. కుటుంబాల నుండి బహిరంగ ప్రదేశాల వరకు మహిళలకు శత్రు ప్రదేశాలుగా

మారుతున్నాయి. దానికి మద్యం కూడా ఒక కారణంగా ఉంటోంది. పెరుగుతున్న ధరలు, తరుగుతున్న జీవన ప్రమాణాల వల్ల కుటుంబాల్లో పేదరికం పెరిగిపోతోంది. మహిళలు మరింతగా నలిగి పోతున్నారు. మద్యం వ్యసనంతో కుటుంబాల్నీ, పిల్లల్నీ పట్టించుకోని భర్తలతో వేధింపులకు, హింసలకు బలవుతున్నారు. అనివార్యంగా పని చేయవల్సిన స్థితిలో అసంఘటిత రంగంలో (శ్రామికులుకు) దుర్భర పరిస్థితుల్లో అభద్రతతో పనిచేస్తున్నారు. పనిచేసే చోట వేధింపులకు గురవుతూ, ఇండ్లలో వ్యసనపరులు, అనుమానపు భర్తలతో నలిగిపోతున్న స్త్రీలెందరో. వీళ్ల నేరాలకు, హింసలకు గురవుతున్న స్త్రీలను ఆదుకునే వ్యవస్థ ఏర్పాటు చేయలేని ప్రభుత్వాలు మరింతగా దిగజార్చడానికి మాత్రం మద్యాన్ని రుద్దుతున్నాయి. బిడ్డలని అమ్ముకుని, శరీరాన్ని అమ్ముకుని జీవించే స్థితికి నెడుతూ, కుటుంబ ఆదాయాన్ని కోల్పోతున్న స్త్రీల ఆర్తనాదాలు, హాహాకారాలు, ఆవేదనలు ఎన్నటికీ ఈ కరకుదేలిన ప్రభుత్వాలకి అర్థం కావు. కేవలం ఓటు బ్యాంకులుగా తప్ప మరే హక్కునీ, సాధికారితనీ, సంక్షేమాన్నీ గుర్తించని ప్రభుత్వాలు మద్యాన్ని మాత్రమే నమ్ముకుంటా యనడానికి ఛిద్రమవుతున్న కుటుంబాలతో, దిగజారుతున్న విలువలతో నిండిపోయిన ఈ రాష్ట్రం పరిస్థితి అద్దం పడుతుంది.

మద్యానికి అలవాటుపడిన వారు తమ ఆదాయంలో 80 శాతం ఇందుకోసం ఖర్చు చేస్తారు. దాదాపు 10 లక్షల కుటుంబాలు ప్రతి సంవత్సరం మద్యం వలన విచ్ఛిన్నమవుతున్నాయి. సంవత్సరానికి 2.5 కోట్ల పని దినాలని కోల్పోవలసి వస్తోంది. కుటుంబంలో పేదరికంతో పాటు హింస కూడా విపరీతంగా పెరిగిపోతోంది. మానవ సంబంధాలు ధ్వంసమవుతున్నాయి. పిల్లల చదువు, కుటుంబ ఆరోగ్యం, తదితర కనీస అవసరాలు కూడా పట్టించుకునే స్థితి లేదు. ఫలితంగా బాల కార్మికులు పెరుగుతున్నారు. ఇవికాక ఎన్నో సమస్యలు – వ్యభిచారం, నేర ప్రవృత్తి, లంచగొండితనం, అనైతికత – విపరీతంగా పెరుగుతున్నాయనీ, విలువలు దిగజారుతాయనీ సామాజిక వేత్తలు ఘంటాపథంగా చెబుతున్నారు. కుటుంబాల్లో పొదుపు గురించి ఊదరగొడుతున్న పాలకులే పొదుపు అలవాటును, కుటుంబ ఆర్థిక స్థితిని దెబ్బ తీస్తున్నారు. సంసారాలను గుల్ల చేస్తూ మహిళల పొదుపు సొమ్మును సైతం కొల్లగొడుతున్నారు.

దారిద్ర్యరేఖకు కొంచెం అటూ, ఇటూ ఉన్న వారి జీవితాలు మద్యంతో మరింత నాశనమవుతాయి. అర, కొర ఆస్తులుంటే అమ్ముకుని భార్య, బిడ్డలను తాకట్టు పెట్టుకుంటున్నారు. అసలు పేద కుటుంబాలు ఉన్నతమైన జీవితాలను స్వప్నించడమే అనవసరం, నేరం అన్నట్లుగా తయారుచేసి, రోజువారీ సంపాదనను మద్యానికి మళ్లిస్తున్నారు. దానితో ఉపాధి పనులకు వెళ్తున్న వాళ్లు, కూలీ పనులకు వెళ్తున్న వాళ్లు మందుకు సరిపడా రాగానే పని మానేస్తున్నారు. వాళ్లని చైతన్య పరచడానికి చేస్తున్న కృషి మాత్రం శూన్యం. మద్య విమోచన ప్రచార కమిటీ వేశామంటూ ఆర్భాటంగా ప్రకటించారు. వై.ఎస్.ఆర్. కమిటీ ఏర్పడినప్పటి నుండీ ఆయనకు 'బాకా' ఊదడం తప్ప, ప్రజలకు ఒరగబెట్టింది ఏమీలేదు. మద్యం వ్యసనం వీడేలా చైతన్యపరచడం తప్పనిసరి అని కేవలం చట్టంలో మాత్రమే రాసుకున్నారు. ఆ శాఖ బోర్డులో మాత్రమే తగిలించుకున్నారు. అందుకే, సంక్షేమ పథకాలు అంటూ ప్రజలని శాశ్వతంగా బిచ్చగాళ్లుగా మార్చి ఓట్లు దండుకుంటున్నారు. అసలు ప్రజలు తమ సంపాదన, సంక్షేమం నాశనం చేసుకుంటూ, ప్రభుత్వంపై ఆధారపడడం వలన ఏం ఉపయోగం ఉంటుంది? ఎంత అభివృద్ధి జరుగుతుంది?

మొత్తం సమాజాన్నే అతలాకుతలం చేస్తున్న మద్యం మహమ్మారిపై, దానికి కారణమవుతున్న ప్రభుత్వంపై అనేక కోణాల నుండి పోరాటం సాగించాల్సిన అవసరాన్ని గుర్తించాలి.

భారత రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రం 47వ ప్రకరణం, మద్యపానం నుండి ఇతర మత్తు పదార్థాల నుండి ప్రజలకు విమోచన కలిగించడం ప్రభుత్వ బాధ్యతగా గుర్తించింది. ప్రణాళికా సంఘాలు ఇందుకు అనుగుణంగా, సామాజిక న్యాయంగా గుర్తించి మద్య నిషేధం అమలు తప్పనిసరిగా అవసరం అని నొక్కి చెప్పాయి. శ్రీమన్ నారాయణ కమిటీ, న్యాయమూర్తి టేక్‌చంద్ కమిటీలు మద్యపాన నిషేధం ఆవశ్యకతను గుర్తించి, స్పందించి తమ నివేదికలు సమర్పించాయి. కానీ, మన ప్రభుత్వాలు ఆ కమిటీల నివేదికలను, సిఫార్సులను నీరు కార్చేశాయి. సరిగ్గా చెప్పాలంటే తొక్కేశాయి. ఫలితంగా మద్యం ద్వారా ఆదాయమే ప్రభుత్వ ఆదాయ వనరుగా మారింది. ప్రజలకు చేస్తున్న ద్రోహాన్ని ఆదాయం పేరిట సమర్థించుకుంటోంది. చివరికి ప్రజల ప్రాణాలతో జీవితాలతో చెలగాటమాడుతోంది.

అందుకే, తమ సంసారాలను నాశనం చేసే మాయదారి సారా, మద్యం మహమ్మారి అంతమే తమ జీవితాల్లో నిండుకున్న చీకట్లను తరుముతుందని, వెలుగు నింపుతుందని గ్రామీణ మహిళలు గుర్తించారు. కుటుంబాలలో పెరుగుతున్న అశాంతి, హింస దూరం చేసుకుందామని ఆశించిన రాష్ట్ర మహిళలు సారా, మద్య నిషేధం కోసం నడుం బిగించారు.

సారా సిండికేట్లపై, లిక్కర్ లాబీలపై యుద్ధం ప్రకటించారు. గూండాల దాడులకు, అరెస్టులకు, కేసులకు వెరవకుండా సారా రారాజులను, వారికి అండదండలిస్తున్న రాజ్యాన్ని సవాలు చేసి పోరాడారు. 1992 నుండి పోరాడి, 1995లో మద్య నిషేధాన్ని సాధించి రాష్ట్ర మహిళలు చరిత్ర సృష్టించారు. మహిళలు ఉద్యమించి సాధించుకున్న నిషేధం మొదటి నుండి నీతిమాలిన రాజకీయ నాయకుల వెన్నుపోటుకు గురవుతూనే ఉంది. ఉద్యమ ఒత్తిడితో నిషేధ నిర్ణయం తీసుకున్న ఎన్.టి.ఆర్. ప్రభుత్వం 100 రోజుల విజయోత్సవాలు జరుపుకుంటూ, నిషేధం సత్ఫలితాలను ఎన్నిటినో ఏకరవు పెట్టింది. రక్తం ధారపోసైనా తమ హామీలను, పథకాలను కొనసాగిస్తాం. త్యాగాలకు సిద్ధం కమ్మని పిలుపునిచ్చింది. 1996 పార్లమెంట్ ఎన్నికలు ముగిసిన వెంటనే ఇచ్చిన హామీలకు విరుద్ధంగా పాక్షిక నిషేధాన్ని ముందుకు తెచ్చింది. అప్పటి నుండి నిషేధానికి తూట్లు పొడుస్తూనే వచ్చింది చంద్రబాబు ప్రభుత్వం. అంచెలంచెలుగా ఎత్తేసి, గ్రామీణ స్థాయి వరకు సిట్టింగ్ బార్లకు అనుమతులిచ్చి నిషేధానికున్న అన్ని లాకులను ఎత్తేసి రాష్ట్రాన్ని మద్యం ప్రవాహంలో ముంచెత్తింది. 'బెల్టు షాపులతో మద్యం ఏరులై ప్రవహిస్తోంది. పసి పిల్లలకు పాల పీకలతో మద్యాన్ని పట్టిస్తున్నారు' అంటూ నిప్పులు చెరిగిన రోశయ్యగారు ప్రస్తుతం ప్రజలని మద్యం మత్తులోనే ముంచెత్తుతానంటున్నాడు.

రాష్ట్ర ప్రభుత్వం మహిళలకిచ్చిన వాగ్దానాలనైనా తుంగలో తొక్కుతుంది కానీ, ఆదాయానికి బంగారు బాతు లాంటి మద్యాన్ని మాత్రం వదులుకోదు. ప్రజలను నిరంతరం మద్యం మత్తులో ఉంచి తమ ప్రజా వ్యతిరేక, అభివృద్ధి నిరోధక, విధ్వంసక విధానాలను సజావుగా సాగించుకోవడం కోసం తిరగబడే చైతన్యాన్ని దారి మళ్లిస్తోంది. ఈ నేపథ్యంలో 'సంపూర్ణ మద్య నిషేధమే అంతిమ ఆకాంక్ష'గా ఉద్యమిస్తూ తక్షణ డిమాండ్లను రూపొందించుకుని దశల వారీ అమలు కోసం సంఘటితంగా పోరాడాలి.

జూన్ 26న ప్రపంచం అంతటా 'మద్యం – మాదక ద్రవ్యాల సేవనం నుండి మానవ జాతిని సంపూర్ణంగా విముక్తి చేయడానికి చైతన్య పరచవలసిన రోజు.' అందులో భాగంగా అనేక దేశాల్లో సదస్సులు,

**మద్యం వ్యాపారం ద్వారా లాభపడుతున్న వర్గాలు, అధికారంలో ఉన్న వర్గాలు వేరుకాదనీ, వాటికి ప్రజా సంక్షేమం కోణం నుంచి విధానాలు రూపొందించే దృష్టి ఉండదనీ అంటున్నారు ఎన్. వేణుగోపాల్**

# ఎవరికోసమీ ఎక్సైజ్ విధానం?

ప్రభుత్వానికి ఒక ఎక్సైజ్ విధానం అనేది ఉంటుందని, ప్రజలు తాగే మద్యంమీద పన్నులు విధిస్తూ ఆదాయం సంపాదించడమే ఆ విధాన లక్ష్యమని తెలిసిన మధ్యతరగతిలో సాధారణంగా రెండు రకాల ప్రతిస్పందనలు ఉంటాయి. ఒకటి, 'మరి ప్రభుత్వానికి పాలన నడపడానికి, ప్రజా సంక్షేమ కార్యక్రమాలు అమలు చేయడానికి నిధులు అవసరం కదా, వీలయిన అన్ని మార్గాలలోనూ పన్నులు వసూలు చేయాలి గదా, లేకపోతే ఇంతమంది ప్రభుతోద్యోగులకు జీతభత్యాలు, ఇన్ని పాఠశాలలు, ఇన్ని ఆస్పత్రులు, ఇన్ని ప్రజారవాణా సాధనాలు, వగైరా వగైరా ఎలా నడుస్తాయి' అని చాలమంది ప్రశ్నిస్తారు. ఈ రూపంలో పన్ను ఎంత వస్తుందో, ప్రభుత్వ ఖర్చులలో ఈ ఆదాయం లేకపోతే వచ్చే లోటు ఏమిటో, ప్రత్యామ్నాయ ఆదాయ వనరులు ఉన్నాయో లేవో వారికి స్పష్టంగా తెలియకపోవచ్చు. కాని వారికి ఇటువంటి అవగాహన ప్రచార సాధనాల నుంచి అంది ఉంటుంది. ఇటీవల ఒక సినిమాలో హాస్యంలాగ ఒక పాత్ర నోట పలికించిన సంభాషణలో 'మేం తాగుబోతులం కాం. టాక్స్ పేయర్స్ మి. మేం తాగి పన్నులు చెల్లించకపోతే ఈ పాలనే నడవదు' అనే మాట ఈ అవగాహనకు ఒక ఉదాహరణ. ఇక మరొక ప్రతిస్పందన తాగడం అనేదాన్ని నైతికదృష్టితో, ఆరోగ్యదృష్టితో చూసి అది అనైతికమనో, తప్పు అనో, అనారోగ్యకరమనో భావిస్తుంది. 'మనుషులు తాగగూడదు' అనే ఆదర్శాన్ని ప్రకటిస్తుంది. తాగడం వల్లనే చాల నేరాలు జరుగుతున్నాయని అనుకుంటుంది. ఈ తాగుబోతుతనాన్ని ప్రభుత్వాలు ఎందుకు ప్రోత్సహిస్తున్నాయో అని ఆశ్చర్యపోతుంది. ప్రభుత్వాలు నిర్బంధ

---

ప్రదర్శనలు, తీర్మానాలు జరిగాయి. భారత ప్రభుత్వం కూడా తన వంతుగా పత్రికల్లో మద్యం, మాదక ద్రవ్యాల వల్ల కలిగే దుష్పరిణామాల గురించి లాంఛనంగా ప్రకటనలు చేస్తుంది. ప్రధానమంత్రి, సామాజిక న్యాయ మంత్రులు సందేశాలు ఇచ్చి చేతులు దులుపేసు కుంటున్నారు. కానీ, ఎక్సైజ్ ఆదాయంతో ఖజానా నింపుకుంటున్న మన సంక్షేమ ప్రభుత్వం మాత్రం కనీస ప్రకటనలు కూడా చేయడానికి ఇష్టపడదు. దాని ప్రాముఖ్యత తెలవకుండా ఉండాలని ప్రయత్నిస్తోంది.

రాష్ట్ర ప్రభుత్వం తీసుకొచ్చిన జి.ఒ.లు 723, 734, 735లను రద్దు చేయాలి. రాష్ట్రంలో ఉన్న బెల్టు షాపులన్నింటినీ రద్దు చేస్తూ ప్రభుత్వం రాతపూర్వక ఉత్తర్వులను వెంటనే ఇవ్వాలి. చీప్ లిక్కర్‌ను రద్దు చేయాలి. అక్రమ కల్తీ మద్యాన్ని అరికట్టాలి. సిట్టింగ్ బార్లను పూర్తిగా నిషేధించాలి. మద్యం అమ్మకాలపై టార్గెట్లను నిర్ణయించరాదు. బార్ అండ్ రెస్టారెంట్లలో డిస్కో థెక్‌లను, అశ్లీల నృత్యాలను అనుమతించ వద్దు. 'మా ఊరికి మద్యం వద్దు' అన్న నినాదంతో 50 శాతానికి పైగా ప్రజలు కోరితే మద్యం అమ్మకాలు నిలిపివేయాలి. గ్రామ పంచాయితీలు మద్యం వద్దనే తీర్మానాలు చేసిన చోట అమ్మకాల్ని నిరోధించాలి. ప్రజల అభీష్టానికి వ్యతిరేకంగా ఇచ్చిన లైసెన్సులను రద్దు చేయాలి. మద్య నిషేధ అమలు శాఖ ద్వారా నిరంతరం మద్యం దుష్ఫలితాలపై విస్తృత ప్రచారం చేపట్టాలి. ఎక్సైజ్ ఆదాయంలో సగభాగం మద్య వ్యతిరేక ప్రచారానికి ఉపయోగించి ప్రజలను జాగృత పరచాలి. డి-ఎడిక్షన్ క్యాంప్‌లను మండల, జిల్లా కేంద్రాలలో, ప్రభుత్వ ఆసుపత్రులలో నిర్వహించి, వ్యసనం నుంచి విముక్తి కావడానికి సహకరించాలి. లిక్కర్ మరణాలపై వెంటనే తగిన విచారణ జరిపించాలి. మరణించినవారికి తగిన ఎక్స్‌గ్రేషియా చెల్లించాలి. గతంలో మద్య వ్యతిరేక పోరాటంలో పాల్గొన్న వారిపై పెట్టిన కేసులను ఎత్తివేయాలి. రాజకీయ పార్టీలన్నీ తమ ఎన్నికల ప్రణాళికలలో మద్య నిషేధాన్ని ప్రకటించాలి. మద్యంతో సంబంధం ఉన్న వారికి పార్టీ టిక్కెట్లు ఇవ్వరాదు. మద్యం వ్యాపారులను పార్టీల నుండి బహిష్కరించాలి.

మద్య నిషేధాన్ని ఎత్తివేసి కుంటిసాకులతో, మాయ మాటలతో ఆర్థిక సంక్షోభ బూచిని చూపించి మద్యాన్ని రుద్దుతున్న వైనాన్నీ, ప్రాణాలు హరించడాన్నీ చూసి ప్రజలు విస్తుపోతున్నారు. సారా, మద్య నిషేధ పోరాటాలతో చరిత్రకెక్కిన మహిళలు, తాము మోసపోయామని తెలుసుకుంటున్నారు. నిషేధాన్ని తమ స్వార్థ పూరిత ప్రయోజనాల కోసం ఉపయోగించుకున్న చంద్రబాబు, వై.ఎస్. రాజశేఖరరెడ్డి, రోశయ్య ప్రజా వ్యతిరేక విధానాలను నిరసిస్తూ మరోసారి సమరశీల పోరాటాలకు సిద్ధం కావాలి. ప్రజలకు మత్తు ఇవ్వకుంటే ఖజానాకు దిక్కులేదనే పాలకుల నిర్ణయాలను తిప్పికొట్టడానికి సమాయత్తం కావాలి. తాము పొదుపు చేసిన సొమ్మును సైతం కొల్లగొడుతున్న ప్రభుత్వ విధానాలను తిరస్కరించడానికి మహిళలు ఉద్యమానికి సన్నద్ధం కావాలి. ప్రభుత్వం అనుసరిస్తున్న ఆబ్కారీ విధానాలకు నిరసనగా, ప్రజలని మత్తు పదార్థాలకి, వ్యసనాలకు అలవాటు చేస్తున్న ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా మహిళలు ఉద్యమించాల్సిన అవసరాన్ని ఇప్పటికైనా గుర్తించాలి. ప్రజల ప్రాణాలతో చెలగాట మాడుతున్న కల్తీ, అక్రమ మద్యం వ్యాపారాన్ని నిషేధించమంటూ ఉద్యమించాలి. మద్యం వ్యాపారాన్ని ప్రోత్సహిస్తున్న విధానాలను విడనాడాలని పోరాడాలి. నివాస ప్రాంతాల్లో, నిబంధనలకు విరుద్ధంగా నడుస్తున్న షాపుల లైసెన్సుల రద్దుకు, బెల్టు షాపుల ధ్వంసానికి నడుం బిగించాలి. మద్యరహిత సమాజం కోసం, హింస రహిత కుటుంబాల కోసం ఉద్యమించాలి.

*(రచయిత ప్రగతిశీల మహిళా సంఘం అధ్యక్షురాలు)* వీ

పూరితంగానైనా సరే మద్యనిషేధ విధానాన్ని అమలు చేయాలని, అంటే ఎక్సైజ్ విధానాన్ని వదులుకోవాలని కోరుతుంది.

ఈ 'పన్ను చెల్లింపుదారు' అవగాహన గాని, 'వ్యసనపరుడు' అవగాహన గాని ప్రభుత్వ ఎక్సైజ్ విధానాన్ని పూర్తిగా అర్థం చేసుకోవడానికి సరిపోవు. ఎక్సైజ్ విధానానికి చారిత్రక మూలాలూ, దానివల్ల పాలకులకు రాజకీయార్థిక సాంస్కృతిక ప్రయోజనాలూ ఉన్నాయి గనుక, దాన్ని కేవలం పన్నుల వనరుగానో, వ్యసనంగానో చూస్తే అరకొరగానే అర్థమవుతుంది. తప్పనిసరిగా ఎక్సైజ్ విధానంలో పన్ను ఆదాయం కోణం, మద్యపానంలో వ్యసనం కోణం ఉన్నాయి గాని ప్రభుత్వాలు అనుసరిస్తున్న పద్ధతిలో ఎక్సైజ్ విధానం వల్ల పాలకవర్గాలకు ఆర్థిక ప్రయోజనాలతో పాటు రాజకీయ, సాంస్కృతిక ప్రయోజనాలు కూడ ఉన్నాయి. అందుకే ఈ వ్యవస్థ ఇలాగే ఉన్నంత కాలం పాలకులు ఆ ఎక్సైజ్ విధానాన్ని వదులుకోవడం, మద్యనిషేధాన్ని చిత్తశుద్ధితో అమలు చేయడం సాధ్యం కాదు. నిజానికి ఈ మద్యం మీద, మాదకద్రవ్యాల మీద పన్నులు విధించే అధికారం పూర్తిగా రాష్ట్ర ప్రభుత్వాల పరిధిలోనిదే అయినప్పటికీ, వామపక్ష ప్రభుత్వాలతో సహా ఏ పార్టీ ప్రభుత్వాలు కూడ తాము అధికారంలోకి వచ్చిన రాష్ట్రాలలో ఎక్సైజ్ విధానాన్ని సమూలంగా మార్చడానికి ప్రయత్నించలేదు. 'మద్య నిషేధం ఆచరణ సాధ్యమైన విధానం కాదు గనుక, కల్తీ చేసిన, పన్ను చెల్లించని మద్యాల తయారీని, సరఫరాను, అమ్మకాలను అడ్డుకోవడం, రాష్ట్రానికి రాగలిగినంత ఎక్కువ పన్ను ఆదాయాన్ని రాబట్టడం అనే రెండు కర్తవ్యాలు ప్రభుత్వం ముందున్నాయి' అని పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రభుత్వం కూడ అంటున్నది.

ప్రస్తుతం నడుస్తున్న ఎక్సైజ్ విధానానికి రూపాలు చాల మారి ఉండవచ్చు గాని సారాంశంలో ప్రజల మద్యపానపు అలవాటు మీద ప్రభుత్వాలు సొమ్ముచేసుకోవచ్చుననే ఆలోచన కౌటిల్యుని అర్థశాస్త్రం నాటినుంచీ ఉంది. అనేక రకాల మద్యాల గురించీ, మద్యపానాన్ని ప్రభుత్వం నియంత్రించడం గురించీ, తాగే స్థలాల గురించీ, తాగే వారి అర్హతల గురించీ, పన్నుల విధానం గురించీ అర్థశాస్త్రం వివరంగా చెప్పింది. అంటే క్రీ.పూ. రెండో శతాబ్దానికీ, క్రీ.శ. రెండో శతాబ్దానికీ మధ్యకాలానికే మద్యపానం మీద పాలకులు పన్నులు వసూలు చేయవచ్చుననే ఆలోచన ఉందని అనుకోవచ్చు. కాని ఆశ్చర్యకరంగా అర్థశాస్త్రంలోనే 'ఎవరయినా వారి ఆదాయానికి మించి మద్యపానం చేసినా, భవిష్యత్తుకోసం ఆదా చేయకుండా మద్యపానం చేసినా వారిని రక్షకభటులకు అప్పగించాలి' అనే నిబంధన కూడ ఉంది.

ఏమైనా, అప్పటినుంచి బ్రిటిష్ అధికారం వచ్చేదాకా దేశంలో రాచరికం, భూస్వామ్యం కొనసాగాయి గనుక, ఆ నాటి విలువలలో విలాసాలకు, అందులోనూ మద్యానికి ప్రాధాన్యత హెచ్చు గనుక మద్య అనుకూల విధానాలే కొనసాగాయి.

పెట్టుబడిదారీ విధానంలో అన్ని అంశాలనూ లాభనష్టాల దృష్టితో చూడడం జరుగుతుంది. మద్యం ద్వారా వచ్చే ఆదాయం గురించి కూడ ఆ దృక్పథమే సాగింది. అయితే అదే సమయంలో పెట్టుబడిదారీ విధానం తొలిరోజుల్లో బ్రిటన్ లో కొన్ని రంగాలలో నైతిక దృష్టితో కలగలిసి సాగింది. అందుకే పెట్టుబడిదారీ విధాన సిద్ధాంతకర్త ఆడమ్ స్మిత్ తన వెల్త్ ఆఫ్ నేషన్స్ లో మద్యపానం మీద పన్ను గురించి రాసినది చూస్తే ఆశ్చర్యకరంగా ఉంటుంది. 'మత్తెక్కించే మద్యాలు సామాన్య ప్రజల ఆరోగ్యాలకు హానికరమైనవి గనుకా, వారి నైతిక వర్తనను కలుషితం చేస్తాయి గనుకా, వాటి వినియోగాన్ని తగ్గించే దిశగా ఇటీవల గ్రేట్ బ్రిటన్‌లో పన్నుల విధానం ఉంది' అని ఆ హెచ్చు పన్నుల విధానాన్ని విమర్శిస్తున్న వారికి అది ఎందుకు అవసరమో ఆయన జవాబు చెప్పాడు. అంటే మద్యం మీద ఎక్కువ పన్ను వేసి దాని ధర పెంచడం ద్వారా దాని వినియోగాన్ని తగ్గించాలని బ్రిటిష్ ప్రభుత్వం కనీసం పద్దెనిమిదో శతాబ్దంలోనయినా అనుకున్నదన్నమాట.

అందుకే ఇటువంటి పన్నుల గురించి రాజకీయార్థిక శాస్త్ర పాఠ్య పుస్తకాలలో 'నిరోధకంగా పనిచేసే పన్ను' అనీ, 'అపచారపు పన్ను' అనీ, 'పరిసరాలను చెడగొట్టకుండా ఉండే పన్ను' అనీ, 'ఆ అలవాటువల్ల కలిగే నష్టాలను పరిహరించడానికి వేసే పన్ను' అనీ, 'శిక్షగా వేసే పన్ను' అనీ చెపుతారు. అయితే ఇవన్నీ పాఠ్య పుస్తకాల వరకేగాని ఈ పన్ను వల్ల నిజంగా మద్యపానం తగ్గిపోవాలని ప్రభుత్వాలు అనుకుంటున్న దాఖలాలు ఏమీ లేవు. ఎప్పటికప్పుడు ఎక్కువమంది తాగాలనీ, ఎక్కువ మద్యం వినియోగం కావాలనీ, తద్వారా ఎక్కువ పన్ను ఆదాయం రావాలనీ లక్ష్యాలు విధించి, అవి సాధించవలసిందిగా, అంటే బలవంతాన తాగించవలసిందిగా ప్రభుత్వాలే సిబ్బందికి ఆదేశాలు ఇస్తున్నాయి.

బ్రిటిష్ పాలనలోని మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం, స్వతంత్ర రాచరికంగా ఉండిన హైదరాబాద్ ప్రభుత్వం రెండూ కూడ మద్యం మీద పన్ను ఆదాయాన్ని ప్రధానంగా భావించాయి. హైదరాబాద్ ప్రభుత్వం చాల విషయాలలో బ్రిటిష్ పాలనావిధానాలను అనుసరించ డానికి ప్రయత్నించింది. అంతకుముందు అరాచకంగా ఉండిన ఆబ్కారి (ఎక్సైజ్) విధానాన్ని సంస్కరించాలని, తక్కువ మద్యం వినియోగంతో ఎక్కువ ఆదాయం ఒనగూరే మద్రాసు పద్ధతి అమలు చేయాలని 1905లో భావించింది. నిజానికి మద్రాసు రాష్ట్రంలో మాదకద్రవ్యాల మీదా, మద్యం మీదా ప్రభుత్వ నియంత్రణ 1808లోనే మొదలయి 1886 మద్రాస్ ఆబ్కారీ చట్టం తో క్రమబద్ధమయింది. నాటుసారా, కల్లు, విదేశీ సారా, గంజాయి మొక్క నుంచి తయారయ్యే మత్తుపదార్థాలు, నల్లమందు అన్నీ ఈ చట్టం కిందికి తీసుకువచ్చారు. ఏ ప్రాంతంలో ఎన్ని సారా దుకాణాలు ఉండాలి, అక్కడ అమ్మే సారా ఎంత ఘాటయినది ఉండాలి నిర్ణయించే అధికారం ప్రభుత్వానికి ఉండేది. ఆ దుకాణాలు నడిపే లైసెన్సును ఏడాదికి ఒకసారి వేలం పాటల ద్వారా నిర్ణయించే వారు. దానితో పాటు అమ్మిన పరిమాణాన్ని బట్టి సుంకం ఉండేది. అంటే మొత్తం మీద ఇవాళ్టి ఆంధ్రప్రదేశ్‌లోని రెండు ప్రాంతాలలోనూ దాదాపు ఒకటే రకమయిన ఎక్సైజ్ విధానం కనీసం 1905 నుంచి 1947 దాకా సాగింది. మళ్లీ ఇప్పుడు కొనసాగుతున్న విధానం కూడ దాని నమూనాలోనే తయారయింది. ఈలోగా భారత జాతీయోద్యమంలో ప్రభుత్వ వ్యతిరేక దృష్టి నుంచీ, నైతిక దృష్టి నుంచీ కూడ మద్యనిషేధం గురించి ఆలోచనలు, మద్యవ్యతిరేక పోరాట రూపాలు వచ్చాయి. 'స్వాతంత్ర్యోద్యమాన్నయినా వాయిదా వేస్తాను గాని, మద్యపాన వ్యతిరేక ఉద్యమాన్ని వాయిదా వేయలేను' అని గాంధీ అన్నాడు. అప్పటి ప్రభుత్వాదాయ వనరులలో ప్రధానమయినదిగా ఎక్సైజ్ ఆదాయం ఉండడం వల్ల మద్యపాన వ్యతిరేకత ప్రభుత్వ వ్యతిరేకతకు చిహ్నంగా కూడ ఉండింది. బ్రిటిష్ ఇండియాలో అనేక చోట్ల సారా దుకాణాల ముందర ప్రదర్శనలు, సారా దుకాణాలు బద్దలుకొట్టడం, మద్యపాన వ్యతిరేక ప్రచారాలు సాగాయి. హైదరాబాద్ రాజ్యంలో కూడ అదేవిధంగా తాటిచెట్లను నరికే ఉద్యమం, గీసేవాడిదే చెట్టు అనే రూపంలో

ప్రభుత్వానికి పన్ను కట్టబోమనే ఉద్యమం నడిచాయి. అయినా 1947 తర్వాత, మొక్కుబడిగా రాజ్యాంగంలో ఆదేశిక సూత్రాలలో మద్యనిషేధం గురించి ఒక మాట చేర్చడం మినహా, ప్రభుత్వాలు దాన్ని తీవ్రమైన విషయంగా పరిగణించలేదు. ఎక్సైజ్ విధానాన్ని ఒక ఆదాయ మార్గంగా చూస్తూనే వచ్చాయి.

అధికార మార్పిడి తర్వాత మద్రాసు రాష్ట్రంలోని నెల్లూరు, గుంటూరు జిల్లాలలో 1948లో మద్య నిషేధం ప్రారంభించి, ఆ తర్వాత దాన్ని రాయలసీమకు కూడ విస్తరించారు. 1952లో దాన్ని మొత్తం ఆంధ్ర ప్రాంతంలో అమలు చేశారు. 1956లో ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తర్వాత కూడ తెలంగాణలో మద్యపానం కొనసాగుతుండగా, కోస్తాంధ్ర, రాయలసీమలలో మాత్రం మద్యనిషేధం అమల్లో ఉండేది. 1969 నవంబర్ 1న ఆ ప్రాంతాలలో కూడ మద్యనిషేధాన్ని ఎత్తివేసి సారా, దేశవాళీ మద్యం అమ్మకాలను అనుమతించడం మొదలుపెట్టారు. 1986లో తెలుగుదేశం ప్రభుత్వం మద్యం అమ్మకాలను నిర్వహించడానికి ఆంధ్రప్రదేశ్ బెవరేజెస్ కార్పొరేషన్ లిమిటెడ్ అనే ప్రభుత్వ రంగ సంస్థను ఏర్పాటు చేసింది. మద్యం అమ్మకాలు ప్రభుత్వమే నడపడం మొదలు పెట్టింది. నెల్లూరు జిల్లా దూబగుంటలో మొదలయి జిల్లా అంతటా మద్య వ్యతిరేక ఉద్యమం పెద్ద ఎత్తున సాగిన తర్వాత అప్పటి కాంగ్రెస్ ప్రభుత్వం 1993 ఏప్రిల్ లో నెల్లూరు జిల్లాలో, అక్టోబర్ నుంచి మొత్తం రాష్ట్రంలో సారా అమ్మకాలపై మాత్రం నిషేధం విధించింది. దేశవాళీ మద్యం (ఇండియన్ మేడ్ ఫారిన్ లిక్కర్ - ఐ.ఎం.ఎఫ్.ఎల్. అనే పేరుతో ప్రచారంలో ఉన్న ఖరీదయిన మద్యం) అమ్మకాలు సాగనిచ్చారు.

ఆ తర్వాత ఎన్నికలలో మద్యనిషేధ వాగ్దానంతోనే అధికారానికి వచ్చిన తెలుగుదేశం ప్రభుత్వం 1995 జనవరి 16 నుంచి మొత్తం రాష్ట్రంలో మద్యనిషేధం విధించింది. చంద్రబాబు నాయుడు ముఖ్యమంత్రి అయిన తర్వాత 1997లో ఈ నిషేధాన్ని ఎత్తివేశారు. ఇక అప్పటినుంచీ ఏడాదికేడాదికీ ప్రభుత్వమే మద్యం అమ్మకాల లక్ష్యాలు నిర్ణయించి, ప్రోత్సహిస్తూ వస్తోంది. ఈ మద్యం అమ్మకాల ప్రోత్సాహంలో తెలుగుదేశం పార్టీకీ, కాంగ్రెస్ పార్టీకీ ఏమీ తేడాలేదు.

రాష్ట్రంలో అనుమతి పొందిన దాదాపు ఏడువేల మద్యం దుకాణాలలో, 800 బార్లలో మద్యం అమ్మకాలు సాగించే హక్కు ఎవరిదో నిర్ణయించడానికి రాష్ట్ర ప్రభుత్వ ఎక్సైజ్ శాఖ రెండు సంవత్సరాలకు ఒకసారి వేలం పాటలు నిర్వహిస్తుంది. ప్రతిసారీ వేలం పాటలు జరిగేటప్పుడు ప్రభుత్వమే గత వేలం పాట కన్న 15 శాతం పెంచి లైసెన్స్ ఫీజు నిర్ణయిస్తుంది. అంటే పాటలో నెగ్గాలంటే అంతకన్న ఎక్కువ చెల్లించడానికి సిద్ధపడాలన్నమాట. మరోమాటల్లో చెప్పాలంటే గత సంవత్సరం కన్న ఈ సంవత్సరం కనీసం 15 శాతం ఎక్కువ మందిచేత, లేదా పాతవారితోనే 15 శాతం ఎక్కువ మద్యాన్ని తాగిస్తామని దుకాణదారులు ప్రభుత్వానికి హామీ ఇవ్వాలన్నమాట.

ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన మొదటి సంవత్సరం (1957-58)లో రాష్ట్ర ప్రభుత్వ ఖజానాకు ఎక్సైజ్ ఆదాయం రు. 5.95 కోట్లు ఉండింది. అప్పటికి సగానికన్న ఎక్కువ ప్రాంతంలో మద్య నిషేధం అమలులో ఉండడం వల్ల ఇది ప్రాతినిధ్య గణాంకం కాదనుకున్నా, నిషేధం ఎత్తివేసిన తర్వాత మొదటి సంవత్సరమైన 1970-71లో అది రు. 25.88 కోట్లుగా ఉండింది. ఆ తర్వాత గడిచిన నలభై సంవత్సరాలలో అది 300 రెట్లు పెరిగి 2010-11లో రు. 7,512.00 కోట్ల అంచనాకు చేరింది. ప్రజా జీవితంలోని ఇతర ఏ అంశాన్ని తీసుకున్నా ఇలా 300 రెట్ల పెరుగుదల కాదు గదా మూడు నాలుగు రెట్ల పెరుగుదల కూడ లేదు.

ఇలా ఎక్సైజ్ ఆదాయం సంపాదించడం ప్రజాసంక్షేమ కార్యక్రమాల కోసమే అని రాజకీయ నాయకులు, ప్రభుత్వాధికారులు చెపుతుంటారు. కాని లక్షకోట్ల రూపాయల పైన ఉన్న బడ్జెట్ లో ఏడువేల కోట్ల రూపాయల ఆదాయం అంత నిర్ణయాత్మకమైనదేమీ కాదు. ఆపాటి నిధులను ఇతర మార్గాల ద్వారా సంపాదించవచ్చు, మిగిలిన ఖర్చులలో పొదుపు పాటించి సంపాదించవచ్చు. అసలు ప్రభుత్వం తలచుకుంటే తన ఆదాయ వ్యయాలను సక్రమంగా సమీక్షించుకుంటే తగ్గించుకో గలిగిన ఖర్చులు, పెంచుకోగలిగిన ఆదాయాలు ఎన్నో ఉన్నాయి. భద్రతా వ్యయం, రుణాల అసలు, వడ్డీల చెల్లింపులు, ప్రైవేటు విద్యా, ఆరోగ్య, రవాణా సంస్థలకు చెల్లింపులు, ప్రభుత్వ పనులు చేయడానికి అనవసరంగా కాంట్రాక్టర్లను నియమించుకుని వారికి చేస్తున్న చెల్లింపులు చాల వరకు తగ్గించవచ్చు, కొన్నయితే పూర్తిగా మానెయ్యవచ్చు. అలాగే, ప్రభుత్వాదాయం పెంచుకోవడానికి కూడ ఎన్నో మార్గాలున్నాయి. రాష్ట్రంలోని ఖనిజ వనరులను ప్రైవేటు సంస్థలకు, వ్యక్తులకు అప్పగించి, వారు దోచుకుపోతుంటే చూస్తూ కూచున్న ప్రభుత్వం, ఆ గనులను ప్రభుత్వ ఖనిజాభివృద్ధి సంస్థచేతనే తవ్వించి సొంతంగా ఖనిజాలను అమ్మినా, కనీసం ఆ ప్రైవేటు ఖనిజ సంస్థలు సంపాదిస్తున్న లాభాలలో ఎక్కువభాగాన్ని పన్నుగా వసూలుచేసినా, రాష్ట్రాదాయం పెరుగుతుంది.

కాని అటువంటి చర్యలకు ఈ పాలకవర్గాలు, ఈ ప్రభుత్వం పూనుకోవు. మద్యం వ్యాపారం ద్వారా లాభపడుతున్న వర్గాలు, పరిపాలన సాగిస్తున్న వర్గాలు ఒకటే కనుక ఈ ప్రభుత్వం తన వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకంగా పనిచేయడం అసాధ్యం. అంతేకాక, ప్రజలు ఇలా వ్యసనాలకు, మత్తుపదార్థాలకు, తప్పుడు మార్గాలకు బానిసలయితేనే, పొందవలసిన చైతన్యం పొందకుండా ఉంటారు. అంటే పాలకవర్గాలు సాగిస్తున్న అక్రమాలను ప్రజలు ప్రశ్నించకుండా, ఎదిరించకుండా ఉండాలంటే, తప్పనిసరిగా ప్రజలను ఇటువంటి అపసవ్య మార్గాలలోకి మళ్లించవలసి ఉంటుంది. ఆ రకంగా మద్య వ్యాపారంతో పాలకులకు ఆర్థిక ప్రయోజనాలూ ఉన్నాయి, రాజకీయ, సాంస్కృతిక ప్రయోజనాలూ ఉన్నాయి.

మొత్తం మీద ప్రభుత్వాలు ఇప్పుడు అమలు చేస్తున్న ఎక్సైజ్ విధానం ప్రజల మేలు కోసం కాదు. అది ప్రజల ఆరోగ్యాలను రక్షించేదీ కాదు, ప్రజా సంక్షేమానికి ఖర్చు చేయడానికి నిధులు కావాలనే పేరుమీద ఆ ప్రజల ఆరోగ్యాలనూ జీవితాలనూ కుటుంబాలనూ గుల్ల చేసి డబ్బులు దండుకునేది. ప్రజలను వ్యసనపరులుగా తమ రాజకీయార్థిక విధానాలను ప్రశ్నించి పోరాడలేని శక్తిహీనులుగా మార్చేది. వారి బలహీనతలను పెంచి పోషించి, వారు మేల్కొని తమ మీద, తమ విధానాల మీద తిరగబడకుండా చేసేది. ఇన్ని లోపాలతో, దురాలోచనలతో, ప్రజావ్యతిరేకంగా ఉన్న విధానానికి తప్పకుండా ప్రత్యామ్నాయం ఉంటుంది, ఉండాలి. కాని ప్రస్తుతం ఉన్న సామాజిక రాజకీయార్థిక వ్యవస్థలో, ఈ పాలకవర్గాల ఆధిపత్యంలో ఆ ప్రత్యామ్నాయం సాధ్యం కాదు. ఆ ప్రత్యామ్నాయం గురించి ప్రజలు ఆలోచించడానికి కూడ వీలు లేని స్థితిని పాలకులు తయారుచేసి పెట్టారు. ఉన్న వ్యవస్థలో ఏవో అతుకులూ మాట్లూ వేసినప్పటికీ, ఎక్సైజ్ విధానం వంటి ప్రజావ్యతిరేక విధానాలు కొనసాగుతూనే ఉంటాయని విభిన్న రాజకీయ పక్షాల పాలనలో ఉన్న రాష్ట్రాల చరిత్ర చెపుతోంది.

*(రచయిత వీక్షణం సంపాదకులు)* వీ

రాజ్యానికి, మావోయిస్టు ఉద్యమానికి సమాజ అభివృద్ధికి సంబంధించిన మౌలిక అవగాహనలే వేరని చెబుతూ, ఆ అవగాహనలను విశ్లేషిస్తున్నారు డా. ముదునూరి భారతి

# అభివృద్ధి - హింస: రెండు దృక్పథాలు

మన దేశంలో ఆర్థిక ప్రగతిని వేగవంతం చేసే కార్యక్రమంలో భాగంగా ప్రభుత్వం నూతన ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టి, తమ దృష్టిని పరిశ్రమల మీద కేంద్రీకరించి ప్రత్యేక ఆర్థిక మండలాలను సాధనంగా ఎంచుకుంది. ఇవి సమర్థవంతంగా పనిచేయడానికి ఎటువంటి అవరోధాలు లేకుండా చేస్తే అధికోత్పత్తి జరుగుతుందనీ, సమాజంలో మార్కెట్ ఆధారిత వ్యవస్థ తయారవుతుందనీ, మన ఆర్థిక వ్యవస్థ ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో భాగమై అభివృద్ధి చెందుతుందనే నమూనా దీనికి మూలం. ఈ దృక్పథంతో స్వదేశీ పారిశ్రామికవేత్తగా పునాదులున్న టాటా కంపెనీవారు పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో సింగూరులో భారీ పెట్టుబడితో సామాన్య ప్రజలకు ఉపయోగపడే నానో కార్ల కంపెనీ ప్రతిపాదన చేశారు. దీనికి రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించి సింగూరులో భూసేకరణ ప్రారంభించడంతో భూములు పోగొట్టుకునే చిన్నకమతాలున్న వ్యవసాయదారులు ఆందోళన ప్రారంభించారు. టాటా కంపెనీ వారు భూముల దగ్గరకు రాకుండా ఆందోళన చేశారు. ఈ ఆందోళన సమసిపోక పోవడంతో దీనిని అణచివేసే ప్రయత్నంలో భాగంగా ప్రభుత్వం జరిపిన కాల్పులలో కొంతమంది చనిపోయారు. ఈ కారణంగా ఆందోళన మరింత తీవ్రతరం అయి హింస చోటు చేసుకోవడం, ప్రభుత్వం వీరి వెనుక మావోయిస్టులు ఉన్నారంటూ, అణచివేతను పట్టుదలగా కొనసాగించడం జరుగుతూ పోయాయి. హింస - ప్రతిహింసల క్రమం గత రెండు సంవత్సరాలుగా కొనసాగుతూనే ఉంది. మహాశ్వేతాదేవి లాంటి మేధావులు ఈ హింస - ప్రతిహింసల క్రమాన్ని వ్యతిరేకించడం కూడా జరిగింది. బెంగాల్‌లోనే కాకుండా దేశంలో మిగతా రాష్ట్రాలలో - ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్, ఒడిషా, బీహార్‌లలో - కూడా హింస ప్రతిహింసల క్రమం కొనసాగుతూనే ఉంది. ఇటువంటి సందర్భంలో ముంబాయిలో సిపిడిఆర్ ఆధ్వర్యంలో జరిగిన సభలో ప్రముఖ రచయిత్రి అరుంధతీ రాయ్ మావోయిస్టుల మీద వెలిబుచ్చిన అభిప్రాయాలు ప్రాముఖ్యత సంతరించుకున్నాయి.

జూన్ మొదటివారంలో సమాచార పత్రికలలో వచ్చిన వార్త ప్రకారం, సిపిడిఆర్ ఆధ్వర్యంలో జరిగిన సభలో ఆదివాసీల అభివృద్ధి మీద, ముఖ్యంగా నక్సలైట్లు రాజ్యాన్ని ఎదిరిస్తూ చేసే సంఘర్షణ, వారి పద్ధతుల మీద వెలిబుచ్చిన అభిప్రాయాలు ఆసక్తిని రేకెత్తించాయి. మావోయిస్టులకు రాజ్యం అనుసరించే అభివృద్ధి నమూనాని ఎదిరించే విప్లవాత్మక పద్ధతులు (రెవల్యూషనరీ మెథడ్స్) ఉన్నాయనీ, కాని వారికి విప్లవాత్మక గమ్యం (రెవల్యూషనరీ విజన్) లేదనీ అరుంధతీ రాయ్ అన్నారు. మావోయిస్టులు అనుసరించే మైనింగ్ పాలసీ రాజ్యం అనుసరించే మైనింగ్ పాలసీ కంటే పూర్తిగా భిన్నమైనది కాదనే అభిప్రాయాన్ని కూడా వెలిబుచ్చారు. రాజ్యం అనుసరించే ఆదివాసీ అభివృద్ధి మార్గం వారి విధ్వంసానికే పరుగులు తీస్తోందనీ, దీని వలన పర్యావరణానికి జరిగే విధ్వంసం కారణంగా మానవాళి అంతా ప్రభావితమౌతుందనీ అన్నారు. అంతే కాకుండా ఇంతవరకు ప్రజాస్వామ్యం, పౌర సమాజం లాంటి భావనలు సభలలో ఉపన్యాసాలకే పరిమితమయ్యాయని, కాని ప్రస్తుత సంక్షోభ సందర్భంలో ఎన్నో లక్షల మంది వీటిమీద ప్రశ్నలు వేస్తున్నారని అభిప్రాయపడ్డారు. ఈ ఘర్షణలో మావోయిస్టులు ఒక అంచున ఉంటే, రెండో అంచున రాజ్యం ఉందనీ, రాజ్యం ఎంచుకున్న ఆర్థిక విధానాల ద్వారా తమ జీవనోపాధికి సంబంధించిన భూమి, నీరు, అడవులు లాంటి వనరులు పోగొట్టుకుంటున్నారంటే, రాజ్యమే ప్రజల మీద యుద్ధం చేస్తోందనీ, దీనిని ఎదిరించడం తప్ప ప్రజలకు వేరే మార్గం లేకపోయిందనీ అభిప్రాయపడ్డారు. ఈ సభలోనే పియుడిఆర్ ఢిల్లీ అధ్యక్షులు గౌతమ్ నవ్‌లఖా కూడా మాట్లాడారు. చట్టానికి వ్యతిరేకంగా ప్రవర్తించేది మావోయిస్టులు కాదనీ, భారత ప్రభుత్వమే తను తయారు చేసుకున్న సంవిధానాన్ని తానే అతిక్రమిస్తోందనీ, మావోయిస్టులకు దీనిని ఎదిరించే ఇతర మార్గాలు లేక సాయుధ పోరాటానికి నెట్టివేయబడ్డారనీ సమర్థించారు. వీటి మీద అనేకచోట్ల చర్చలు జరుగుతున్న సందర్భంలో ఈ హింస-ప్రతిహింసలకు మూలం ఏమిటి అనే ప్రశ్న మీద కేంద్రీకరించి మన అవగాహనని పెంచుకుంటే సమాజ గమనాన్ని అర్థం చేసుకునే వీలు కలుగవచ్చును.

## చారిత్రక నేపథ్యం

గత సంవత్సరాలలో సమాజం మారుతున్న క్రమాన్ని, దాని వలన వచ్చిన పరిణామాలను పరిశీలించితే, హింస అంతర్లీనంగా వివిధ రూపాలలో సాగుతూనే ఉంది. ఒక పక్క మన దేశ నాయకులు - నెహ్రూ లాంటివారు - కొత్త సమాజాన్ని నిర్మించాలనే ఉద్దేశంతో హిరాకుడ్ లాంటి భారీ డ్యాంలు, రూర్‌కేలా, బొకారో, టాటానగర్‌లలో ఉక్కు పరిశ్రమలు లాంటి భారీ పరిశ్రమలను పరికరాలుగా ఎంచుకున్నారు. అంటే ఉత్పత్తికి అవసరమైన వివిధ వనరులలో పెట్టుబడి - ఇది జాతీయం కావచ్చును, అంతర్జాతీయం కావచ్చును - ముఖ్య సాధనంగా కనిపిస్తుంది. పెట్టుబడి ద్వారా సమాజాన్ని మార్చే క్రమానికి అవసరమైన భూమిని భూసేకరణ చట్టం అమలు చేసి స్థానిక ప్రజల భూములను అన్యాక్రాంతం చేయడం జరిగింది. దీంతో ప్రజలు నిర్వాసితులవడమే కాక, పాత సమాజంలో వారి జీవనోపాధి

పోగొట్టుకొని కొత్త సమాజంలో ఉపాధి దొరకక మిగులు మనుషులుగా మిగిలి పోయారు. పెట్టుబడి రాశి పెరిగిన కొద్దీ ఈ మిగులు మనుషుల రాశి కూడా పెరిగిపోతూనే ఉండి, వీరు దేశ ఆర్థిక ప్రగతికి ఒక సవాలుగా కనిపించారు.

సమాజంలో కొంత వృద్ధి జరిగినా – ఇది పెరుగుతున్న జిడిపి (జాతీయోత్పత్తి) రూపంలో కనిపించినా – ఆ వృద్ధి అలా సాగిపోవాలంటే మిగులు మనుషుల సమస్య ఒక చెడు అని గ్రహించినా అది అనివార్యం అని అనుకోవడం. ఇటువంటి అడ్డంకులు తప్పవు అనుకుని వీరి అవసరాలు తీర్చే ప్రయత్నం కూడా ప్రభుత్వం చేస్తోంది. మిగులు భూముల పంపకం, వివిధ పేదరిక నిర్మూలన పథకాలు, విద్య, ఆరోగ్యం, ఆహారం, ఉపాధి లాంటి ముఖ్యావసరాలు తీర్చే పథకాలు పబ్లిక్ రంగంలో సంక్షేమ పథకాల పేరిట ప్రవేశపెట్టింది. కాని వీటిని పరిశీలించి చూస్తే ఇవి అమలులో వైఫల్యం చెందుతూనే ఉన్నాయి. తిరిగి కొత్త పథకాలు ప్రవేశపెట్టడం, అవి తిరిగి వైఫల్యం చెందడం మళ్లీ మళ్లీ జరుగుతూనే ఉన్నాయి. లంచగొండితనం పెరిగిపోయిందని, మనుషుల ఆలోచనా విధానం మారాలి అనే సమాధానాలు కూడా వచ్చాయి. ఈ క్రమంలో తమ శక్తి మీద కాక ప్రభుత్వం ఇచ్చే సహాయం మీద ఆధారపడే జన సమూహం (వీరినే దారిద్ర్య రేఖ దిగువన ఉండే మనుషులు అని కూడా అంటారు) పెరిగిపోయింది. సహజంగానే దీనికి ఖర్చు కూడా పెరిగిపోయి తడిసి మోపెడయినట్లు సమాజపు ఆర్థిక శక్తి మీద ప్రభావం చూపి మోయలేని భారంగా పెరిగిపోయింది. మరొక పక్క మిగతా సమాజానికి ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యం ద్వారా ఐదు నక్షత్రాల ఆస్పత్రులు, కార్పొరేట్ విద్యా సంస్థలు, రవాణా సౌకర్యాలు మొదలైన మౌలిక సదుపాయాలు సమకూర్చే పథకాలు ప్రవేశపెట్టారు. ఈ మెరుగైన మౌలిక సదుపాయాల కారణంగా పెట్టుబడి రాకకు ఎటువంటి అంతరాయాలు ఉండకపోవడంతో అభివృద్ధి జరిగిపోతుందనే నమూనా దీనికి మూలం. ఒక పక్క అధిక పెట్టుబడితో దేశమంతటా సెజ్‌లు తయారైపోతూ ఉంటే, మరొక పక్క సేవారంగం, ముఖ్యంగా అంతర్జాతీయ సంబంధాలు కలిగిన ఐ.టి. రంగం పెరిగిపోవడంతో మన ఆర్థిక వ్యవస్థను మార్కెట్ ఆధారిత వ్యవస్థగా మార్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

దేశంలోని రాష్ట్రాలలో పరిశ్రమలకు వ్యతిరేకంగా హింసా పరంపర కొనసాగిన రాష్ట్రంగా పశ్చిమ బెంగాల్‌ను చెప్పుకోవచ్చును. గత 32 సంవత్సరాలలో అంటే సి.పి.ఎం. పశ్చిమ బెంగాల్‌లో అధికారానికి వచ్చిన తరువాత, తమ భావజాలానికి అనుగుణంగా ఎంచుకున్న అభివృద్ధి పథానికి ఒక విశిష్టత ఉంది. కేంద్రం ఎంచుకున్న నమూనా కంటే విరుద్ధంగా, అంటే భారీ పరిశ్రమల మీద కేంద్రీకృతం చెయ్యకుండా వ్యవసాయరంగం మీద కేంద్రీకరించింది. గత 32 సంవత్సరాలుగా ఏకధాటిన ఒకేపార్టీ అధికారంలో ఉన్న ఘతన ఒక్క బెంగాల్‌దే. ఆ ఘనత సి.పి.ఎం.కే చెందుతుంది. భూసంస్కరణలు అంటే కౌలుదారీ చట్టం, కౌలుదారుకి రక్షణ, కౌలు పరిమితిని నిర్దేశించడం లాంటి ఎన్నో సంస్కరణల ద్వారా అభివృద్ధి సాధించి ఒక ప్రత్యేకతని సంతరించుకుంది. ప్రజలలో భద్రతా భావం కలిగించింది. సి.పి.ఎం. గత 30 సంవత్సరాలుగా రాష్ట్రంలో నిరంతరాయంగా అధికారంలో నిలదొక్కుకోవడం వారు ఎంచుకున్న అభివృద్ధి పథానికి ప్రజామోదం ఉందనే విషయంగా గమనించవచ్చును.

కొంత అభివృద్ధి, కొన్ని ఫలితాలు సాధించడంతో ప్రభుత్వ ఆలోచనలో వ్యవసాయరంగంలో చేయవలసిన కార్యక్రమాలన్నీ చేసివేసామని, ఇంక చేయవలసినవి లేవని, ఇంక పరిశ్రమల మీద కేంద్రీకరించవలసిన అవసరం ఉందని భావించింది. ఈ కారణంగా సింగూరులో టాటా వారి కార్ల కంపెనీని, ఇంకా కొన్ని సెజ్‌లను తమ రాష్ట్రానికి ఆహ్వానించి వారికి కావలసిన భూసేకరణ ప్రక్రియని ప్రారంభించింది.

ఈ క్రమంలో వ్యవసాయ భూములను పరిశ్రమల కనుగుణమైన భూములుగా మార్చివేయడం, అక్కడి ప్రజల మనుగడే అధ్వాన్నమైపోయి మిగులు మనుషులు పెరిగిపోవడంతో స్థానిక ప్రజల వ్యతిరేకత మొదలయింది. ప్రభుత్వం అణిచివేత ప్రయత్నాలు చేయడంతో హింసా పరంపర మొదలయింది. ప్రభుత్వం కొత్తగా ఎంచుకున్న నూతన ఆర్థిక విధానాలకు, అంటే వ్యవసాయరంగం నుండి పరిశ్రమల కేంద్రంగా మారిన ఆర్థిక విధానాలకు, ప్రజామోదం లేదేమో అనే అనుమానం రావచ్చును. గత రెండేళ్లలో జరిగిన ఎన్నికలలో, అది పంచాయితీ ఎన్నికలవవచ్చును, లోక్‌సభ ఎన్నికలవవచ్చును, మొన్ననే జరిగిన మునిసిపల్ ఎన్నికలవవచ్చును, సి.పి.ఎం.కి ఎదురైన ఘోర పరాజయం ఈ అనుమానాన్ని ధృవపరుస్తుంది.

పత్రికలలో వచ్చిన వార్తల ప్రకారం సి.పి.ఎం. తమ ఓటమికి కారణాలు గ్రహించుకునే ప్రయత్నంలో భాగంగా జరిపిన అంతర్గత కార్యవర్గ సమావేశంలో వచ్చిన వ్యాఖ్యలు గమనించదగ్గవి. తమ వామపక్ష కూటమి చేపట్టిన అభివృద్ధి పథకాల గురించి పునరాలోచన చేసుకోవలసిన అవసరం ఉందని ఒక వ్యాఖ్య. ఇంకా మరికొన్ని కారణాలతో మమతా బెనర్జీ, ఆమె రూపొందించిన తృణమూల్ కాంగ్రెస్ క్రమంగా బలం పుంజుకుంటోందని ఒకరంటే, ఆ పార్టీ వెనుక మావోయిస్టుల బలం ఉందని మరొక ఊహ కూడా ఉంది. ఏది ఏమైనా 30 సంవత్సరాలుగా ఏకచ్ఛత్రాధిపత్యంగా బెంగాల్‌ని ఏలిన సి.పి.ఎం. అధికారానికి బీటలు వారిపోయి, గత రెండు సంవత్సరాలుగా వరుసగా పరాజయం పాలవడం గమనిస్తే, సి.పి.ఎం. కొత్తగా ఎంచుకున్న అభివృద్ధి క్రమానికి ప్రజామోదం లేదని, అంటే ఇంకా మిగులు మనుషుల సమస్యలు తీరలేదని, వ్యవసాయరంగంలోనే ఇంకా చేయవలసిన కార్యక్రమాలు ఉండిపోయాయని అనుకోవచ్చును. గత 15 సంవత్సరాలుగా తృణమూల్ కాంగ్రెస్, 30 సంవత్సరాలుగా నక్సలైటు ప్రాబల్యాలు పెరగడంతో, మారిన ఆర్థిక విధానాల కారణంగా వ్యవసాయ రంగం నుండి హింస మొదలయి పరాకాష్టకి చేరుకోవడంతో టాటా కంపెనీ బెంగాల్ నుండి గుజరాత్‌కి తరలించబడింది.

మనం ఆంధ్రప్రదేశ్‌ని చూస్తే కేంద్రం అనుసరిస్తున్న అభివృద్ధి నమూనానే, అంటే పెట్టుబడి కేంద్రంగా సమాజాన్ని మార్చే క్రమం, మన రాష్ట్రం కూడా అనుసరిస్తోంది. ఈ క్రమం చంద్రబాబు నాయుడి హయాంలో చాలా స్పష్టంగా కనబడి ఒక పతాక స్థితికి చేరుకుంది. ఐ.టి. రంగం పెరుగుదల, దానికి కావలసిన మౌలిక సదుపాయాలు సమకూర్చడంలో దేశంలోని అన్ని రాష్ట్రాలకు మార్గదర్శకంగా పొగడబడింది. కాని గత ఎన్నికలలో చంద్రబాబు ఓటమితో ఈ అభివృద్ధి మార్గాన్ని ప్రజలు తిరస్కరించినట్లుగా భావించి, ఎన్నికలలో అధికారం సంపాదించిన కాంగ్రెస్ పార్టీ తిరిగి వ్యవసాయరంగం మీద దృష్టి సారించవలసిన అవసరం ఏర్పడింది. పేద ప్రజల అవసరాలు తీరేటట్లు

రు. 2 కిలో బియ్యం, పావలా వడ్డీ, స్వయం సహాయక బృందాలకు ధన సహాయం, జలయజ్ఞం, ఆరోగ్యశ్రీ పథకం, వృద్ధులకు సామాజిక పింఛను లాంటి సంక్షేమ పథకాలు అమలులోకి వచ్చాయి. దేశంలోనే కాదు ప్రపంచం అంతటా కూడా పేద ప్రజలకి ఉండవలసిన ఆహార భద్రత గుర్తించడం, ప్లానింగ్ కమిషన్ కూడా వ్యవసాయరంగం వృద్ధి భవిష్యత్తులో నాలుగు శాతం ఉండేటట్లుగా కొత్త నమూనా తయారు చేసే ప్రయత్నాలు చేయడం జరుగుతోంది.

ఇక్కడ గుర్తించవలసినది మన దేశంలో అరవై సంవత్సరాలుగా పెట్టుబడి కేంద్రంగా అభివృద్ధి పథకాలు అమలు చేసినప్పటికీ, పేదరికం, నిరుద్యోగం, అనారోగ్యం, అవిద్య లాంటి మౌలిక సమస్యలు అలాగే ఉండిపోయాయని, వీటికి సమాధానం దొరకలేదని అనడానికి పెరుగుతున్న మిగులు మనుష్యులు, పెరుగుతున్న హింసా పరంపర సాక్షులుగా మిగిలిపోయాయి.

## రెండు భిన్న దృక్పథాల మధ్య పోటీ

సమాజం మారుతోన్న క్రమంలో అనేక చోట్ల అనేక సమయాలలో పునరావృతమవుతున్న హింసా పరంపరని హింస - ప్రతిహింసల రూపంలో చూస్తే దాని నివారణోపాయాలు కనిపించవు. ఎవరిది పై చెయ్యో ప్రత్యర్థుల బలాబలాల మీద ఆధారపడుతుందని అనిపిస్తుంది. అలా కాకుండా ఈ హింసకి మూలం ఏమిటి అని ఆలోచిస్తే సమాజ గమనం మీద కొంత అవగాహన రావచ్చును. ఇలా చూడాలి అంటే సమాజ గమ్యం మీద అవగాహన (దీనినే విజన్ అనుకోవచ్చును) దానిని చేరే గమనం మీద అవగాహన (దీనినే మెథడ్ అనుకోవచ్చును) కావలసి వస్తుంది. గమ్యం మీద అవగాహన ఆలోచనా పరిధికి సంబంధించిన దయితే, గమనం మీద అవగాహన కార్యాచరణకి సంబంధించినదిగా గుర్తించవచ్చును.

కొత్త సమాజాన్ని నిర్మించదలచుకున్న క్రమంలో ఎటువంటి సమాజం కావాలో దాని మీద అవగాహన ఉండవలసిన అవసరం ఉంది. ఈ గమ్యం మీద అవగాహననే విజన్ అనుకోవచ్చును. ఈ భవిష్యత్తు ఊహాచిత్రమే ప్రస్తుత సమాజంలో ఎటువంటి మార్పులు అవసరమో గుర్తిస్తుంది. ఈ మార్పులు వాస్తవరూపంలో ఎలా సాధ్యమవుతాయో సమాజం ఎంచుకునే మార్గం, పరికరాలు, పథకాలే మెథడ్ అనుకోవచ్చును. అంటే ఇది గమనం మీద అవగాహనకి సంబంధించినది. మన దేశ ఆర్థిక చరిత్రని పరిశీలించితే, సోషలిస్టు సమాజం నిర్మించాలనే విజన్‌తో భారీ పెట్టుబడిని సాధనంగా తీసుకుని డ్యాంలు కట్టడం, పరిశ్రమలు పెట్టడం లాంటి కార్యక్రమాలు ప్రభుత్వం చేపట్టింది. అర్ధ శతాబ్ది గడిచిన తరువాత కూడ పేదరికం, నిరుద్యోగం లాంటి ముఖ్య సమస్యలు సమసిపోక పోగా, సమాజంలో హింస అంతర్భాగమైపోయింది. పెట్టుబడి ద్వారా భారీ పరిశ్రమలు పెట్టాలంటే భూములు, దానికి శక్తిమంతమైన భూసేకరణ చట్టం కావాలి. ప్రజలు దీనికి వ్యతిరేకంగా ఉద్యమిస్తే అణచివేతకి పోలీసులు కావాలి. పునరావాస విధానాలు కావాలి. కానీ ఇంతవరకు సంతృప్తికరంగా ఉండే పాలసీ రాలేకపోయింది. సరికదా, నిర్వాసితుల సమస్యలు పెరిగి పోయాయి. ఇవేకాక కార్మిక చట్టాలు, రవాణా సౌకర్యాలు, చక్కని మౌలిక సౌకర్యాలు కావాలి. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో ఉంటాయి. అంటే కొత్త సమాజం గురించిన అవగాహన క్రమంగా పెట్టుబడి నిరాటంకంగా రావడానికి, అది సమర్థవంతంగా పని చేయడానికి కావలసిన సౌకర్యాలు సమకూర్చడంగా మారి సమాజం విజన్ పెట్టుబడికి చెందిన విజన్‌గా మారిపోయింది. ఈ అభివృద్ధి క్రమం కేంద్ర ప్రభుత్వం పబ్లిక్ రంగంలో పెట్టుబడి ద్వారా సాధించే ప్రయత్నం చేసి అది అనుకున్న ఫలితాలు సాధించలేకపోవడంతో, ప్రైవేట్ పెట్టుబడిని ఆహ్వానించడంతో విజన్ రంగు మారిపోయింది. ఇది పెట్టుబడి సాధనంగా కొత్త సమాజాన్ని నిర్మించే క్రమం.

ఈ క్రమం జరుగుతున్న సమయంలోనే బెంగాల్ లాంటి రాష్ట్రాలలో పై పద్ధతికి భిన్నంగా సి.పి.ఎం. మరొక మార్గం ఎంచుకుంది. ముఖ్యంగా వ్యవసాయరంగం మీద కేంద్రీకరించడంతో రైతాంగానికి కొంత వెసులుబాటు దొరికింది. ఈ అభివృద్ధి మార్గాన్ని పెట్టుబడి కేంద్రంగా కాకుండా శ్రమ కేంద్రంగా కొత్త సమాజాన్ని నిర్మించే ప్రయత్నాలుగా చూడవచ్చును. ఇటువంటి మార్గం రూపొందించిన నాయకులలో కొందరు రాష్ట్రానికి ముఖ్యమంత్రులయ్యారు. కొందరు ఎం.ఎల్.ఎ.లు, ఎం.పి.లు అయ్యారు. వీరంతా కూడా ఒక కాలంలో హింసతో కూడిన ఉద్యమాలు చేసినవారే. తాము అధికారంలో ఉన్న రాష్ట్రాలలో శ్రమ కేంద్రంగా కొత్త సమాజ నిర్మాణ ప్రయత్నాలు చేశారు. కాలక్రమంలో సి.పి.ఎం. చీలిపోయింది. చివరికి మావోయిస్టుల దాకా ఇదే పద్ధతిని అనుసరిస్తున్నారని అనుకోవచ్చును. తమ పద్ధతికి, కేంద్ర ప్రభుత్వం అనుసరించే పద్ధతికి విభేదం ఉండడంతో తాము బలంగా ఉన్న చోట్ల హింస ద్వారా తమ విముఖతని తెలియజేస్తున్నారు. వీరు తమ పద్ధతికి అడ్డుతగులుతున్నారని, అభివృద్ధికి ఆటంకం కలిగిస్తున్నారని చెపుతూ ప్రభుత్వం హింస ద్వారా అణచివేసే ప్రయత్నాలు చేస్తోంది. ఒక సమయంలో హింస తారాస్థాయికి చేరుకోవడంతో ఇరుపక్షాలు చర్చలు ప్రారంభించడం, సమస్యకి సమాధానం దొరకకపోవడంతో హింస పునరావృతం అవుతూ ఉండడం జరుగుతోంది. ఈ హింస ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో ఆగినట్లు కనిపించినా, ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, బీహార్, ఒడిషాలలో పునరావృతమౌతూనే ఉంది.

శ్రమనే కేంద్రంగా ప్రతిపాదించిన మార్క్సును అనుసరించిన అప్పటి సి.పి.ఎం. దగ్గర నుండి అనుసరిస్తున్న ఇప్పటి మావోయిస్టుల వరకు కొత్త సమాజ నిర్మాణం శ్రమ ద్వారానే సాధ్యం అనే భావన దీనికి మూలం. వీరి ప్రభావం అధికంగా ఉన్న ప్రాంతాలలో భూములు పంచడం, కొత్త పంటలు పండించడం నేర్పారు. కొత్త సంస్కృతి, కొత్త జీవన విధానాన్ని నేర్పారు. తమకు అందుబాటులో ఉన్న మానవ శ్రమని ఉపయోగించుకొని చిన్న డ్యాం కట్టారు. స్థూపాలు కట్టారు. విద్య నేర్పారు. స్థానిక ప్రజల అనారోగ్యాలకు మందులు ఇచ్చారు. అంటే మనిషి చేసే శ్రమ ద్వారా ఆ మనిషికో గుర్తింపు, సమాజానికో అభివృద్ధి మార్గం ఎంచుకున్నారు. ప్రజా గాయకుడుగా పేరు పొందిన గద్దర్ పాడే పాట 'ఊరు మనదిరా, ఈ వాడ మనదిరా... ప్రతి పనికి మనంరా... చావు కాడ మనమే సన్నాయి కాడ మనమే...' ఉదాహరణగా పనికివస్తుంది. ఈ పాటలో అర్థం ఈ ప్రదేశంలో ఉన్న భూమి, నీరు, గాలి, వెలుతురు, అడవి మొదలైన వనరులన్నీ మావే. ఇక్కడ పరికరాలన్నీ మావే. మా శ్రమతోనే మా మనుగడ సాధించగలం అనే ఆత్మస్థైర్యం కనిపిస్తుంది. శ్రమ కేంద్రంగా సమాజాన్ని మార్చుకోగలం అనే ధీమా కనిపిస్తుంది.

పై రెండు పద్ధతులను తైపారు వేసి చూస్తే, అప్పటి సమాజం మారాలి అనే ధ్యేయం ఒక్కటే అయినా, ఆ గమ్యం మీద అవగాహన

అంటే ఎటువంటి కొత్త సమాజం కావాలి అనే ఊహలో భిన్నత్వం ఉండడం మూలాన, గమన మార్గాలు వేరయిపోయాయి. ఒకటి పెట్టుబడి ద్వారా కొత్త సమాజం సాధ్యమనుకుంటే, రెండవది శ్రమ ద్వారా కొత్త సమాజం సాధ్యమనుకుంది. కొత్త సమాజం గురించిన గమ్యం, గమనం మీద అవగాహన వేరవడంతో వీటి మధ్యన ఘర్షణ తప్పదు. పర్యవసానంగా సమాజంలో అంతర్లీనంగా హింస చెలరేగుతూ ఉంటుంది. దీని ఫలితంగా దేశానికి ఆర్థిక సంక్షోభంతో పాటు సామాజిక సంక్షోభం కూడా వస్తూనే ఉంటుంది. ఇది మన దేశంలోనే కాదు మూడవ ప్రపంచ దేశాలుగా పిలువబడే పేద దేశాలలో అంతర్జాతీయ పెట్టుబడి ప్రవేశం, దాని ద్వారా ఒక కొత్త సమాజ రూపకల్పన జరుగుతుందని అనుకోవడం. ఈ పరిణామం జరుగకపోవడంతో అంతర్జాతీయంగా కూడా ప్రపంచ దేశాలు, సంక్షోభంలో పడిపోయాయి. ఈ సంక్షోభం మీద కొంత సైద్ధాంతిక చర్చ కూడా రేగింది.

అంతర్జాతీయ ఆర్థిక నిపుణులు అభివృద్ధి అంటే వ్యవస్థలో మార్పు ద్వారా గుర్తించినప్పటికీ, పేద దేశాల అభివృద్ధి పెట్టుబడి ద్వారానే సాధ్యమనే నమూనాతో విభేదించకుండా, గమన మార్గాలలో దేశానికి, దేశానికి తేడాలు ఉండవచ్చునని చర్చకి ఒక ముగింపునిచ్చారు. నోబెల్ బహుమతి గ్రహీత స్టిగ్‌లిజ్ పేదదేశాల గమన మార్గాల మీద చాలా చర్చించి, చివరికి ఏ దేశానికి అనుగుణమైన పద్ధతులు ఆ దేశం ఎంచుకోవచ్చుననీ, కాని దానికి కావలసిన పెట్టుబడి అంతర్జాతీయ ద్రవ్యనిధి అందించడానికి సిద్ధంగా ఉందనీ సిద్ధాంతీకరించారు. కాని ఒక షరతు – అంటే, ఈ గమనానికి దానికి కావలసిన పరికరాలు, కార్యాచరణ పద్ధతులు ఆ దేశ ప్రజలే రూపొందించుకొని, వాటిని సొంతం చేసుకొని కలిసి కట్టుగా పని చేస్తేనే – అవి అనుకున్న ఫలితాలు సాధించగలవని అన్నారు. అప్పుడే గమనం సమాజంలో అంతర్భాగమై అభివృద్ధి సాధ్యమని ప్రతిపాదించారు.

వీటిని క్షుణ్ణంగా విశ్లేషించుకుంటే, పెట్టుబడి ద్వారా సమాజాన్ని అభివృద్ధి చేయాలంటే, పెట్టుబడి ప్రవేశానికి మార్గంలో ఉండే అవరోధాలు, అడ్డంకులు నిర్మూలించే క్రమంలో కొన్ని కార్యాచరణ పద్ధతులు వస్తాయి. అంటే పెట్టుబడి వలన వచ్చే విజయాలే సమాజ మార్పుకు సంకేతాలయి మార్కెట్ ఆధారిత వ్యవస్థ తయారు చెయ్యడమే గమ్యంగా మార్పు చెంది, పెట్టుబడి గమ్యమే సమాజ గమ్యంగా రూపాంతరం చెందుతుంది. ఎటువంటి సమాజం ఈ దేశ ప్రజలకి అవసరం అనే విషయానికి ప్రాముఖ్యత ఉండదు.

ఇక రెండో పద్ధతిలో శ్రమ ద్వారా సమాజంలో మార్పులు తెచ్చి అభివృద్ధి చేయాలంటే శ్రమ చేసే శ్రామికుల అవసరాలు, అంటే శ్రామికుల మనుగడ మీద గమ్యం నిర్ధారించబడుతుంది. శ్రామికుల మనుగడకి ఉండే అడ్డంకులు ఏమిటి? అవి ఎలా తొలగించడం? దేని వలన సమాజంలో అభివృద్ధి సాధ్యమనే అంచనా ఉంటుంది.

మొదటి పద్ధతిలో పెట్టుబడి గమ్యమే సమాజ గమ్యంగా మారిపోయి, పెట్టుబడికి ఉండే అంతరాయాలు తొలగించే క్రమంలో మిగిలిపోయిన మనుషులు తమ మనుగడకి ప్రభుత్వ దయాధర్మాల మీద ఆధారపడవలసి వస్తుంది. వీరు సమాజానికి మోయలేని భారంగానూ, అభివృద్ధికి అడ్డంకిగానూ కనిపిస్తారు. రెండవ పద్ధతిలో 'మిగులు' మనుషులు – శ్రామికులు తమ మనుగడకి తమ శక్తిమీదే ఆధారపడడమే కాకుండా, తమ మనుగడని మెరుగుపరుచుకునే క్రమంలో సమాజంలో అభివృద్ధికి కారకులవుతారు.

రెండవ పద్ధతిలో కార్యాచరణకి ఉదాహరణగా అరవై సంవత్సరాల భారత, చైనా చరిత్రని చూడవచ్చును. నెహ్రూ గారు భారీ వ్యయంతో కూడిన డ్యాంలు, కర్మాగారాలు – అంటే భారీ పెట్టుబడి – సమాజ మార్పుకి సాధనాలుగా ఎంచుకుంటే, చైనాలో మావో శ్రమ మీద కేంద్రీకరించి ఇంటింట ఇనుము తయారీ, బేర్ ఫుట్ డాక్టర్స్ (చెప్పులు లేని వైద్యులు – అంటే మామూలు మనుషులే వైద్యులు అని) ఎంచుకున్నాడు. ముందు చెప్పినట్లుగా మొదటి పద్ధతికి అవసరమైన పథకాలు సెజ్‌లు, ఫ్యాక్టరీలు అన్ని రంగాలలో అభివృద్ధికి అంటే అధికోత్పత్తికి అవసరమైన పథకాలు, వీటికి నీడలా వెన్నంటి ఉండే లంచగొండితనం నివారించే పద్ధతులు ఇలా ఎన్నో కావాలి. రెండో పద్ధతిలో మనిషి మనుగడకి కావలసిన తిండి, బట్ట, ఇల్లు, ఆచరణకి అవసరమైన విద్య, శ్రమ చేయడానికి కావలసిన ఆరోగ్యం, అనారోగ్యం వస్తే మందులు వీటికి పథకాలు కావాలి.

ప్రస్తుత సమాజాన్ని అభివృద్ధి చేసే ధ్యేయంతో భిన్నమైన రెండు శక్తులు పోటీపడుతున్నాయని, వాటికి గమ్యం మీద ఉండే అవగాహన వేరని, అందుచేత గమనానికి సంబంధించిన పథకాలు కూడా వేరుగానే ఉంటాయని అనుకోవాలి.

## గమ్య గమన సంబంధం – ప్రభుత్వ ఆలోచనా రీతి

అరుంధతీరాయ్ ముంబాయిలో సిపిడిఆర్ సమావేశంలో వెలిబుచ్చిన అభిప్రాయాలను మరొకసారి చూద్దాం. ఒకటి, మావోయిస్టులకు విప్లవాత్మక గమనం గురించిన అవగాహన ఉంది కాని విప్లవాత్మక గమ్యం గురించిన అవగాహన లేదు అనేది. వీరి మైనింగ్ పాలసీ ప్రభుత్వ మైనింగ్ పాలసీ కంటే భిన్నమైనది కాదని, బాక్సైట్ ఖనిజాన్ని అక్కడే వదిలివేయాలి అనేది రెండవది. ఇవి వార్తా పత్రికలలో వచ్చిన వార్తలు.

గమ్య, గమనాల సంబంధం చూస్తే, విప్లవాత్మక గమ్యం మీద అవగాహన లేకుండానే విప్లవాత్మక గమనం ఉండగలదని అనుకోవలసి వస్తుంది. ఇది అసందర్భంగా కనిపిస్తుంది. ఒక సమాజ భవిష్యత్తులో చేరవలసిన గమ్యం మీద సుస్పష్టమైన అవగాహన ఉండడం కష్టతరమైనా, చూచాయగానైనా దాని ఊహాచిత్రం, దాని రూపురేఖలు, దానిలోని వివరాల మీద అవగాహన ఉండడం అత్యవసరం. అలా ఉన్నప్పుడే ఆ గమ్యాన్ని చేరడానికి అవసరమైన గమన మార్గాలూ, ఆచరించవలసిన విధానాలూ తయారవుతాయి. ఈ గమన మార్గాలు ఒకటి కంటే ఎక్కువ గానే ఉండవచ్చును. వాటి సాధ్యాసాధ్యాలు ఆచరణలో పరిశీలించుకునే క్రమంలో ఒక మార్గం మేలైనదిగా కనిపిస్తుంది. అపుడే చేరవలసిన గమ్యానికి, అనుసరించే గమనానికి ఒక సంబంధం ఏర్పడి సమాజంలో మార్పులు సాధ్యమవుతాయి. వర్తమాన గమనం మీద అవగాహన భవిష్యత్తు గమ్యంమీదే ఆధారపడుతుంది. గమ్యంలేని గమనం సమాజాన్ని అంధకారంలో పడవేసి సంక్షోభాన్ని కలిగిస్తుంది. అందుచేత గమ్యానికి, గమనానికి విడదీయరాని సంబంధం ఉంటుందని అనుకోవాలి.

పెట్టుబడి సహాయంతో నిర్మించగలిగే సమాజానికి పెట్టుబడి ధ్యేయమే తన ధ్యేయంగా ఎంచుకోవడంలో ఎటువంటి కొత్త సమాజం కావాలి అనే అవగాహన కొరవడుతుంది. శ్రమ సహాయంతో కొత్త సమాజం అంటే, శ్రామికుడి మనుగడకి ఉండే అడ్డంకులను తొలగించుకునే క్రమంలో శ్రామికుడి మనుగడ మెరుగుపడగల ఒక కొత్త సమాజం గమ్యంగా ఉంటుంది. గత అరవై సంవత్సరాలలో

ప్రభుత్వం పెట్టుబడి సాధనంగా సమాజాన్ని మార్చే ప్రయత్నాలు చేస్తున్నప్పటికీ, కొన్ని కోట్ల రూపాయల పెట్టుబడి పెట్టిన తరువాత కూడా నిరుద్యోగం, పేదరికం పెరుగుతూనే ఉన్నాయి. అంటే ప్రభుత్వ పెట్టుబడి గమ్యం దానికి కావలసిన గమనం ద్వారా కంటే, సమాజానికి కావలసిన గమ్యంని గురించి అవగాహన, దానికి కావలసి వచ్చే గమనం గురించిన అవగాహనలను పునరాలోచించుకోవలసి ఉందేమో.

అలాగే శ్రమ ద్వారా కొత్త నిర్మాణానికి కూడా ఎన్నో అడ్డంకులు ఉంటాయి. అంటే శ్రమ కేంద్రంగా తీసుకుని నిర్మించుకునే సమాజం ఎలా ఉండాలి, దాని రూపు రేఖలేమిటి? భవిష్యత్తులో ఆ గమ్యం చేరడానికి వర్తమానంలో ఎంచుకోవలసిన సాధనాల మీద అవగాహన ఉండడం. దానిని ఆచరణలో పరీక్షించుకొని అవసరమైతే సవరించు కోవడం ఉంటేనే ఆలోచనకి, ఆచరణకి, అంటే చేరవలసిన గమ్యానికి దానికవసరమైన గమనానికి సమన్వయం కుదురుతుంది. ఈ పద్ధతిని అనుసరించే మావోయిస్టుల ఆలోచన, ఆచరణల అవగాహన గురించి మనకు వార్తా పత్రికలలో వచ్చే సమాచారమే ఆధారం. ఇక్కడ హింస – ప్రతిహింసల వివరాలు మాత్రమే దొరకడంతో మన అవగాహన అసంపూర్ణంగానే ఉండిపోతుంది.

ఇంక మైనింగ్ పాలసీ ప్రభుత్వానిది, మావోయిస్టులది భిన్నంగా లేవనే వ్యాఖ్య. పాలసీలు అనేవి ఎలాంటివి, ఎప్పుడు వస్తాయనే విషయం. కొన్ని లక్షల, వేల వస్తువులు ప్రకృతిలో భాగంగా, అంటే నేలలోనూ, నీటిలోనూ, గాలిలోనూ, కొండలలోనూ, అడవులలోనూ నిక్షిప్తంగా ఉంటాయి. నిక్షిప్తంగా అంటే వాటి గురించిన వివరాలు, ఉపయోగాలు సమాజ చైతన్యంలో భాగం కావు. వీటి గురించిన జ్ఞానం మానవాళికి లేనంత వరకూ అవి తమకు తామే, ప్రకృతిలో భాగంగానే ఉండి పోతాయి. కాలక్రమంలో ఒక వస్తువు గురించిన జ్ఞానం, అది మనిషి మనుగడ మెరుగు పడడానికి ఉపయోగపడే విధంగా మానవ మేధస్సులో భాగం అయినపుడు, ఆ వస్తువు తనకు తానుగా ఉండిపోక, మనుషుల కోసం వారి అవసరాల కోసం సమాజ చైతన్యంలో భాగమయిపోతుంది. మనిషి ఆ వస్తువును జాగ్రత్తగా రక్షించుకోవడం, మితంగా వాడుకోవడం, అవసరమైన పనులకే వాడుకోవడం జరుగుతుంది.

పెట్టుబడి ద్వారా సమాజంలో మార్పులు తేవాలి అనుకున్నప్పుడు ఆ ఖనిజ సంపద మీద జ్ఞానం ఉన్న పెట్టుబడిదారుల ఉపయోగాలు తీర్చే విధంగా మైనింగ్ పాలసీలు వస్తాయి. ఎక్కడ ఖనిజాలు ఉంటాయో అక్కడికి పెట్టుబడి చేరడానికి కావలసిన రోడ్లు, రైల్వే లైన్లు వస్తాయి. కావలసిన మౌలిక సదుపాయాలు – నీరు, విద్యుత్తు, కార్మిక చట్టాలు, మైనింగ్ లీజుకి సంబంధించి పాలసీలు ఎన్నో వస్తాయి. రైలు మార్గం ఇలా వచ్చిందే. విశాఖపట్నం చుట్టూ కంఠహారంలా మెరిసే రవాణా సౌకర్యాలు దీనిలో భాగమే. ప్రస్తుతం వస్తున్న సెజ్‌లు, అంతర్జాతీయ విమానాశ్రయాలు, త్వరితగతిలో రవాణా సాధ్యపడే రోడ్లు అందులో భాగమే. ఈ క్రమంలో మనుషుల శ్రమ, వారి మనుగడకి చెందిన పాలసీలకు తావుండదు. ఖనిజాన్ని గురించిన జ్ఞానం, దానిని ఉపయోగించుకునే సామర్థ్యం సమాజానికి లేనంతవరకూ ఈ ఖనిజాలు కొండలలోనే ఉండిపోతాయి. ప్రకృతిలో భాగంగానే ఉండిపోతాయి. అలా ఉండిపోయినా నష్టం లేదు. వీటి గురించిన జ్ఞానం సమాజానికి వచ్చిన తరువాత ఆ జ్ఞానాన్ని వాడుకునే విధంగానే మైనింగ్ పాలసీ వస్తుంది.

ఇలా అనుకుంటే సమాజం / ప్రజలు అంటే ఏమిటి – అనే ప్రశ్న కూడా నీడలా వెన్నంటి వస్తుంది. ఆ ఖనిజాలు ఉన్న కొండల చుట్టూ ఉన్న స్థానిక ప్రజలా, లేక ఆ కొండలు ఏ రాష్ట్రంలో భాగం అయితే ఆ రాష్ట్ర ప్రజలా? లేక ఆ కొండలు ఏ దేశంలో భాగమయితే ఆ దేశ ప్రజలా? అలా కాకపోతే ఆ కొండలు ఏ ప్రపంచంలో భాగమయితే ఆ ప్రపంచ ప్రజలా? – వసుధైక కుటుంబంలా – అనేది బలాబలాల సమస్యగా మారిపోతుంది.

ఉదాహరణకి ఒడిషాలో ఆదివాసీ ప్రాంతంలో ఉన్న బాక్సైట్ ఖనిజం ఎవరిది? దానిని ఉపయోగించుకునే హక్కు అక్కడి ప్రకృతిలో భాగమైన స్థానిక ప్రజలదా, లేక ఆ జ్ఞానం, ఉపయోగం తెలిసిన విదేశీ పెట్టుబడిదారులదా? ఒకవేళ ఆ హక్కు అక్కడి ప్రజలదే అనుకుంటే, వారికి ఆ జ్ఞానం లేకపోతే, ఆ ఖనిజం ఆ కొండలలోనే ఉండిపోయినా నష్టం లేదు. అందుచేత, ఇక్కడ మైనింగ్ పాలసీ రావలసిన అవసరం కూడా లేదు. ఇక్కడ మనం గ్రహించవలసినది సమాజాన్ని మార్చడానికి ఎంచుకున్న మార్గం పెట్టుబడిది అయితే ఒకరకమైన పాలసీలు వస్తాయి, శ్రమ ద్వారా అనుకుంటే పై వాటికి భిన్నంగా మరొక రకమైన పాలసీలు వస్తాయి.

ఉదాహరణగా చెప్పుకోవాలంటే, మొదటి పద్ధతిలో భారీ యంత్రాలు, ఉన్నతమైన సాంకేతిక నిపుణతతో కూడిన పెట్టుబడికి శ్రామికుల అవసరం చాలా తక్కువగా ఉంటుంది. నిరుద్యోగం, పేదరికం నీడలా ఉండడంతో ప్రభుత్వం పేదరికానికి ముఖ్యకారణం అధిక జనాభా అని గుర్తించి, దానిని నియంత్రించే కుటుంబ నియంత్రణ లాంటి ఎన్నో పాలసీలు ప్రవేశపెట్టవలసి వస్తుంది. రెండవ పద్ధతి, దీనిని ఇప్పటికీ ఆదివాసీ సమాజాలలో చూస్తాం. కుటుంబంలోని సభ్యుల సంఖ్యని బట్టి ఆ కుటుంబం ఉపయోగించుకోగలిగిన వనరుల వినియోగం, సమకూర్చుకోగలిగిన వసతులు ఉంటాయి. అందుచేత ఇక్కడ కుటుంబ నియంత్రణ పాలసీ అవసరం ఉండదు.

ఈ సందర్భంలో ఇంతమంది చనిపోతున్నారు. ఇంకా చనిపోవడానికి సిద్ధపడుతున్నారు. ప్రభుత్వ అణచివేత ఉన్నా కూడా ఈ మార్గంలోనే పయనించడానికి సిద్ధపడుతున్నారు. ఇది ఎందుకు అవుతోంది అని ఆలోచించవలసిన అవసరం ఉంది. అలాగే ఇంత పెట్టుబడి పెట్టిన కొద్దీ లంచగొండితనం పెరిగిపోతోంది. పేదరికం తగ్గడం లేదు అంటే ఎందుకు ఇలా అవుతోంది అని కూడా ఆలోచించుకోవాలి. ఈ జరుగుతున్న చర్చని సమాజంలో మార్పుల కోసం సంఘర్షిస్తున్న రెండు విధానాల మీద కేంద్రీకరించకుండా, ఈ ఘర్షణ ఫలితంగా వచ్చిన హింస – ప్రతిహింసల మీద చర్చని కేంద్రీకరిస్తే చర్చించేందుకు ఏమీ ఉండదు. హింస ఎవరు చేసినా తప్పే అనడం తప్పు, ఈ హింసకి మూలం ఏమిటి అని ఆలోచించి, దాని మీద, అంటే రెండు పద్ధతుల మీద చర్చ జరుపవలసిన అవసరం ఉందేమో.

చర్చని సమాజానికే కావలసిన గమ్యం మీద, దానికవసరమైన గమనం మీద కేంద్రీకరించి చూడకపోతే, సమాజంలో హింస పునరావృతం అవుతూనే ఉంటుంది. వీటి మీద చర్చ చర్విత చర్వణంగా జరుగుతూనే ఉంటుంది. సమాజం వ్యవస్థాపరంగా, గుణాత్మకంగా మార్పు చెందదు. అరుంధతీరాయ్ తన ఉపన్యాసంలో లేవతీసిన అంశాలు చర్చని గుణాత్మకంగా మార్చివేయడానికి, అర్థవంతం చేయడానికి ఉపయోగపడతాయనే ఆశతో...

*(రచయిత సామాజిక పరిశోధకులు)*

*తెలంగాణ ప్రజా ఉద్యమాన్ని నడపడంలో, వ్యూహాలను రూపొందించుకోవడంలో వైఫల్యమే విద్యార్థుల, యువకుల ఆత్మహత్యలకు కారణమవుతోందని అంటున్నారు* **డా. జి. లచ్చయ్య**

# ఆత్మహత్యల్ని ఆపలేమా?

ఉప ఎన్నికలు జరిగిన జూలై చివరి వారంలో, ఎన్నికల ఫలితాలు వచ్చిన తర్వాత కూడా తెలంగాణలో విద్యార్థుల, యువకుల బలిదానాలు జరుగుతూనే ఉన్నాయి. నిజామాబాద్ అర్బన్‌లో పి.సి.సి. అధ్యక్షులు డి. శ్రీనివాస్ ఓడిపోతే మైసమ్మకు ఆత్మహత్య చేసుకుంటానని మొక్కుకున్న ఇషాన్‌రెడ్డి అన్నంత పని చేసాడు. ఇషాన్ రెడ్డి కుటుంబ సామాజిక నేపథ్యం, ఆర్థిక నేపథ్యం ఉన్నతంగానే ఉన్నాయి. చదువు కూడా పూర్తయి పై చదువుకై ఇతర దేశానికి వెళ్లాలనుకుంటున్న తరుణంలో ఈ సంఘటన చోటు చేసుకోవడం టి.ఆర్.ఎస్. అధినాయకునితో పాటు, మిగతా వారిని కూడా కంట తడి పెట్టించాయి. ఇలాంటి సంఘటనలే శ్రీకాంత్‌చారీ, యాదయ్య ఆత్మహత్యలు. ఇక నిజామాబాద్ జిల్లాలో ఉప ఎన్నికలు జరిగిన నెల రోజు కాలంలోనే నలుగురు చనిపోగా, ఇందులో ఇద్దరు కుటుంబ జీవనం గడుపుతున్న వారు కావడం గమనార్హం. చనిపోయిన వారందరు కూడా తెలంగాణను కాంక్షిస్తూ, డిమాండ్ చేస్తూ వివిధ రాజకీయ పార్టీల నాయకుల్ని దోషులుగా చిత్రీకరిస్తూ మరణ వాంగ్మూలం రాసి మరీ చనిపోతున్నారు.

ఈ మధ్యన మరికొంతమంది సెల్ టవర్స్‌ను ఎక్కి తెలంగాణ డిమాండ్‌తో ఉత్కంఠను రేకెత్తిండం, కె.సి.ఆర్. మాటతో వారు దిగి రావడం లాంటి సంఘటనలు, తెలంగాణ ఆకాంక్షల పట్ల యువకులు, విద్యార్థులు పెంపొందించుకున్న ఆశలు నెరవేరడం లేదనే ఆవేదనతో, నిరాశతో ఇలాంటి అకృత్యాలకు పాల్పడుతున్నట్లు దోహదమవుతోంది.

ప్రజా పోరాటాలు ఒక్క తెలంగాణకే పరిమితంగా లేవు. ఈరోజు ప్రజలు తమ న్యాయబద్ధమైన డిమాండ్లు నెరవేర్చుకోవడానికి, ప్రజాస్వామిక హక్కుల్ని కాపాడుకోవడానికి, పొందడానికి దాదాపు దేశ వ్యాప్తంగా పోరాటాలు చేస్తూనే ఉన్నారు. కాశ్మీర్‌లో జరుగుతున్న పోరాటాల్ని చూస్తూనే ఉన్నాం. నిన్నటి దాకా ప్రధానంగా పురుషులకే పరిమితమైన జమ్మూ-కాశ్మీర్ పోరాటంలో నేడు పిల్లలు, మహిళలు మిళిత మయ్యాయి. బహుశా ఈ పోరాటం ఇలాగే కొనసాగితే, కాశ్మీరు సమస్యకు త్వరలో పరిష్కారం లభించే అవకాశం ఉండవచ్చు. (ఇది అత్యాశే!). ఆడ, మగ తేడా లేకుండా చిన్న పిల్లలతో సహా ప్రభుత్వానికి వ్యతిరేకంగా అక్కడ పోరాటాలు జరుగుతున్నాయి.

అలాగే ఈశాన్య రాష్ట్రాల్లో ఉద్యమాలు జరుగుతున్నాయి. లాటిన్ అమెరికా దేశాల్లో, మొన్నటి దాకా శ్రీలంకలో ఎల్.టి.టి.ఇ. ఆధ్వర్యంలో జాతి విముక్తి పోరాటాలు జరిగాయి. ఈ పోరాటాల్లో ఏ ప్రాంతంలో కూడా ఒక్కరంటే ఒక్కరు పోరాటాల నేపథ్యంలో ఆత్మహత్యలు చేసుకోలేదు.

తెలంగాణ పోరాటానికి యాభై ఏండ్ల చరిత్ర ఉంది. 1940లో జరిగిన భూ పోరాటాలు, జమీందారీ వ్యతిరేక పోరాటాలు కావచ్చు, లేదా 1969 నాటి ఉద్యమం కావచ్చు. ఈ రెండు ఉద్యమాల్లో ప్రజలు వీరోచితంగా పోరాడారు. ప్రాణత్యాగాలు చేశారు. పాలకపక్షాల కాల్పుల్లో యువకులు, వ్యవసాయ కూలీలు చనిపోయారు. కాని ఏ ఒక్కరు ఆత్మహత్యలు చేసుకోలేదు. అలాగే గత నలభై సంవత్సరాలుగా మావోయిస్టు ఉద్యమాలు జరుగుతున్నాయి. ఉజ్వల భవిష్యత్తు గల విద్యార్థులు, మేధావులు ప్రాణాలను పణంగా పెడుతూ పోరాడుతున్నారు. కాని ఎవ్వరు కూడా నిరాశపడి ఆత్మహత్యలు చేసుకోలేదు.

రైతులు, చేనేత కార్మికులు, వివిధ వృత్తి కళాకారులు దేశవ్యాప్తంగా ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. విదర్భ తర్వాత అత్యధికంగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్న రాష్ట్రం ఆంధ్రప్రదేశే! వీరి ఆత్మహత్యలకు ఆర్థిక కారణాలున్నాయి. రాజకీయ దివాలాకోరుతనం ఉంది. అయితే ఈ మధ్యన రైతు ఆత్మహత్యలు కూడా తగ్గుముఖం పట్టాయి. కానీ, గత ఏడు నెలల

*తెలంగాణ ఆత్మహత్యలకు వ్యతిరేకంగా*

**సామూహిక ప్రతిజ్ఞ**

18 ఆగస్ట్ 2010, ఉ. 11 గంటలకు

*వీరోచిత పోరాటాలకు, సంఘటిత చైతన్యానికి మారుపేరుగా నిలిచిన తెలంగాణ గడ్డ మీద పుట్టినందుకు నేను ఎంతో గర్వ పడుతున్నాను. తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు డిమాండ్ నాలుగు కోట్ల మంది తెలంగాణ ప్రజల సమిష్టి స్వప్నమన్న సత్యాన్ని గుర్తిస్తున్నాను. ప్రజాస్వామిక పద్ధతుల్లో, రాజ్యాంగబద్ధంగా తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు స్వప్నం నిజమవుతుందని మనస్ఫూర్తిగా నమ్ముతున్నాను. తెలంగాణ ప్రజల ప్రజాస్వామిక ఉద్యమాన్ని అడ్డుకునేందుకు అణచివేసేందుకు ఎన్ని ప్రయత్నాలు జరిగినా ఎలాంటి మానసిక ఒత్తిడికి లోనుకాకుండా, ఆందోళనతో నిరాశ చెందకుండా, భయంతో బలహీనపడకుండా, నిస్పృహలకు లోనుకాకుండా, గుండె నిబ్బరంతో ఉద్యమానికి అండగా నిలబడతానని ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఆత్మహత్యల కారణంగా తెలంగాణ ఉద్యమం నిర్వీర్యమవుతున్నందువల్ల, తెలంగాణ రాష్ట్ర భవిష్యత్తు పునర్నిర్మాణంలో మనవంతు పాత్రను పోషించవలసి ఉన్నందున, ఇక ముందు ఏ ఒక్కరూ ఆత్మహత్యకు పాల్పడవద్దని, నేనుగానీ... నాకు తెలిసిన మరెవ్వరు గానీ ఆత్మహత్య చేసుకోకుండా చూస్తానని నా మనస్సాక్షిగా, 'తెలంగాణ తల్లి' సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను.*

*– తెలంగాణ ఆత్మహత్యల నిరోధక కమిటీ, తెలంగాణ జె.ఎ.సి., తెలంగాణ విద్యార్థి సంఘాల జె.ఎ.సి.*

కాలంలో తెలంగాణలో విద్యార్థులు, యువకులు ఆత్మహత్యలు చేసుకుంటూనే ఉన్నారు. ఈ సంఖ్య దాదాపుగా నాలుగు వందలకు చేరింది. ఇది ఇక్కడితో ఆగుతుందనే గ్యారంటీ ఏమీ లేదు. ఇషాన్ రెడ్డి ఆత్మహత్య చివరిది కావాలని కె.సి.ఆర్.తో సహా అందరూ అనుకున్నారు. కాని ఆ తర్వాత కూడా పది మందికి పైగా విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకున్నారు.

ఈ విపత్కర స్థితి ఎటు దారితీస్తుందోనని ప్రజాసంఘాల, విద్యార్థి జె.ఎ.సి.లు ఆగస్ట్ 18న అన్ని క్యాంపస్‌లలో, విద్యా సంస్థలలో విద్యార్థులచే 'ఆత్మహత్య చేసుకోమ'ని ప్రతిజ్ఞను చేయించాయి. ఆత్మహత్యల వ్యతిరేక కమిటీలు కూడా ఏర్పాటైనవి. ఈ ప్రతిజ్ఞలు, ఈ కమిటీలు విద్యార్థుల ఆత్మహత్యలను నిలుపుదల చేస్తాయనే నమ్మకం ఎవరికి లేకపోయినా, ఇలాంటి చేతులు దులుపుకునే కార్యక్రమాలు జరుగుతూనే ఉన్నాయి. దీనికి ఒక రాజకీయ పార్టీ పాలకపక్షాన్ని విమర్శిస్తే, పాలకపక్షం కె.సి.ఆర్. ఒంటెత్తు పోకడలే కారణమని ప్రత్యారోపణ చేస్తున్నది.

తెలంగాణ తెచ్చేది, ఇచ్చేది కాంగ్రెసేనని ఇంకా తెలంగాణ బిడ్డల్ని కాంగ్రెస్ నమ్మించ చూస్తున్నది. తెచ్చేది, ఇచ్చేది వారే అయితే వారిని ఎవరడ్డుకుంటున్నారో వారికే తెలియదు. మొదటి నుంచి మోసాల పుట్ట అయిన కాంగ్రెస్‌పై తెలంగాణవాదులకు, తెలంగాణ యువతకు ఎలాగూ నమ్మకం లేదు. కానీ ఈ నమ్మకాన్ని కల్గించింది టి.ఆర్.ఎస్. మాత్రమే. ఏ ఎత్తుగడతో 2004 ఎన్నికల్లో టి.ఆర్.ఎస్. కాంగ్రెస్‌తో జత కట్టిందో, అది ఎందుకు వైఫల్యం చెందిందో నర్మగర్భంగా కె.సి.ఆర్. ఎందుకు ప్రవరిస్తున్నాడో తెలంగాణ యువతకు చెప్పాల్సిన బాధ్యత టి.ఆర్.ఎస్. పైనా, ఆ పార్టీ నాయకమన్యులపైనా ఉంది. సిద్ధాంతకర్తగా పేరు తెచ్చుకున్న జయశంకర్ లాంటి వారు కూడా ఎందుకు మౌనం వహిస్తున్నారో చెప్పాల్సిన బాధ్యత ఉంది. ఎందుకంటే తెలంగాణ వాదాన్ని టి.ఆర్.ఎస్. ఆవిర్భావానికి ముందు నుంచే ముందేసుకున్న వ్యక్తి కాబట్టి. దాదాపు 2004 నుంచి నేటి దాకా జయశంకర్ పాత్ర స్పష్టతను కోల్పోయింది. ఇదే కోవలో కోదండరాం కూడా పయనించడం, ఆయనను మరికొంత మంది అనుసరించడం జరుగుతూనే ఉంది. 2004 ఎన్నికల్లో కె.సి.ఆర్. మాటల్లో చెప్పాలంటే కాంగ్రెసే కర్రు కాల్చి టి.ఆర్.ఎస్.కు వాతలు పెట్టింది. అయినా దీన్ని గుణపాఠంగా తీసుకొని టి.ఆర్.ఎస్. తిరిగి 2009లో టి.డి.పి.తో జతకట్టి మరోసారి కర్రు చేత వాతలు పెట్టించుకుంది. ఒక రాజకీయ పార్టీకి అనుగుణంగా పనిచేస్తున్న తెలంగాణ మేధావులు టి.ఆర్.ఎస్.ను గైడ్ చేయడంలో, నడపడంలో పూర్తిగా వైఫల్యం చెందారంటే ఒప్పుకోక పోవచ్చు. కాని ఇది వాస్తవం కాదా? ఒకసారి ఆత్మ విమర్శ చేసుకోండి. ఒకవేళ మీరు చెపితే కె.సి.ఆర్. వినడు అనే భావన ఉంటే, టి.ఆర్.ఎస్.తో ఎందుకు ర్యాలీ అవుతున్నారో చెప్పాల్సిన బాధ్యత ఈ రోజు తెలంగాణ మేధావులపైన, తెలంగాణ పొలిటికల్ జె.ఎ.సి.పైన ఉంది.

ప్రజా పోరాటాలు నిర్మాణాత్మకమైన సూచనలతో, సైద్ధాంతిక అవగాహనతో, ఆచరణతో నడుస్తాయి. పైన ఉదహరించిన పోరాటాలన్నీ ఈ కోవలోనే నడుస్తున్నాయి. ఎంత నష్టపోయినా, ఉద్యమాలు ఒడిదుడుకులకు గురైనా ప్రజల ఆకాంక్షలు నెరవేర్చడానికి ఉద్యమాలు సాగుతూనే ఉన్నాయి. కాని ఎలాంటి సైద్ధాంతిక అవగాహన లేక, నిర్మాణాత్మక కార్యాచరణ కొరవడి రాజకీయ పార్టీలు తెలంగాణ ఉద్యమాన్ని నడపడంతో, స్పష్టత లేకుండా పోయింది. దీనికి ఎన్నికల్ని ఓ తంతుగా టి.ఆర్.ఎస్. వాడుకోవడం పరిపాటైంది. 2004 నుంచి, కరీంనగర్ జిల్లాలో ఆరుసార్లు సాధారణ, ఉప ఎన్నికలు జరిగాయంటే తెలంగాణ సాధనపట్ల వివిధ రాజకీయ పార్టీలకు ఎంత స్పష్టత ఉందో తెలుస్తున్నది. ఎన్నికల్ని స్వార్థ ప్రయోజనాలకు వాడుకుంటున్న ఇతర రాజకీయ పార్టీలకు, టి.ఆర్.ఎస్. కు ఈ సందర్భంగా ఏమైనా తేడా ఉందేమో ఆలోచించాలి.

ప్రతిసారి ప్రజల్ని, యువకుల్ని, విద్యార్థుల్ని ఎన్నికల ముగ్గులోకి లాగడం, వారికి లేనిపోని భ్రమల్ని కల్గించడం ఎటువంటి రాజకీయ ఎత్తుగడనో ప్రజలకి వివరించాల్సిన బాధ్యత టి.ఆర్.ఎస్.పై ఉంది. ఒకసారి గెలవడం, మరోసారి చతికిలపడడం జరుగుతూనే ఉన్నా, ఎన్నికలే తెలంగాణ వాదానికి రెఫరెండం అని అభివర్ణించడం ఎంతవరకు సమంజసం? అయినా ప్రతిసారి ప్రజలు తమ బాధ్యతల్ని చక్కగా నెరవేరుస్తూనే ఉన్నారు. కాని వీటిని వినియోగించుకొని ఉద్యమాల్ని సరియైన విధంగా నిర్మించడంలో తెలంగాణ రాజకీయ పార్టీలు విఫలం చెందాయి. ఇలాంటి అనిశ్చిత పరిస్థితిలో, తెలంగాణ ఏర్పాటు పట్ల అత్యాశను పెంచుకున్న యువత, మధ్య మధ్యన నీరుగారుతున్న ఉద్యమాన్ని చూసి తట్టుకోలేకపోతున్నారు. స్పష్టమైన ఉద్యమ పద్ధతులు లేక, ఏ ఉద్యమాన్ని ఎప్పుడు చేపడుతున్నారో తెలియక, యువత నిరాశ నిస్పృహలకు గురవుతున్నారు.

ఇక విద్యార్థి సంఘాలు, యువజన సంఘాలు కూడా యువతను చైతన్యపరచండలో పూర్తిగా విఫలం చెందాయి. చారిత్రక సత్యాలు, వివిధ దశలలో జరిగిన, జరుగుతున్న ఉద్యమాల తీరుతెన్నుల గురించి అవగాహన కలిగించకపోవడం, ఇంకా చెప్పాలంటే, విద్యార్థులకు శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించక పోవడం, గతి తార్కిక భౌతికవాదం గురించి తెలియజేయకపోవడం, కేవలం కెరియరిజం పట్ల భ్రమల్ని పెంచే విద్యా విధానం లాంటి అంశాలు విద్యార్థుల్ని తప్పుడు మార్గాల్ని ఎంచుకునేలా చేస్తున్నాయి. ఈ పరంపరలోని భాగమే ఆత్మహత్యలు. కొందరికి ఉంటే వ్యక్తిగత సమస్యలుండవచ్చు, కాని ఈ సందర్భంగా జరిగిన ఆత్మహత్యల్నీ తెలంగాణ వాదంతోనే ముడిపడి ఉండడాన్ని కూడా ఇక్కడ గమనించాలి. నిజానికిదో సామాజిక రుగ్మతతో కూడుకున్న మాస్ హిస్టీరియా. ఇదోక గొలుసు (చైన్) లాగా కొనసాగుతోంది. ఇలాంటి వాటిని నివారించడం సాధ్యం కాదని తమిళనాడు సంఘటనలు తెలుపుతున్నాయి. ఆ రాష్ట్రంలో రాజకీయ నాయకులపై, సినీ హీరోలపై వీరాభిమానాన్ని పెంచుకొని ప్రతి సంవత్సరం పదుల సంఖ్యలో యువకులు చనిపోతూనే ఉన్నారు. వీటిని నివారించే చర్యలు అక్కడ మృగ్యం. పైగా ఇలాంటి ఆత్మబలిదానాలను అక్కడి రాజకీయ పార్టీలు స్వార్థాలకు వినియోగించుకోవడం సర్వ సాధారణం. దాదాపు ఇదే పరిస్థితి తెలంగాణాలో కొనసాగుతుందంటే ఇబ్బంది పడే రాజకీయ పార్టీలు, కొంతమంది తెలంగాణ వాదులున్నారు. కాని ఒకసారి ఆత్మవిమర్శ చేసుకుంటే వాస్తవాల్ని గుర్తించగలుగుతారు. మొన్నటి ఉప ఎన్నికల ఊపుతో ఈ విధంగా ఆలోచించే పరిస్థితిలో రాజకీయ పార్టీలు, మేధావులు లేరంటే అతిశయోక్తి కాదు. ఇది వాస్తవం. పైగా తెలంగాణ కోసం తలనరుక్కుంటానని ఒకరంటే, ప్రాణాలివ్వడానికి కూడా సిద్ధమని మరో నాయకుడంటారు. ఈ అతిశయోక్తి మాటలు యువతపై ఎలాంటి ప్రభావాన్ని చూపుతాయో ఎవరూ ఆలోచించడం లేదు.

ఉప ఎన్నికలు కనీవిని ఎరగని విధంగా తెలంగాణ కోసం తీర్పు నిచ్చినప్పుడు, ఇది వాస్తవమని నమ్మినప్పుడు తిరిగి ఉద్యమాల బాటను ఎందుకు ఎంచుకోవాలి. డిసెంబర్ 31ని డెడ్‌లైన్‌గా ఎందుకు పెట్టాలి. తెలంగాణను దిగ్బంధం చేస్తామని, ఇంకేదో చేస్తామనే ఆవేశ పూరిత మాటలు యువతకు ఎలాంటి సంకేతాల్ని తీసుకెళ్లుతాయో టిఆర్ఎస్ ఆలోచిస్తుందా అనేది ఇక్కడ ప్రశ్న! ఒక వైపు పార్లమెంటరీ విధానం, మరోవైపు ఉద్యమాలు జోడు గుర్రాల స్వారీ! ఈ విషయాల్ని విద్యార్థులకు

స్పష్టం చేయకుండా, ఎన్నికలప్పుడు క్యాంపెన్ చేయాలని, ఉద్యమాలప్పుడు ఉద్యమాల్లో ఉవ్వెత్తున పాల్గొనాలని పిలుపునివ్వడం యువతను తికమక పెట్టే అంశాలు కాదా. ఎన్నికల్లో గెలిచినా తెలంగాణ రాదనేది విద్యార్థుల కన్నా, టిఆర్ఎస్‌కే ఎక్కువ తెలుసు. ఈ విషయాన్ని గుర్తిస్తున్న విద్యార్థులు నిరాశ నిస్పృహలకు గురికారా?

ఇక తెలంగాణ ఏర్పడితే నిరుద్యోగ సమస్య పూర్తిగా సమసి పోతుందా? చదువుకున్న ప్రతి యువకునికి ఉద్యోగాలు దొరుకుతాయా? మొత్తంగా తెలంగాణ ఓ స్వర్గధామం అవుతుందా? ఈ విషయంగా కొందరికి భ్రమలుంటే ఉండవచ్చు. గత 60 సంవత్సరాలుగా ఈ పాలకుల పరిపాలనను చూస్తున్న వారికెవరికి ఈ నమ్మకాలు కలగవు. ఈ విషయాల్ని స్పష్టం చేయాల్సిన బాధ్యత రాజకీయ పార్టీలకు లేదా.

తెలంగాణ ఏర్పడినా దేశవ్యాపితంగా ఉన్నట్లే ఆశ్రిత పక్షపాతం, అవినీతి, లంచగొండి తనం, రెడ్ టేపిజం, ఉన్నత వర్గాల పెత్తనం, బంధు ప్రీతి, సిఫారసుల ద్వారా పనులు జరగడం ఇప్పుడున్నట్లే ఉంటుంది. జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడిదార్లకు ఖనిజ సంపదను ధారాదత్తం చేయడం కూడా జరుగుతుంది. అటవి సంపద, ఇతర వనరులు దోపిడీకి గురవుతాయి. విధి విధానాలు మార్చకుండా, స్పష్టమైన నిబంధనావళి లేకుండా, తెలంగాణ ఏర్పడితే వచ్చే లాభాలేంటో టిఆర్ఎస్ చెప్పగలగాలి. మహిళల, గిరిజనుల, దళితుల సమస్యల్ని ఎలా పరిష్కరిస్తుందో చెప్పగలగాలి. అలాగే కార్పొరేటు వైద్య, విద్యారంగాల పట్ల స్పష్టమైన అభిప్రాయం లేకుండా, దళితుడు ముఖ్యమంత్రవుతాడని, మైనారిటీ వారు ఉపముఖ్యమంత్రి అవుతారని తెలపడంలోని ఆంతర్యాలను విద్యార్థులు, యువకులు అర్థం చేసుకోవాలి. ఈ అవగాహన కలిగినపుడే ఆత్మహత్యలు ఆగుతాయి తప్ప, ప్రతిజ్ఞతలతో కాదు.

ముఖ్యంగా తెలంగాణ ఉద్యమాన్ని నడుపుతున్న రాజకీయ పార్టీలు, ప్రధానంగా టిఆర్ఎస్ స్పష్టమైన ఉద్యమ నిర్మాణాన్ని ప్రకటించాలి. నెత్తుటి చుక్కలేకుండా ఉద్యమాన్ని నడుపుతామన్న కెసిఆర్ గారు ఇన్ని ఆత్మహత్యలు జరగడానికి గల కారణాన్ని పార్టీస్థాయిలో విశ్లేషించుకోవాలి. ఉద్యమం పట్ల ఒక నమ్మకాన్ని కల్గించాలి. ఈ నమ్మకం వమ్ము కావడంతోటే యువకులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారనే విషయాన్ని గ్రహించాలి. కాబట్టి నిర్దిష్టమైన రాజకీయ ఎజెండాతోపాటుగా, విభిన్న ఉద్యమ పద్ధతులను, ఎవరెవరిని ఏ ఉద్యమంలో కలుపుకొని పోవాలో నిర్ణయం జరగాలి. మధ్య మధ్యన విరామంలేకుండా ఉద్యమం లక్ష్యం సాధించేదాకా కొనసాగాలి. గత విద్యా సంవత్సరంలో రెండు నెలల కాలం విద్యార్థులు నష్టపోయారు. దీని ఫలితం ఇంటర్మీడియెట్‌పైన స్పష్టంగా కనపడింది. తిరిగి ఈ డిసెంబర్ తర్వాత విద్యార్థుల్ని ఉద్యమ బాట పట్టిస్తే పిల్లలు నష్టపోతే, పోతారేమోగాని ఉద్యమం పట్ల మాత్రం విశ్వాసాన్ని కోల్పోతారు.

గత జనవరి, ఫిబ్రవరిలలో జరిగిన ఉద్యమాన్ని అలాగే కొనసాగిం చాల్సింది. ఇందులో భాగంగానే శ్రీ కృష్ణ కమిటీని తీవ్రంగా వ్యతిరేకిం చాల్సింది. ఇది చేయకుండా మధ్యన రాజీనామాలు చేసి ఎన్నికలకు పోవడం, శ్రీ కృష్ణ కమిటీకి నివేదికలివ్వడం, ఇవ్వని రాజకీయ పార్టీలను ఎండగట్టడం ఒకదాని కొకటి వైరుధ్య అంశాలు. ఇప్పుడు డిసెంబర్ 31 తర్వాత రాష్ట్రం అగ్నిగుండంగా మారుస్తాం అని అసమంజస ప్రకటనలు విద్యార్థుల్ని రెచ్చగొట్టేవిగానే ఉంటాయి. ఈ విధానాలే యువతను ఆత్మహత్యలవైపు పురిగొల్పుతాయని గుర్తించకుంటే, ఈ ఆత్మహత్యల పరంపర ఇలాగే కొనసాగుతుంది. దీనికి ఇతర రాజకీయ పార్టీలేమోగాని, టిఆర్ఎస్ విధిగా బాధ్యత వహించాల్సి ఉంటుంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)*


***With best compliments from***

# *Hyderabad Filling Station*

*22-6-672/B*
*Miralam Mandi Road*
*Hyderabad*

***Rakesh Tiwari***
Managing Partner

Advt

*ఆచరణ, లోపాల సవరణ, మరింత ఉన్నతాచరణగా సాగుతున్న భారత మావోయిస్టు ఉద్యమాన్ని ప్రగతిశీల శక్తులు ఆసక్తిగా పరిశీలిస్తున్నాయని అంటున్నారు* **బెర్నార్డ్ డిమెల్లో**

# ఏది సరైన భారత విప్లవ మార్గం?

*(ముంబై నుంచి వెలువడే సుప్రసిద్ధ పత్రిక ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ డిప్యూటీ ఎడిటర్ బెర్నార్డ్ డిమెల్లో ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్‌లో చాలాకాలం ప్రొఫెసర్‌గా పనిచేసి, సామాజిక ఉద్యమాల అధ్యయనంలో ముంబైలో కమిటీ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ డెమొక్రటిక్ రైట్స్ (సి.పి.డి.ఆర్.) అనే పౌరహక్కుల సంఘంలో సభ్యులుగా ఉన్నారు. ఈ సంవత్సరం జనవరిలో ఖరగ్‌పూర్‌లోని కార్నర్ స్టోన్ పబ్లికేషన్స్ ప్రచురించిన 'వాట్ ఈజ్ మావోయిజం అండ్ అదర్ ఎస్సేస్' అనే పుస్తకానికి సంపాదకత్వం వహించారు. జూలై 2010లో ప్రఖ్యాత బెంగాలీ మాసపత్రిక అనీక్ 'సామాజిక విప్లవం – సాయుధ పోరాటం' అనే అంశంపై ఒక ప్రత్యేక సంచికను వేసినప్పుడు భారత విప్లవ మార్గం మీద వ్యాసం రాయవలసిందిగా డిమెల్లోను కోరింది. ఆ వ్యాసం బెంగాలీ నుంచి ఇంగ్లిష్‌లోకి అనువాదం అయి ఇంటర్నెట్ మీద విస్తృత ప్రచారంలో ఉంది. పాల్ స్వీజీ సంపాదకులుగా 1949లో మొదలయి ఇప్పటికీ ప్రభావశీలంగా నడుస్తున్న స్వతంత్ర సోషలిస్టు పత్రిక 'మంత్లీ రివ్యూ' నడిపే వెబ్‌సైట్ మీద ఆగస్ట్‌లో అచ్చయింది. రచయిత అనుమతితో ఆ వ్యాసం అనువదించి ప్రచురిస్తున్నాం. – సం.)*

**భా**రతదేశంలో సోషలిజం స్థాపించడానికి అంటే, సమానత్వాన్ని, సహకారాన్ని, సామాజికతను, మానవ సంఘీభావాన్ని సాధించే దిశలో 'సరైన మార్గం' ఏమిటనే విషయంలో మా వైఖరిని వివరించమంటూ 'అనీక్' పత్రిక సంపాదకులు నన్ను కోరారు. సోషలిజం కోసం పోరాటం సుదీర్ఘమైనది. కష్టతరమైనది. హింసాత్మకమైనది. నా వరకు నేను చుట్టూరా పెట్టుబడిదారీ ప్రాపంచిక వ్యవస్థ శత్రుపూరితంగా ఉన్నప్పుడు విడిగా, ఒంటరిగా సోషలిస్టు భారతదేశం ఏర్పడుతుందని ఊహించలేను. అయితే, భారత విప్లవమే కనుక విజయవంతమైతే అది యావత్ అంతర్జాతీయ సమీకరణాలనే లోతుగా మార్చివేస్తుంది కూడా. ఐరిష్ ప్రజలు కనుక విప్లవం సాధిస్తే బ్రిటన్‌లోని బూర్జువా వ్యవస్థ ఘర్షణకు లోను కావడం ఎక్కువ దూరంలో ఉండదని మార్క్స్ ఎప్పుడో అన్నమాట గుర్తు తెచ్చుకోండి. ప్రస్తుతం నా చేతిలో ఉన్న పని నుంచి దూరం కాకుండానే కొన్ని విషయాలు మాత్రం చర్చిస్తాను. అనీక్ సంపాదకులు నన్నడిగిన ప్రశ్న మీద దృష్టి కేంద్రీకరించవలసి ఉంది. నేను మొదట మావోయిస్టు మార్గం అంటే ఏమిటి అనే విషయంలో అవసరమైన వివరణతో ప్రారంభిస్తాను. ఆ తరువాత ఇవాళ్టి భారత దేశంలోని రాజకీయ నేపథ్యం గురించి చర్చిస్తాను. భారతదేశంలో సోషలిజం స్థాపించే దిశలో 'నూతన ప్రజాస్వామిక' విప్లవ పోరాటానికి మద్దతుగా భారత ప్రజలలోని అత్యధిక సంఖ్యాకులను ఏకం చేయడంలో మావోయిస్టు వ్యూహానికి సంబంధించిన అంశాలు పరిశీలిస్తాను. చివరిగా మానవజాతికి మావోయిజం చేస్తున్న వాగ్దానాలలో ఒకదాన్ని ఎత్తి చూపుతాను.

**మావోయిస్టు మార్గం**

నాకు అర్థమైనంతవరకు భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) వ్యూహం – రాజకీయంగాగానీ, సైనికంగాగానీ ఏమంటే దీర్ఘకాలిక ప్రజా యుద్ధం ద్వారా రాజ్యాధికారాన్ని చేపట్టడం. ఇందుకు **ప్రధాన** పోరాట రూపం సాయుధ పోరాటం. **ప్రధాన** నిర్మాణ రూపం ప్రజాసైన్యం (దాన్నే ప్రస్తుతం వాళ్లు ప్రజా విమోచన గెరిల్లా సైన్యం అని పిలుస్తున్నారు). అయితే ఇవి **ప్రధానమైనవి** మాత్రమే. రైతాంగంలో, కార్మికవర్గంలో, విద్యార్థులలో, యువతలో, మహిళలలో, మేధావులలో, ఇతర ప్రజా బృందాలలో ప్రజా సంఘాలను ఏర్పాటు చేయడం, రాజకీయ కృషి సాగించడం కూడా ఆ పార్టీ కార్యక్రమంలో హెచ్చుగానే ఉన్నాయి.

నిజంగానే 2004 సెప్టెంబర్‌లో సిపిఐ (మావోయిస్టు) గా రూపొందడానికి మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్ ఆఫ్ ఇండియా (ఎం.సి.సి.ఐ.)తో ఐక్యమైన భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు – లెనినిస్టు) (పీపుల్స్‌వార్) శక్తిమంతమైన ప్రజా ఉద్యమాలు ఎన్నిటినో అభివృద్ధి చేసింది. రైతు కూలీ సంఘం, రాడికల్ విద్యార్థి సంఘం వంటి పతాకాల కింద ఆ ప్రజా ఉద్యమాలు సాగాయి. కాని, దారుణమైన రాజ్య నిర్బంధం వల్ల ఆ నిర్మాణాలు అజ్ఞాత జీవితానికి వెళ్లక తప్పలేదు. అలాగే, విరసంగా ప్రఖ్యాతమైన విప్లవ రచయితల సంఘం, విస్తృతమైన జనాకర్షణ సాధించిన జననాట్య మండలి వంటి సంస్థల ప్రభావాన్ని కూడా గుర్తు తెచ్చుకోవలసిందే. వీటిలో జననాట్యమండలి నయితే పార్టీకి చెందిన సాంస్కృతిక విభాగంగానే భావించేవారు. ఈ సంస్థలు 'నక్సలైటు భావజాలాన్ని ప్రచారం చేస్తున్నా'యనే పేరుతో వాటి మీద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విరుచుకుపడింది. అంత భయంకరమైన నిర్బంధంలో ఆ ప్రజా సంఘాల నాయకుల, కార్యకర్తల ప్రాణాలను ప్రమాదంలో పెడుతూ పార్టీ ఇంకా ఆ ప్రజాసంఘాలను నడుపుతూ విజయం సాధించగలిగేదా అనేది ప్రశ్న. అయితే, వారు చేస్తున్న కృషిని కూడా చెప్పాలంటే, గెరిల్లా జోన్‌లలో ప్రజా సంఘాలు నడపడంలో వారు తప్పనిసరిగా కొంత ముందడుగు వేశారు. ఉదాహరణకు, అరుంధతీరాయ్ సుప్రసిద్ధ వ్యాసం 'వాకింగ్ విత్ కామ్రేడ్స్'లో క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన్ ప్రస్తావనలు చూడండి.

ఏది ఏమైనా ప్రజాసంఘాలు అజ్ఞాతవాసానికి వెళ్లక తప్పనప్పుడు, 'అత్యంత రహస్యం'గా ఉండాలనే ఒత్తిడి వచ్చినప్పుడు ప్రజా ఉద్యమాలనేవి క్షీణించి పోవా? దీర్ఘకాలిక ప్రజాయుద్ధం విజయవంతం కావాలంటే మొట్టమొదట అంతకంతకూ ఎక్కువగా విశాల ప్రజానీకపు మద్దతును, గ్రామీణ ప్రాంతాలలో అణగారిన దోపిడీకి గురైన పీడనకు గురైన ప్రజల క్రియాశీల మద్దతును కూడగట్టకుండా సాధ్యం కాదని మావోయిస్టులకు స్పష్టంగానే తెలుసు. ఇటువంటి మద్దతును కూడగట్టడమనేది ఆయా ప్రాంతాలలో 'స్థావర ప్రాంతాల'ను ఏర్పరిచే దిశలో మొట్టమొదటి అడుగు అక్కడ దున్నే వాడికే భూమి అమలు జరపాలి. ఇతర సామాజిక విధానాలను అమలు పరచాలి. అక్కడ వీలైనంత వరకు సూక్ష్మ రూపంలో, బీజ రూపంలో ఒక ప్రజాస్వామిక స్వావలంబన రాజ్యాన్ని నిర్మించాలి. దాని ద్వారానే యావత్ భారతదేశంలో, గ్రామీణ ప్రాంతాలలో రాజకీయ ప్రజా పునాదిని ఏర్పర్చుకోవాలి. అప్పుడే అంతిమంగా పట్టణాలను చుట్టుముట్టి, పట్టణాలలో ప్రజల మద్దతును కూడగట్టుకోవాలి. ఈ క్రమమంతా వాళ్లకు తెలుసు. మరో మాటలో చెప్పాలంటే, తుపాకిని శాసించవలసింది రాజకీయాలే అనే విషయం వాళ్లకు ఒకటికి రెండుసార్లు అవగాహనలో ఉంది. పార్టీ అనుసరించే రాజకీయాల నాణ్యతకు అత్యంత ప్రాధాన్యత ఉందని కూడా వాళ్లకు తెలుసు. అయితే, మావోయిస్టు వ్యూహం అమలు కావడానికి దాని అంతర్గత తర్కం ఉంది. దీర్ఘకాలిక ప్రజాయుద్ధపు రాజకీయ స్వభావం వల్ల అది తప్పనిసరిగా హింసాత్మక రూపమూ తీసుకోవలసి వస్తుంది, అహింసాత్మక రూపమూ తీసుకోవలసి వస్తుంది. హింసాత్మక రూపం ఒక విషాదకరమైన ఆవశ్యకత. అహింసాత్మక రూపం 'ప్రజాపంథా' (ప్రజల నుంచి ప్రజలకు) అనే రూపంలో అమలవుతుంది. దురదృష్టవశాత్తూ మావోయిస్టు ఉద్యమం ఈ రెండు రూపాలలో అహింసాత్మక రూపాన్ని చేపట్టకుండా చూడడంలో భారత రాజ్యం విజయం సాధిస్తోంది. విప్లవ నిర్మాణం గురించి, వ్యూహం గురించి, ఎత్తుగడల గురించి ప్రామాణిక మావోయిస్టు సూత్రాలను బట్టి చూస్తే విముక్తి మార్గంలో సాయుధ పోరాటానికి కీలకమైన దోహదకారి పాత్ర ఉంటుంది. కాని, భారత రాజ్యపు వ్యూహం ప్రకారం మొత్తం ఉద్యమాన్నే హింస అనే ఒక్క అంశానికే కుదించడం జరిగింది.

## రాజకీయ నేపథ్యం

ఈ వివరణ తరువాత భారతదేశంలో ఇవాళ ఉన్న రాజకీయ నేపథ్యం గురించి కొంత చర్చించవలసి ఉంది. మొట్టమొదట, పాఠకులకు ఒక హెచ్చరిక చేయవలసి ఉంది. ఒక నిర్దిష్ట, సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక పరిస్థితుల ప్రాధాన్యతను మనం నిజంగా, లోతుగా అర్థం చేసుకోవాలంటే ఆ పరిస్థితులను మార్చే సామూహిక కృషిలో భాగం పంచుకోకుండా సాధ్యం కాదు. రెండవ హెచ్చరిక మధ్య భారతంలోనూ, తూర్పు భారతంలోనూ కొన్ని ప్రాంతాలలో పేదలలో కల్లా నిరుపేదలు సిపిఐ (మావోయిస్టు) నాయకత్వంలో న్యాయం కోసం పోరాడుతున్నారు. వారి లక్ష్యాలను సాధించడం కొరకు హింసాత్మక మార్గాలను కూడా చేపట్టారు. ఇటువంటి వర్గపోరాటం దాని విషాదకరమైన ప్రాణ నష్టాలతో, గాయాలతో, నష్టాలతో అవసరమైనదో, అనవసరమైనదో తీర్పు చెప్పడానికి నేనెవరిని? మూడవది, ఒక సోషలిస్టుగా నేను హింసను ప్రబోధించను. కాని, దురదృష్టవశాత్తు ఇవాళ కొనసాగుతున్న పరిస్థితులలో హింస ఒక విషాదకరమైన ఆవశ్యకత అయిందని అనుకుంటాను. మరి, ఆ పరిస్థితులెంటో తెలుసుకోవాలి.

'ఆర్థిక వ్యవస్థకు సాంద్రీభూత వ్యక్తీకరణే రాజకీయాలు' అని ఒక మాట చెపుతూ ఉంటారు. కనుక రాజకీయాల గురించి తెలుసుకోవాలంటే ఆర్థిక ప్రపంచంలోకి వెళ్లవలసిందే. భారతదేశం ప్రపంచ పెట్టుబడిదారీ విధానపు అంచులలో ఉన్న, పెట్టుబడిదారీ విధానం మీద ఆధారపడిన, వెనుకబడిన పెట్టుబడిదారీ దేశం. ఈ దేశంలో దోపిడీ రేటు అతి ఎక్కువగా ఉంటూ వస్తోంది. ఇప్పటికీ ఉంది. ఇక్కడ దోపిడీ అంటే కేవలం కార్మిక వర్గం ఉత్పత్తి చేసే అదనపు విలువను ఆక్రమించడం మాత్రమే కాదు, శ్రామిక జనావళిలో అత్యధిక భాగం ప్రధానంగా గ్రామీణ ప్రాంతాలలోనూ, పట్టణాలలోనూ, నగరాలలోనూ కూడా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో భూస్వాముల చేత, వ్యాపారుల చేత, వడ్డీ వ్యాపారుల చేత దోపిడీకి గురవుతున్నారు. ఇక్కడ అదనపు విలువను ఆక్రమించే రూపం గురించి మాట్లాడేటప్పుడు ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థ అంచుల గురించి విశ్లేషిస్తూ పాల్ స్వీజీ ఎప్పుడో చేసిన నిర్ధారణ గుర్తుకు వస్తుంది. 'ఈ అదనపు విలువ వ్యాపారీకరణ పొంది, పెట్టుబడిదారీ పద్ధతిలో ఉత్పత్తి అయిన అదనపు విలువతో సంలీనం అయిపోయి, గుర్తుపట్టడానికి వీలులేని స్థితిలో ఉంటుంది.' ఈ అదనపు విలువ దోపిడీకి ఇవాళ్టి భారతదేశంలో ముమ్మరంగా ఉన్న ప్రకృతి వనరుల దోపిడీని, సామాజిక ఆస్తి దోపిడీని కూడా కలపవలసి ఉంటుంది.

ఈ దోపిడీ వల్ల ఈ దేశంలోని ఆధిపత్య వర్గాలు అమెరికాలోని తమ సోదర ఆధిపత్య వర్గాలకు సమానమైన వినియోగాన్ని, జీవన ప్రమాణాన్ని, విలాసాలను సొంతం చేసుకున్నాయి. మరి ఈ ఆధిపత్య వర్గాలు కాక మిగిలిన వాళ్లు కార్మికులు, రైతులు, గ్రామీణ ప్రాంతాలలోని అనాధ్రుత, నిరుపేద ప్రజలు, పట్టణాల మురికివాడల వాసులకు ఏం దక్కుతోంది? వారికి దక్కిందల్లా పేదరికం, వేదన, విధ్వంసం నిండిన జీవితం. మామూలు మాటల్లో చెప్పాలంటే, మనిషిగా మనుగడ సాగించడం అనే స్థాయి కన్నా కూడా తక్కువ స్థాయిలో వాళ్లు బతకవలసి వస్తోంది. కనుక ఈ భారతదేశంలో పరాన్నభుక్కు వెనుకబడిన పెట్టుబడిదారీ విధానపు నిర్మాణంలో అంతర్గతంగానే ఒక సువిశాల ప్రజా మార్కెట్‌ను అభివృద్ధి చేయలేని వైఫల్యం ఉంది. అందువల్లనే అంతర్గత కారణాలవల్లనే ఇది 'అభివృద్ధి చెందిన' స్థాయిని చేరుకోజాలదు.

నిజంగానే ఇంత హెచ్చు స్థాయి దోపిడీ ఉన్నప్పుడు అత్యున్నతమైన అణచివేతతో కూడిన రాజకీయ వ్యవస్థ అవసరమౌతుంది. అప్పుడిక వెస్ట్ మినిస్టర్ నమూనా నుంచి అనుకరించినవో, అనుసరించినవో అయిన భారత రాజ్యాంగమూ, బూర్జువా ప్రజాస్వామిక నిర్మాణాలు తమ సారాన్ని కోల్పోయి ఖాళీ ఆకారాలుగా మిగిలిపోతాయి. అయినప్పటికీ రాజకీయ వ్యవస్థ బూర్జువా ప్రజాస్వామికమైనదైతే కొన్ని సందర్భాలలో కొన్ని రూపాల దోపిడీకీ, పీడనకూ, ఆధిపత్యానికీ వ్యతిరేక పోరాటాలను తక్కువ ఇబ్బందికరమైనవిగా మారుస్తుంది. కాని, ఈ రాజకీయ వ్యవస్థ లోతుగా, లోపభూయిష్టంగా ఉంది. ఎందుకంటే, ఆదాయంలో, సంపదలో, పంపిణీలో దారుణమైన అసమానతలు నిండి ఉన్న సమాజంలో ప్రజాస్వామ్యం ఎట్లా సాధ్యమవుతుంది? జాతి, కులం, స్త్రీ పురుష విభేదం, మతం, రాజకీయ విశ్వాసాలు పునాదిపై వివక్ష అమలయ్యేటప్పుడు ప్రజాస్వామ్యం ఎట్లా పరిఢవిల్లుతుంది? అందువల్ల రాజకీయ వ్యవస్థలో పాల్గొనే సభ్యులను ఎన్నుకునేందుకు అప్పుడప్పుడు

ఒక నాటకం జరుగుతుంది. ఆ రాజకీయ వ్యవస్థలోన పాల్గొనే ప్రతినిధులకు ఆధిపత్యాలే పెట్టుబడులు పెడతాయి. వారిని తమలో కలుపుకుంటాయి. వారు గెలిచి, దేశాన్నీ, రాష్ట్రాలనూ, పట్టణాలనూ, పంచాయితీలనూ పాలిస్తారు. ఇవన్నీ సక్రమంగా సాగితే అయిదేళ్ల వరకు వాళ్ల పాలన సాగుతుంది. ఎప్పటికన్నా ఎక్కువగా ఇప్పుడు దేశంలో ప్రభుత్వాలనబడేవి మార్కెట్‌ల కొరకు, మార్కెట్‌ల చేత, మార్కెట్‌ల వల్లనే కొనసాగుతున్నాయి. ఒక కవి చెప్పినట్టు 'మార్కెట్‌కు ధరల గురించి అంతా తెలుసు. విలువల గురించి ఏమీ తెలియదు'. ఏది ఏమైనప్పటికీ రాజకీయాలు అనేవి ఎప్పుడైనా సమాజంలో ఉన్న మౌలిక ఘర్షణల నుంచి మాత్రమే వెలికి వస్తాయి.

గత రెండు దశాబ్దాలుగా దేశంలో ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక రంగస్థలం మీద ప్రపంచీకరణ దృశ్యం ముమ్మరంగా సాగుతోంది. ఆధిపత్య వర్గాలూ, వారి ప్రతినిధులూ ఎప్పటికప్పుడు చెబుతున్న మాట ఏమంటే, వాషింగ్టన్ ద్వారా రూపొంది అమలవుతున్న వ్యూహాత్మక ఒప్పందం ఫలితంగా ఈ దేశం ఒక ఆర్థిక మహాశక్తి అయిపోయే మార్గంలో ఉన్నదట. భారతదేశపు వాస్తవికతతో వాళ్లకు సంబంధం లేదు. ఆరు సంవత్సరాల కింద రాజకీయార్థిక శాస్త్రవేత్త ఉత్సా పట్నాయక్ ఈ దేశపు వాస్తవికతను 'పేదరికపు మహా సామ్రాజ్యం' అని అభివర్ణించారు. 'సమకాలీన సమాజపు అమానుష పరిస్థితులకు మచ్చు తునక'గా, ప్రాతినిధ్య అంశంగా ఎవరైనా చూడవలసింది అణగారిన జనాల జీవితాలను, వారి జీవితానుభవాలను. ఈ అశేష జనావళిలో 'మానవ జీవి కనుమరుగైపోయిన', ఆ కనుమరుగైపోయిన మానవ జీవే 'తాను పొందిన నష్టం గురించి సైద్ధాంతిక చైతన్యాన్ని గ్రహించ గలిగింది. ఇక ఒక అనివార్యమైన, అత్యవసరమైన యుద్ధం చేయడానికి నెట్టబడింది... ఆ యుద్ధం అమానుషత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు'. ఇక్కడ నేను ఉటంకించిన మాట కొత్తది కాదు. 1844లో పశ్చిమ యూరప్‌లో కార్మిక వర్గపు స్థితిని చూసి ఇద్దరు యువకులు మార్క్స్, ఎంగెల్స్‌లు రాసిన మాట. ది హోలీ ఫ్యామిలీ పుస్తకంలోని వాక్యాలు. ఆ మాటలు ఇవాళ భరత భూమిలో అణగారిన, నిరుపేద ప్రజలకు అక్షరాలా ఎంతగా సరిపోతాయి. అలా సరిపోతున్నాయంటే భారతదేశంలో ఒక సామాజిక విప్లవ అవసరం ఎంతగా ఉన్నదో అవి ఎట్లా చూపుతున్నాయి. ఇంకా చెప్పాలంటే, అశేష ప్రజానీకపు ప్రయోజనాలను పరిరక్షించడానికే భారత రాజ్యం నిర్మించాలని చెపుకుంటున్న చట్టాలూ, వ్యవస్థలూ అతిఘోరంగా విఫలమైన నేపథ్యంలో ఈ మాటలు ఎంత అక్షరసత్యాలు. అంతేకాదు, సోవియట్ యూనియన్ కుప్పకూలిపోయిన తరువాత చైనాలో పెట్టుబడిదారీ సమాజానికి పెద్ద వెనుకంజ పూర్తయిన తరువాత భరత భూమి మీది నిరుపేద ప్రజానీకపు వాస్తవ స్థితి మరింత దిగజారింది. పెట్టుబడిదారీ విధానానికి ముసుగులు ఇక అవసరం లేకపోయాయి. తన ఆస్తి సంచయన క్రమంలో అతి దుర్మార్గమైన దోపిడీ రూపాలకు తలపడేందుకు దానికిప్పుడు సిగ్గూ, ఎగ్గూ లేవు. సరిగ్గా ఇది పెట్టుబడిదారీ విధానం పుట్టిన తొలిరోజుల్లో అనుసరించిన పద్ధతులే. మరి ఈ బురదగుంట నుంచి బయట పడడం ఎలా?

### 'సరైన మార్గం' దిశగా

సార్వత్రిక ఓటు హక్కు ఉన్నప్పటికీ దిగజారిన బూర్జువా ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థ ఉన్న భారతదేశంలో ఒక సువిశాలమైన, కేంద్రీకృతమైన రాజ్యాంగ యంత్రమూ, అత్యంత శక్తి సంపన్నమైన ఆధునిక సైన్యమూ ఉన్న భారతదేశంలో ఒక కమ్యూనిస్టు పార్టీ పార్లమెంట్‌లో అత్యధిక స్థానాలు గెలుచుకుని, అధికారం చేపట్టడం సాధ్యమేనా? అది ఒక సోషలిస్టు రాజ్యాంగాన్ని ప్రవేశపెట్టగలదా? రాజ్యాంగ యంత్రపు అణచివేత సాధనాలను తటస్థం చేయగలదా? ఇవన్నీ ప్రయత్నిస్తూ కూడా సాయుధ ఘర్షణకు తనను తాను సంసిద్ధం చేసుకోగలదా? చివరిగా రాజ్యాంగ యంత్రాన్నే కూలదోసి పీడితుల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే పాలనను నెలకొల్పగలదా? భారత పాలకవర్గాలు సాయుధ ప్రతిఘటన లేకుండా తమ సంపదనూ, అధికారాన్నీ ఒదులుకోబోవని నేననుకుంటాను. ఇదేమీ ఊహ కాదు. నవంబర్ 1970 నుంచి సెప్టెంబర్ 1973 దాకా చిలీలో జరిగిన సంఘటన. 1979లో సాండినిస్టా విప్లవం తరువాత జరిగిన నికరాగువన్ అనుభవాలు. ఈ అభిప్రాయాన్ని నిర్ధారిస్తున్నాయని నేననుకుంటాను. నికరాగువాలో 1984లో జరిగిన ఎన్నికలలో సాండినిస్టా నేషనల్ లిబరేషన్ ఫ్రంట్‌కు చెందిన డానియల్ ఆర్టెగా అత్యధిక మెజారిటీతో గెలుపొందాడు. కాని, అమెరికా ప్రభుత్వం ఈ విజయాన్ని కుట్రల ద్వారా, పరోక్ష యుద్ధం ద్వారా, ఇరాన్-కాంట్రా వ్యవహారం ద్వారా కూలదోసింది. అయితే సిపిఐ (మావోయిస్టు) తన భావాలనూ, అభిప్రాయాలనూ ప్రచారం చేసుకోవడానికి, పార్లమెంట్‌ను వాడుకోవచ్చునా లేదా, అలా వాడుకుంటూ కూడా తన దీర్ఘకాలిక ప్రజాయుద్ధ వ్యూహంలో భాగంగా ప్రజా ఉద్యమాలనూ, పోరాటాలనూ అభివృద్ధి చేసుకోవచ్చును గదా, సంక్షోభ సమయాలలో సాయుధ ఘర్షణకే ప్రాధాన్యత ఇవ్వవచ్చును గదా అనేవన్నీ పార్టీ రాజకీయ పంథాకు సంబంధించిన విషయాలు. ఆ పార్టీ ఏ ప్రత్యామ్నాయాలు ఎంచుకుంటుందనే విషయంలో అడగని సలహా ఇవ్వడానికి నన్ను నేను తగిన వ్యక్తిని అనుకోను.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అధికార ప్రతినిధులు చాలా తరచుగా లెనిన్ రాసిన 'వామపక్ష కమ్యూనిజం - ఒక బాల్యారిష్టం' అనే పుస్తకాన్ని ఉదహరిస్తుంటారు. రష్యాలో జరిగిన మూడు విప్లవాలలో పాల్గొని నేర్చుకున్న గుణపాఠాలను బోల్షివిక్ పార్టీ సైద్ధాంతీకరించే క్రమంలో 1920 ఏప్రిల్ - మే లలో లెనిన్ ఆ పుస్తకం రాశాడు. ఆ పుస్తకం సహాయంతో సిపిఐ (మావోయిస్టు) ను అతి దారుణమైన పద్ధతిలో చిత్రీకరించడానికి సిపిఎం ప్రయత్నిస్తోంది. అయితే, సిపిఐ అడుగు జాడలలో నడుస్తూ సిపిఎం మరిచిపోయిన పుస్తకం మరొకటి ఉంది. అది, లెనినే 1917 ఆగస్ట్ - సెప్టెంబర్‌లలో రాసిన 'రాజ్యమూ - విప్లవమూ' అనే పుస్తకం. ఆ పుస్తకాన్ని మరిచిపోయి ఈ పార్టీలు పెట్టుబడిదారీ విధానం నుంచి సోషలిజానికి శాంతియుత పరివర్తన సాధ్యమవుతుందనే మార్క్సిస్టు వ్యతిరేక, లెనినిస్టు వ్యతిరేక సిద్ధాంతాన్ని చెపుతున్నాయి. ఒక విప్లవాన్ని నడపడానికి అవసరమైన శక్తిని సమకూర్చుకోవడానికి, అందుకు తగిన సంకల్పాన్ని బలపర్చుకోవడానికి చేయగలిగిందంతా చేసేదే నిజమైన లెనినిస్టు పార్టీ అవుతుంది. నిజం చెప్పాలంటే, ఇవాళ సిపిఐ (మావోయిస్టు) మాత్రమే ఆ శక్తిని సమకూర్చుకుంటోందని ఇప్పటికే ప్రస్తావించిన అరుంధతీ రాయ్ వ్యాసం, గౌతమ్ నవ్‌లాఖా రాసిన 'డేస్ అండ్ నైట్స్ ఇన్ ది హార్ట్ ల్యాండ్ ఆఫ్ రెబెలియన్' వ్యాసం చెబుతున్నాయి. ఆ శక్తిని సమకూర్చు కునేందుకు వారు తమ కాలు నిలపగలిగిన ప్రాంతాలలో ప్రజలతో సన్నిహిత సంబంధాల ద్వారా ప్రయత్నిస్తున్నారు. ఆ పార్టీ భారతదేశపు

నిరుపేద ప్రజానీకాన్ని ఒక సమ సమాజం దిశగా విప్లవ పథంలో శక్తిమంతులను చేస్తోంది. వ్యవస్థ ఇచ్చిన చట్రం లోపల పనిచేయాలనే ఆకర్షణలను పక్కనపెట్టి, విప్లవాన్ని నడపాలనే సంకల్పాన్ని అది బలోపేతం చేసుకుంటోంది. వర్గపోరాటాన్ని విజయవంతంగా పరిపూర్తి చేసేందుకు తాను చేయగలిగినదంతా చేస్తోంది. ఇందుకు భిన్నంగా సిపిఎం తనను తాను లెనినిస్టు పద్ధతిలోనే నిర్మించుకున్నప్పటికీ భారతదేశపు వెనుకబడిన బూర్జువా సమాజ ప్రభావంలో మునిగి పోయింది. ఒక సంస్కరణవాద శక్తిగా మారిపోయింది. ఈ పార్టీకైనా, సిపిఐ కయినా ఇది చాలా దురదృష్టకరం. ఎందుకంటే, ఇప్పటికే ఆ రెండు పార్టీల లోపల అనేకమంది అసాధారణమైన వ్యక్తులు ఉన్నారు.

ఇక ఇంతకు ముందే చెప్పినట్టు సిపిఐ (మావోయిస్టు) అనుసరించే దీర్ఘకాలిక ప్రజాయుద్ధం అనే మార్గంలో ప్రధాన పోరాట రూపం సాయుధ పోరాటం. ప్రధాన నిర్మాణరూపం ప్రజాసైన్యం. ఎన్నికలను బహిష్కరించడం అనే పార్టీ వైఖరి గురించి నేను అర్థం చేసుకున్నంత వరకు ఎన్నికలలో పాల్గొనడానికి దీర్ఘకాలిక ప్రజాయుద్ధ వ్యూహానికి సరిపడదని ఆ పార్టీ వాదిస్తోంది. అయితే అదే సమయంలో గెరిల్లా జోన్‌లలో ప్రజా అధికారం కోసం ప్రత్యామ్నాయ సంస్థలను నిర్మించడానికి, రూపొందించడానికి ఆ పార్టీ ప్రయత్నిస్తోంది. అయితే పార్టీ దృష్టి ప్రకారం దీర్ఘకాలిక ప్రజాయుద్ధ వ్యూహం పురోగతిలో సమస్య ఏమంటే ఆ పార్టీ గెరిల్లా జోన్‌లను స్థావర ప్రాంతాలుగా మార్చలేక పోతున్నది. స్థావర ప్రాంతాలను ఏర్పాటు చేయకుండా గెరిల్లా జోన్‌లను మరింత విస్తరించడం కాని, సాగుతున్న గెరిల్లా యుద్ధాన్ని పురోగమింప జేయడం కాని అసాధ్యం అవుతుంది. మైదాన ప్రాంతాలు గెరిల్లా యుద్ధానికి ఎక్కువగా అనువయినవి కాదు. అక్కడ గెరిల్లా జోన్‌లను స్థాపించడం సాధ్యం కాదు. అందువల్ల ఆ ప్రాంతాలలో అభివృద్ధి చెందిన గెరిల్లా యూనిట్‌లు తమ చర్యలను కొనసాగించలేక పోతున్నాయి. క్రమక్రమంగా అవి అటవీ ప్రాంతాలలోకీ, కొండ ప్రాంతాలలోకీ తరలిపోవలసి వస్తోంది. ప్రస్తుతం ఉన్న గెరిల్లా జోన్‌లలో కొన్ని స్థావర ప్రాంతాలుగా పరిణామం పొందడానికి అవకాశాలు మెండుగా ఉన్నవి. కాని, అక్కడ శత్రువును ఓడించవలసి ఉంటుంది. ఆ తరువాత రాజకీయాధికార సంస్థలను స్థాపించవలసి ఉంటుంది. దారుణమైన నిర్బంధం అమలవుతున్నప్పుడు ఇదంతా కష్టసాధ్యమైన కర్తవ్యం. తాము కొన్ని స్థావర ప్రాంతాలనైనా ఏర్పరచి, కొనసాగించగలిగితే దీర్ఘకాలిక ప్రజాయుద్ధ వ్యూహం ఎక్కువ కాలం ముందుకు సాగగలుగుతుందని మావోయిస్టు దృష్టి. స్థావర ప్రాంతాలు లేనప్పుడు మావోయిస్టు గెరిల్లా సైన్యం ఎక్కువ కాలం నిలదొక్కుకోజాలదు. అభివృద్ధి చెందజాలదు. గెరిల్లా భాషలో చెప్పాలంటే, ఎప్పుడైనా స్థావర ప్రాంతాలు వారి వెనుకతట్టు రక్షిత స్థలంగా ఉంటాయి. అయితే, ఇక్కడ మరొక మాట కూడా చెప్పాలి. గెరిల్లా జోన్‌లలోనే మావోయిస్టులు కొన్ని కొన్ని ప్రాంతాలలో తమ ప్రాబల్య ప్రాంతాలను తయారు చేసుకున్నారు. వాటిని వాళ్లు గెరిల్లా స్థావరం అని పిలుస్తున్నారు. అవే ఇప్పుడు వారికి వెనుక తట్టు రక్షణ ప్రాంతంగా పనిచేస్తున్నాయి.

దీర్ఘకాలిక ప్రజాయుద్ధ వ్యూహం సారాంశాన్ని సరిగా అర్థం చేసుకోలేని మనలో కొందరికి మరొక విషయం కూడా అర్థం కాదు. ప్రజాసైన్యమూ, ప్రజా సంఘాలూ కలగలసిన నిర్మాణం దీర్ఘకాలిక అర్థంలో పురోగమించడానికీ, తాత్కాలికంగా ఉపసంహరించుకోవడానికీ కూడా శక్తి కలిగి ఉంటుంది. సహాయకారిగా ఉండే సైనిక బలగాన్ని నిర్మించుకోక ముందే ప్రజాసంఘాలను నిర్మించుకొని వాటిని కొనసాగించడంలో విఫలమైతే, అంటే, ఇటు నుంచి అటు సాధ్యం కాకపోతే, అటు నుంచి ఇటు ప్రయత్నించవచ్చు. ఈ రెండు రంగాల మధ్య అసమతుల్యపు యుద్ధవ్యూహానికి తగిన పద్ధతులను ఎంచుకోవచ్చు. మైదాన ప్రాంతాలలో కూడా ఇటువంటి ప్రయోగం సాగించవచ్చు. ఏది ఏమైనా ఆ పార్టీ పనిచేయడం ద్వారా నేర్చుకుంటున్నది. ఆచరణ, పొరపాట్ల నుంచి సామూహికంగా అధ్యయనం చేసి నేర్చుకోవడం, మళ్లీ ఆచరణలో పెట్టడం. ఈసారి మరింత విజయం సాధించడం. ఈ ప్రక్రియ పదే పదే ఎక్కువ శక్తిమంతమైన, మరింత ఉన్నతమైన వలయాకార స్థితిలో సాగడం. ఇది ఆ పార్టీ సాగిస్తున్నది.

అయితే ఇక్కడ ఇంకొక ప్రశ్న వేయవలసి ఉన్నది. భారతదేశంలో ఇవాళ ఉన్న ఆర్థిక, రాజకీయ పరిస్థితులు కనీసం చైనాలో 1930లలో, 40లలో ఉన్న పరిస్థితులకు సమానమైనవేనా అని. భారతదేశంలో ఇవాళ రైతాంగ సమస్య అతి ప్రధానమైన సమస్య అనడంలో సందేహం లేదు. కాని, ఇక్కడ రైతాంగాన్ని భూముల నుంచి వెళ్లగొట్టడం వర్గ విభజన ద్వారా కాకుండా, విస్థాపన ద్వారా, పర్యావరణ విధ్వంసం ద్వారా జరుగుతోంది. స్థూల స్థాయిలో చూసినపుడు కోట్లాది మంది గ్రామీణ ప్రజానీకం కాజువల్ కార్మికులుగా, కాంట్రాక్ట్ కార్మికులుగా, శ్రామిక వర్గంలో చేరిపోతున్నారు. ఆకలి, పోషకాహార లోపం, ఆశ్రయం లేకపోవడం, భూమిలేని నిరుపేదరికం, బలవంతాన వలస వెళ్లవలసి రావడం, జాతి మొత్తమే నిర్మూలమైపోతుందనే భయాలు, లంపెన్ కార్మిక వర్గం వగైరా వగైరా జరుగుతున్నాయి. అంటే, మధ్యంతర దశలో పట్టణాలలోనూ, పట్టణాలుగా ఎదుగుతున్న ప్రాంతాలలోనూ జనాభా విపరీతంగా, వేగవంతంగా పెరిగే అవకాశం ఉంది. దానితోపాటే అంచులలో ప్రమాదకరంగా ఉండబోయే వర్గాల జనాభా విపరీతంగా పెరగబోతుంది. పెట్టుబడిదారులతో బేరసారాలు ఆడే శక్తిలేక అసమాన స్థితిలో ఉన్న కార్మికులు పట్టణాలలోని అసంఘటిత రంగంలో మనుగడకు సరిపోని జీతభత్యాలు పొందుతున్న అశేష వేతన కార్మికులు పెరిగిపోతున్నారు.

తప్పనిసరిగా సిపిఐ (మావోయిస్టు) ఈ పరిస్థితినంతా పరిగణనలోకి తీసుకోవలసి ఉంది. అంటే, పట్టణ ప్రాంతాలలో ఉద్యమం ఎలా నిర్మాణం అవుతుందనీ, కార్మిక శ్రేణులు ఎలా రూపొందుతాయనీ, కార్మిక కర్షక విప్లవ మైత్రికి నాయకులు ఎక్కడి నుంచి వస్తారనీ అనే ప్రశ్నలు తలెత్తుతాయి. పట్టణ పారిశ్రామిక కార్మికవర్గాన్ని సంఘటితం చేయడంలో విఫలం అయ్యారని మావోయిస్టుల మీద తరచుగా విమర్శ వినబడుతుంది. కాని, వారు ఒక ప్రధానమైన విజయం సాధించగలిగిన చోట కూడా, ఉదాహరణకు, సింగరేణి కార్మిక సమాఖ్య పేరుతో సింగరేణి గనులలో కార్మికులను సమీకరించినపుడు కూడా ఆ సంఘాన్ని నిషేధించారు. నాయకులు అజ్ఞాతవాసానికి వెళ్లవలసి వచ్చింది. కార్మికులను సమీకరించవలసిన కీలక ప్రాధాన్యత మావోయిస్టులకు తప్పనిసరిగా తెలుసు. ఎందుకంటే, కార్మిక వర్గం మాత్రమే రాజకీయంగా, సోషలిస్టు పద్ధతిలో చైతన్యీకరించబడినప్పుడు ఉత్పత్తి సాధనాలను సామాజికం చేయవలసిన అవసరం గుర్తిస్తుంది. తాము తలచుకుంటే సామూహికంగా ఆర్థిక వ్యవస్థను స్తంభింపచేయగలమని తెలుసుకుంటుంది. కార్మికవర్గం కనుక ఆర్థిక వ్యవస్థలోని కీలక రంగాలలో ఉన్నప్పుడు తాము తలచుకుంటే సామూహికంగా దోపిడీని అధిగమించగలమని గుర్తిస్తుంది. ఇక పట్టణ ప్రాంతాలలో ఇతర

***వెనిజులా లోని ప్రజల భాగస్వామ్యంతో అట్టడుగు నుంచి నిర్మితమవుతున్న కమ్యూనాల అంతిమ లక్ష్యం సామాజిక పరివర్తన, సోషలిజం దిశగా నడవడమేనని అంటున్నారు ఆంటెనియా జిమెనెజ్***

# వెనిజులా కమ్యూనాలు - 'కింది నుంచి సోషలిజం'

*(సోషలిస్ట్ సమాజ నిర్మాణ ప్రయోగాలు శాస్త్రీయ పద్ధతిలో పారిస్ కమ్యూన్ (1871) నుంచి మొదలయ్యాయి. బోల్షివిక్ విప్లవం (1917) నుంచి 1950ల దాకా సోవియట్ యూనియన్‌లో, 1949 నుంచి 1977 దాకా చైనాలో సోషలిస్ట్ సమాజ నిర్మాణానికి ప్రయత్నాలు, ప్రయోగాలు జరిగాయి. ఇటువంటి ప్రయోగాలు ఇతర దేశాలలో కూడా జరిగినప్పటికీ సోవియట్ యూనియన్‌లోని సహకార వ్యవసాయ క్షేత్రాలు, చైనాలోని కమ్యూన్లు సాగిన పద్ధతి ప్రపంచం దృష్టిని ఆకర్షించింది. అట్టడుగు స్థాయి నుంచి సోషలిస్ట్ సమాజం ఎలా పనిచేస్తుందో, సమానత్వాన్ని, న్యాయాన్ని, స్వేచ్ఛను ఎలా స్థాపిస్తుందో సహకార వ్యవసాయ క్షేత్రాలు, కమ్యూన్లు చూపించాయి. ప్రస్తుతం ఇదే వరుసలో వెనిజులాలో గ్రామీణ స్థాయి నుంచి కమ్యూన్లను నిర్మిస్తున్నారు. స్పానిష్ భాషలో 'కమ్యూనా' అని పిలిచే ఈ సామాజిక వ్యవస్థను నిర్మించి, బలోపేతం చేయడానికి దేశ స్థాయిలో కార్యకర్తల సంఘటిత నిర్మాణం ఒకటి ఏర్పడింది. అంతకు ముందు విద్యార్థి ఉద్యమ కార్యకర్తగా పనిచేసి, ప్రస్తుతం కమ్యూనా నిర్మాణంలో కార్యకర్తగా పనిచేస్తున్న ఆంటెనియా జిమెనెజ్ 'ది బులెట్' పత్రికా ప్రతినిధులు సూసాన్ స్ప్రాంక్, జెఫ్రీ ఆర్. వెబర్‌లకు ఇచ్చిన ఇంటర్వ్యూ అనువాదాన్ని ఈ కింద ఇస్తున్నాం. )*

## నేపథ్యం

కారకాస్ నగరం ఉత్తర భాగంలోని ఒక బస్తీలో నేను నివసిస్తాను. దేశవ్యాప్తంగా కమ్యూనాలను నిర్మిస్తున్న జాతీయ సంఘటిత నిర్మాణంలో పని చేస్తున్నాను. ప్రస్తుతం మా సంఘం ఏడు రాష్ట్రాలలో పనిచేస్తోంది. మేం నిర్మిస్తున్న కమ్యూనాలలో అత్యధిక భాగం కారకాస్ నగరానికి బయటే ఉన్నాయి.

మా కమ్యూనాల నిర్మాణం సమాజంలో ప్రతి ఒక్కరు పాల్గొనడానికి వీలైన రాజకీయ అవకాశాలను కల్పించబోతుంది. వెనిజులాకు సంబంధించినంత వరకు ఇది ఒక కొత్త అనుభవం. కమ్యూనా అనేది రాజ్యాంగ యంత్రం కాదు. గ్రామీణ మత సంస్థ కాదు. అది ఒక రాజకీయ స్థలం. దాన్ని ప్రజలు తమకోసం తాము నిర్మించుకుంటారు.

ప్రస్తుతం ఎన్నో గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనాలు ఏర్పడుతున్నాయి. గ్రామాలలోనే అవి బలంగా ఉన్నాయి. ఆ ప్రత్యేక స్థలంలో ఎటువంటి రాజకీయ సంస్కృతి ఉందీ, ఎటువంటి ఉత్పత్తి విధానం ఉందీ అనే దానిమీదనే ఆ కమ్యూనా ఎలా ఉందనేది ఆధారపడుతుంది. ఉదాహరణకు, సముద్ర తీర ప్రాంతంలో కమ్యూనా ప్రధానంగా చేపల పెంపకం మీద ఆధారపడుతుంది. లోతట్టు గ్రామాలలో అది భూమి మీద ఆధారపడుతుంది. ఈ విభిన్నమైన అనుభవాల నుంచి ఏ అంశాలను, ఏ సూత్రాలను గ్రహించగలమో తెలుసుకోవడానికి మేం ప్రయత్నిస్తున్నాం. ఉత్పత్తి పద్ధతులు, సంస్కృతులు వేరైనప్పటికీ, ఏ అంశాలు ఉమ్మడి ఉన్నాయో గుర్తించడానికి ప్రయత్నిస్తున్నాం. అందుకే, ఉత్తరాది నుంచి, దక్షిణాది నుంచి, తూర్పు నుంచి, పడమర నుంచి కమ్యూనాలను ఒక్కచోటికి పిలిచి జాతీయ స్థాయి సమావేశాలు ఏర్పాటు చేస్తున్నాం. ఒకరి అనుభవాలను మరొకరు వినడానికి, ఒకరి నుంచి మరొకరు అపజయాలు, విజయాలు కూడా నేర్చుకోవడానికి వీలు కల్పిస్తున్నాం.

---

ప్రజాసమూహాలను సమీకరించడం విషయానికి వస్తే ఇప్పటికే సాయుధ పోరాటం జరుగుతున్న ప్రాంతాలకు ఇరుగు పొరుగున ఉండే నగరాలలో పార్టీ ఆ పని చేస్తూనే ఉంది.

కార్మిక, కర్షక మైత్రి తర్వాత మరొక ముఖ్యమైన ప్రశ్న ఐక్య సంఘటనను రూపొందించడం ఎలా అనేది. మావోయిస్టుల దృష్టిలో నాలుగు వర్గాల ఐక్య సంఘటన గురించి ఉంటుంది. కాని, చైనాలో జరిగిన నూతన ప్రజాస్వామిక విప్లవ అనుభవం చూస్తే నిరంతర విప్లవం అనే మావోయిస్టు సూత్రాన్ని అనుసరిస్తే నూతన ప్రజాస్వామిక విప్లవం అనేది కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి రాగానే సోషలిస్టు విప్లవంగా మారిపోతుంది. అటువంటప్పుడు భారత బూర్జువా వర్గంలో సామ్రాజ్యవాద వ్యతిరేక సెక్షన్ అనేదేదైనా ఉన్నట్టయితే ఇటువంటి ఐక్య సంఘటనలో చేరడానికి సిద్ధపడుతుందా? అంతేకాదు, ఈ కాలంలో ప్రస్తుత పరిస్థితులలో భారత బూర్జువా వర్గంలో ఏ బృందం అయినా సరే అసలు విప్లవం మీద ఆసక్తి చూపుతుందా? అటువంటప్పుడు ఐక్య సంఘటనలో చేరే వర్గాల గురించి, దాని కార్యక్రమం గురించి మరింత ఎక్కువ సోషలిస్టు సారాంశాన్ని నింపడం ఉచితం కాదా?

## మావోయిజం చేసే వాగ్దానం

మొత్తంగా చెప్పాలంటే దీర్ఘకాలిక ప్రజాయుద్ధాన్ని విజయవంతం చేయడానికి ప్రాథమిక అవసరాలైన ప్రజాసంఘాల, ప్రజాసైన్యపు సమ్మేళనం గురించి భారతదేశంలోని విప్లవకర ప్రగతిశీల వర్గాలు, ఇతర దేశాలలోని ప్రగతిశీలురు కూడా మావోయిస్టులు ఈ తమ ఆచరణ శాస్త్రీయ సూత్రాన్ని ఎలా అమలు చేస్తారని వేచి చూస్తున్నారు. తప్పుల నుంచి సామూహికంగా నేర్చుకోవడం, మరింత విజయవంతంగా ఆచరించడం, ఇంకా ఎక్కువ, ఇంకా శక్తిమంతమైన వలయాలలో పైపైకి సాగితూ ఈ సామర్థ్యాన్ని మొత్తం భారత ప్రజానీకానికి ఎలా అందజేస్తారని, మొత్తం మానవజాతికే ఎలా అందజేస్తారని వేచి చూస్తున్నారు. వీ

**కమ్యూనాల లక్ష్యాలు**

కమ్యూనాల లక్ష్యాలు వేరువేరుగా ఉంటాయి. వేరు వేరు రూపాలు తీసుకుంటాయి. కమ్యూనాలు తయారు కాకముందు ఆయా ప్రాంతాలలో ప్రజలు వేరు వేరు సమూహాలుగా ఉండేవారు. తమ సమస్యలకు పరిష్కారాలు కనిపెట్టడానికి ప్రయత్నించేవారు. అది బస్తీ సంస్థ కావచ్చు, స్థానిక పురపాలక సంఘం కావచ్చు, అటువంటి మరేదైనా నిర్మాణం కావచ్చు. అటువంటి నిర్మాణాలలో ఏ కార్యక్రమాలు జరిగాయో తెలుసుకొని వాటిలోని మంచిని సంఘటితం చేసి, ఆయా ప్రజలు నివసించే ప్రాంతాల పునాదిగా కమ్యూనాలను ఏర్పాటు చేశాం.

అయితే మా దృష్టిలో కమ్యూనా ఒక ప్రాంతీయ పాలనా యంత్రాంగం మాత్రమే కాదు. అది ఒక రాజకీయ స్థలం కూడా. దాని లక్ష్యం శాశ్వత ప్రాతిపదిక పై సోషలిజాన్ని నిర్మించడం. అంటే, ప్రజలు తమ విద్య గురించి, తమ రాజకీయ భాగస్వామ్యం గురించి తామే బాధ్యత వహించేలా చేయడం. మేం సహజీవనం గురించి బోధిస్తాం. ఒక ప్రాంతంలో నివసించే వారందరూ కలిసి ఎటువంటి సహజీవనాన్ని గడపవచ్చునో వివరమైన ప్రణాళిక రూపొందిస్తాం. ఈ క్రమంలో కొత్త విషయమేమంటే ప్రజలు తమంతట తాము కూడా ఈ ప్రణాళికకు మార్పులూ చేర్పులూ చేస్తున్నారు.

నిజంగా ప్రజలు చాలా సృజనాత్మకంగా ఉంటారు. ఒక శాశ్వత పాలనా రంగాన్ని నిర్మించే కృషిలో వాళ్లు ఇతరులతో అలమరికలు లేకుండా పనిచేస్తున్నారు. ప్రభుత్వం తరఫున అక్కడికి వెళ్లిన అధికారులు అక్కడి ప్రజలు తమ కొరకు తాము, తమంతట తాము ఎటువంటి ప్రణాళికలు రచించుకుంటున్నారో అర్థం చేసుకోగలిగారు.

సహజంగానే, కొన్ని కమ్యూనాలు మరికొన్ని కమ్యూనాల కన్న అభివృద్ధి చెంది ఉంటాయి. పట్టణ ప్రాంతాలలో కమ్యూనాలను నిర్మించడం చాలా కష్టం. ఎందుకంటే, పట్టణ ప్రాంతాలలో ప్రజలకు వివిధ రకాల ఉత్పత్తి విధానాలతో పనిచేసిన అనుభవం ఉండదు. భూమితో పెట్టుబడిదారేతర సామాజిక సంబంధాలను కలిగి ఉండవచ్చునని వారికి తెలియదు. పట్టణంలో సాగే చలన నియమం మౌలికంగా పెట్టుబడిదారీ చలన నియమం. కాని, గ్రామీణ ప్రాంతాలలో ప్రజలు 'మనవైన' అంశాలను చాలా వాటిని సంరక్షించుకున్నారు. పూర్వీకుల నుంచి, స్థానిక ప్రజా సమూహాల నుంచి, ఆఫ్రో వెనిజులన్ సమాజాల నుంచి గ్రహించిన వివేకాన్ని కాపాడుకున్నారు. ఆ విలువలు ఇంకా కొనసాగుతున్నాయి. ఈ కారణం వల్లనే పట్టణ ప్రాంతాలలో కన్నా గ్రామీణ ప్రాంతాలలో కమ్యూనాలను నిర్మించడం సులభం. గ్రామీణ ప్రాంతాలలో జనం తక్కువగా ఉంటారనే మాట నిజమే కాని, వారి నాణ్యత చాలా ఎక్కువ. ఒక్కో గ్రామంలో ఒక్కోసారి చావెజ్‌కు ఓటు వేయని మనిషి ఒక్కరు కూడా ఉండరు. పట్టణంలో అది భిన్నంగా ఉంటుంది.

**ఈ పనిలోకి ఎలా వచ్చాను?**

మొదట నేను విశ్వవిద్యాలయంలో విద్యార్థి కార్యకర్తగా ఉండేదాన్ని. చావెజ్ కన్న ముందు కూడా నేను రాజకీయోద్యమాలలో క్రియాశీలంగా ఉండేదాన్ని. కాని, అప్పటికి సామాజిక ఉద్యమాలకూ, రాజకీయ పార్టీలకూ మధ్య సంబంధం ఉండేదికాదు. 1992లో ఛావెజ్ జైలు నుంచి విడుదలయ్యాక పరిస్థితులు మారడం మొదలైంది. ప్రజా ఉద్యమంలో అట్టడుగు గ్రామీణ ప్రాంతాలతో మాకు మొదటి నుంచీ సంబంధం ఉంది. కాని, ఛావెజ్ విడుదల కన్న ముందు అక్కడ మేం పాల్గొనడానికి తగిన రాజకీయ స్థలం లేకుండింది. అందువల్ల రాజకీయాల బదులు ఇరుగు పొరుగు సమస్యలలోనో, ప్రజా సంఘంలోనో లేదా, సాంస్కృతిక బృందంలోనో మాత్రమే పనిచేయడానికి అవకాశం ఉండింది.

కాని, ఛావెజ్ విడుదలయ్యాక 1998 ఎన్నికల కోసం ఒక రాజకీయ ఉద్యమాన్ని నిర్మించడం ప్రారంభించాక పరిస్థితులు మారిపోయాయి. నేను అందులో భాగం పంచుకున్నాను. కారకాస్‌లో ఆ ప్రక్రియను, ఉద్యమాన్ని నిర్మించడం నా బాధ్యతగా ఉండింది. కారకాస్ ప్రజా సమన్వయంలో నేను మొదట భాగం పంచుకున్నాను. ఆ తరువాత కమ్యూనాలు నిర్మించే ప్రక్రియలోకి వచ్చాను. ఇప్పుడు నేను కమ్యూనాల మీద పనిచేస్తున్న బృందంలో సభ్యురాలిని.

కమ్యూనాల గురించి విభిన్నమైన ఆలోచనలు ఉన్నాయి. ఉదాహరణకు, మేం కార్యకర్తలం ఆలోచించే వాటికీ, ఛావెజ్ సూచించిన వాటికీ కూడా తేడా ఉంది. ఎన్నో రకాల అభిప్రాయాలున్నాయి. కాని, మేం కమ్యూనాలను కింది నుంచి, ప్రజల నుంచి నిర్మిస్తున్నాం. పై నుంచి ప్రభుత్వం చెప్పినట్టుగా కాదు. మేం నిజంగా అసాధారణమైన విజయాలు సాధించాం. అయితే, మా విజయాలలో శక్తిమంతమైనవి సాధించడం మాత్రం ఈ మార్గం గురించి ప్రజలలో సమ్మతి దొరికినప్పుడు సాధ్యమయింది. వాళ్లు క్రియాశీలంగా పాల్గొన్నప్పుడు మాత్రమే సాధ్యమయింది.

**కమ్యూనాల పని**

చారిత్రకంగా చూస్తే జనావాసాలలో సమస్యలను పరిష్కరించడానికి ఎన్నెన్నో రకాల సంస్థలూ, సంఘాలూ ఉనికిలోకి వచ్చాయి. నిర్దిష్టమైన సమస్యల మీద ఉమ్మడిగా పనిచేయడానికి ఈ సంస్థలన్నిటినీ ఒక్కచోటికి తేవడం మా లక్ష్యం. అందుకోసం మేం అధ్యయన తరగతులు ఏర్పాటు చేశాం. ఉదాహరణకు, ఒక ప్రజా సమూహానికి తాగునీటి కొరత ఉందనుకోండి. అక్కడ మేం మంచినీటి సమస్య గురించి ఒక సమావేశం ఏర్పాటు చేస్తాం. అక్కడ మాట్లాడే వాళ్లు 'చూడండి, మా సమస్యలు మేమే పరిష్కరించుకోగలం' అంటారు. అక్కడ సమస్యకు ఒక సోషలిస్టు పరిష్కారం ఏమైనా ఉందా అని మేం వెతుకుతాం. ఆ సమస్యను పరిష్కరించే పనిని ఏదో ఒక ప్రైవేట్ కంపెనీకి అప్పగించడం కాదు. ప్రభుత్వంతోనూ, ప్రజలతోనూ కలిసి ఆ సమస్యను పరిష్కరించే మార్గాలు వెతుకుతాం. మొట్టమొదట ప్రజల మౌలిక అవసరాల దగ్గర ప్రారంభించి పనిచేస్తే ప్రజలు తమంతట తామే అందులో పాల్గొనడానికి ప్రేరణ పొందుతారు. అలాగే, భవిష్యత్తు గురించి ఎక్కువ ఆలోచించడానికి, దీర్ఘకాలంలో పరిస్థితులు మెరుగుపర్చడానికి ఏమి చేయాలని కూడా మేం ప్రజల భాగస్వామ్యం కోరుతాం.

అంచెలంచెలుగా ఒక్కొక్క సమస్యను పరిష్కరిస్తూ, సామాజిక సహజీవనం వంటి సాధారణ సమస్యలను పరిష్కరించే దిశగా ముందడుగు వేస్తాం. మెరుగైన సహజీవనం సాగాలంటే కొన్ని పద్ధతులు కావాలి. కొంత ప్రయత్నం కావాలి. అవి అందరి దృష్టికి తేవడానికి మేం ప్రయత్నిస్తాం. ఉదాహరణకు, ఒక సమూహం అంతా కలిసి 'వీథుల్లో తాగడం మంచిది కాదు' అని నిర్ణయిస్తుందనుకోండి. ఇతరులంతా కూడా ఈ చిన్న మార్పులను గుర్తిస్తారు. వాటికి ఫలితాలున్నాయని చూశాక పోరాటంలో భాగస్తులవుతారు. ఈ విధంగా సామూహిక, సంఘటిత కృషి సాధ్యమే అని ప్రతి ఒక్కరూ గుర్తిస్తారు.

కమ్యూనాలను ప్రోత్సహించే, సమన్వయపరిచే ఒక బృందం ఉంది. కాని, ప్రజల భాగస్వామ్యం అనేదే కీలకం. కమ్యూనాలో అన్ని రకాల

ప్రజలు పాల్గొంటారు. వామపక్ష భావాలున్నవాళ్లు, అభివృద్ధి నిరోధక భావాలున్న వాళ్లు, దేని గురించి ఏమీ పట్టించుకోని వాళ్లు అందరూ ఉంటారు. కాని, తమ కుటుంబానికి సంబంధించిన సమస్య వచ్చినప్పుడో, తమ పిల్లల చదువుకు సంబంధించిన బడి సమస్య వచ్చినప్పుడో జనం అందులో భాగం పంచుకుంటారు.

ప్రతి ఒక్కరూ సోషలిస్టులు కాదు. నిజం చెప్పాలంటే, కమ్యూనాలలో భాగం పంచుకుంటున్న వారిలో అతితక్కువ మంది మాత్రమే సోషలిస్టులు. కాని, ప్రజలందరూ పట్టించుకునే అంశాలన్నిటి మీద మనం పనిచేయాలి. మన ఆచరణలో ఇది చూపినప్పుడే ప్రజలు అంతకంతకూ ఎక్కువగా ఈ కృషిలో పాల్గొంటారు.

**సోషలిజం నిర్మాణంలో సమస్యలు?**

మా కృషికి ఆటంకంగా ఉన్న ఒక అంశం ఎన్నికల రాజకీయాలు. ఇది చాలా విసుగెత్తించే వ్యవహారం. ఎన్నికల ప్రచారంలో మునిగిపోవడం వల్ల ప్రజాసమూహాల స్థాయిలో మేం సాగిస్తున్న కృషిని సంఘటితపరచుకోవడానికి అవకాశాలు తగ్గిపోతాయి. రాజ్యాంగ నిర్ణయ సభ, ప్రజాభిప్రాయ సేకరణ, సార్వత్రిక ఎన్నికలు తర్వాత అధ్యక్ష ఎన్నికలు, తర్వాత గవర్నర్ ఎన్నికలు వగైరాలు వరుసగా జరగడం వల్ల వాటి మీద కేంద్రీకరించి, ప్రజల సమస్యల పరిష్కారం మీద ఎక్కువగా పనిచేయలేకపోయాం. ప్రస్తుతం మునిసిపల్ కౌన్సిలర్ల ఎన్నికలలో మునిగి ఉన్నాం. ఇటువంటి నిరంతరమైన ఎన్నికల రాజకీయాలు నిజమైన ప్రజా కార్యాచరణను స్థానిక స్థాయిలో బలహీనపరుస్తాయి. ప్రజలు ఎదుర్కొంటున్న నిత్యజీవిత సమస్యల నుంచి మమ్మల్ని దూరం చేస్తాయి.

**మా ప్రాంతంలో ప్రధానమైన కోరికలు**

ఇక నేను ప్రధానంగా పనిచేసే కారకాస్ ఉత్తర మండలం విషయానికి వస్తే ఈ ప్రాంతంలో ముఖ్యమైన సమస్య పద్ధతి లేకుండా సాగిపోయిన పట్టణీకరణ. ఇక్కడ భూమిలో అత్యధిక భాగం అతి కొద్దిమంది పెట్టుబడిదారుల చేతుల్లో ఉంది. ఇక మామూలు జనం ఇళ్లు కట్టుకోవడానికి స్థలం లేక కొండ మీద, లోయ అంచున గుడిసెలు వేసుకోవలసి వస్తుంది. అక్కడ ఆశ్రయం ఉండడం ప్రమాదకరం గనుక ఇంతకాలమూ ఆ స్థలాన్ని ఖాళీగా వదిలేయడం జరిగింది. కారకాస్ నగర ప్రాంతంలో ఇరవై తొమ్మిది నదులున్నాయి. పెద్ద వర్షం పడిందంటే చాలు ఈ గుడిసె వాసులందరూ ప్రమాదంలో ఉన్నట్టే. వారి గుడిసెలు కొట్టుకుపోతాయి. ఎంతోమంది చచ్చిపోతారు. ఉదాహరణకు 1999లో ఇటువంటి ఉత్పాతం జరిగి ఎంతో మంది చనిపోయారు. ఈ సమస్యకు పరిష్కారం కావాలని జనం కోరుతున్నారు.

మరొక సమస్య భౌతికమైన అభద్రత. రక్షణ లేకపోవడం. జనం కలుసుకోవాలంటే భయపడిపోతున్నారు. అది నిజంగా ఒక పెద్ద సమస్య. అభివృద్ధి నిరోధక ప్రతిపక్షాలూ, ప్రచార సాధనాలూ కూడా ఈ సమస్యను భూతద్దంలో చూపుతున్నాయి. మురికివాడల్లో మాత్రమే ఈ అభద్రత సమస్య ఉందని ప్రచారం చేస్తున్నాయి. దీనికన్న తీవ్రమైన సమస్యలున్నాయని నా అభిప్రాయం. కాని, ప్రతిపక్షాలూ, ప్రచార సాధనాలూ దాని గురించి చెబుతున్నాయి గనుక, అంతటా దాని గురించే చర్చ జరుగుతోంది.

**విప్లవం తరువాత ప్రజాజీవనంలో మార్పులు**

బొలివారియన్ విప్లవం తరువాత ప్రజా జీవిత ప్రమాణాలలో చాలా మెరుగుదల వచ్చింది. ప్రధానమైన మార్పులలో ఒకటి, విద్యారంగంలో వచ్చినవి. ఈ మార్పు మిషన్ల ద్వారా, ఉదాహరణకు, మిషన్ సుక్రె వంటి వాటి ద్వారా వచ్చింది. ఇప్పుడు ఎవరైనా విశ్వ విద్యాలయానికి వెళ్లి చదువుకోదలచుకుంటే చదువుకోవచ్చు. అంతకు ముందు వెనిజులా విశ్వవిద్యాలయంలో నాలాంటి పేద విద్యార్థులు కేవలం ఏడు శాతం మంది ఉండేవారు. సైమన్ బొలివార్ విశ్వవిద్యాలయంలోనయితే రెండు శాతం మాత్రమే పేదలు. కాని ఇప్పుడు ప్రతి ఒక్కరికీ రాత్రిపూట చదువుకునే అవకాశం ఉంది. నిజం చెప్పాలంటే ఇప్పుడు ప్రతి ఒక్కరూ చదువులో మునిగి ఉన్నారు కనుక, సమావేశాలు ఏర్పాటు చేసుకోవాలనుకోవడం కూడా కష్టం అయిపోతున్నది. వారాంతపు సెలవు రోజుల్లో మాత్రమే సమావేశాలు పెట్టుకుంటున్నాం.

మరొక కీలకమైన మార్పు ఏమంటే, 1998కి ముందు మురికి వాడలలో, బస్తీలలో రాజకీయ చర్చలే ఉండేవి కావు. నాలాంటి కొద్దిమంది మాత్రం ఆ పరిస్థితిని మార్చి రాజకీయ చర్చలు జరగాలని ప్రయత్నించేవాళ్లం. 1980లలో కేవలం విద్యార్థులు మాత్రమే సంఘటితమై వీధుల్లోకి వస్తుండేవాళ్లు. కాని, ఇప్పుడో, ఎక్కడ చూస్తే అక్కడ జనం రాజకీయాలు మాట్లాడుకుంటున్నారు. బస్సులో చూడండి, బార్‌లో చూడండి, ఇద్దరు వ్యక్తులు కూచుని మాట్లాడుకుంటున్నారంటే రాజకీయాలు మాట్లాడుకుంటున్నట్టే.

మరొక ముఖ్యమైన విజయం ఏమంటే, జనం ఇప్పుడు సోషలిజం గురించి మాట్లాడుతున్నారు. మార్క్స్ లాగానో, లెనిన్ లాగానో వాళ్లు సోషలిజం గురించి 'శాస్త్రీయ' పద్ధతిలో మాట్లాడుతూ ఉండకపోవచ్చు. కాని, సోషలిజం గురించి వాళ్లు తమ ఇంటి వ్యవహారం మాట్లాడుకున్నట్టు మాట్లాడుకుంటారు. సోషలిజం గురించి మాట్లాడడం అంటే ఇంకా కొంచెం భయం ఉంది. కాని, అది ఇదివరకన్న చాలా తక్కువ. ఇక్కడ ఒక ఉదాహరణ చెబుతాను. 1980లలోనో, 90లలోనో ఒక బస్తీలో మేం సోషలిజం గురించి ఒక సినిమా చూపెట్టాం. చాలా మంది జనం వాళ్లు అప్పటికే పత్రికల్లో చదివిన మాటలు చిలుక పలుకుల్లాగా వల్లించారు. సోషలిస్టులు మనుషులను చితకబాదుతారట. సోషలిస్టులంటే నియంతలట. మరి ఇప్పుడో సోషలిజం, ప్రజాస్వామ్యం కలిసి సాగుతాయని జనానికి అర్థమయింది. ప్రజాస్వామ్యం అనే భావనే మారిపోయింది. ఛావెజ్‌ను హత్య చేయడానికి అనేక ప్రయత్నాలు జరుగుతున్నాయి గనుక ఒకవేళ ఆయన హత్య చేయబడితే నిజంగా దేశంలో అంతర్యుద్ధమే జరుగుతుంది.

అయితే, ఏమి జరిగినప్పటికి ప్రజలందరూ భాగం పంచుకుంటున్న ప్రజాస్వామ్య పురోగతిని వెనక్కి తిప్పడం సాధ్యం కాదు. పాతకాలపు ప్రాతినిధ్య ప్రజాస్వామ్య కాలానికి వెళ్లిపోలేం. ఇవాళ ఉన్నలాంటి వామపక్షం కాక, మరొక వామపక్షం రావచ్చు. కాని, అక్కడ కూడా ప్రజలు పాల్గొనవలసిందే. ఈ మొత్తం విప్లవానికి కీలక భాగం భాగస్వామ్య ప్రజాస్వామ్యం. దీని ప్రాముఖ్యతను ప్రజలు అర్థం చేసుకున్నారు. దీన్ని ఆకాంక్షిస్తున్నారు. దీన్ని అమలు చేయాలని ఆలోచిస్తున్నారు.

ఇటువంటి ప్రజాస్వామ్యంలో రాజకీయాలు ఎంత భిన్నంగా ఉంటాయో ప్రజలు గుర్తించారు. గతంలో రాజకీయ వాస్తవికత అంతా కూడా అధ్యక్ష భవనం మిరా ఫ్లోజ్‌లో ఏమీ జరుగుతుందనే దాని మీదనే కేంద్రీకృతమై ఉండేది. ఇప్పుడు రాజకీయ కార్యాచరణ విస్తృతంగా ఉంది. ఎన్నో ముఖ్యమైన సామాజిక ఉద్యమాలు ఉన్నాయి. ఎన్నో అవకాశాలు ఉన్నాయి. ఆశ ఉంది. ఇప్పుడు గతంలో లాగా ప్రజలు కేవలం అయిదేళ్ల పాటు ఎదురు చూసి ఎన్నికలలో పాల్గొని, మౌనంగా ఉండిపోయే పరిస్థితి ఇంకెంత మాత్రమూ లేదు. యూనైటెడ్ సోషలిస్టు పార్టీ ఆఫ్ వెనిజులాలో డెబ్భై లక్షల క్రియాశీల సభ్యులున్నారు. కమ్యూనాల పాలక మండళ్లలో పాల్గొంటున్న మరెన్నో లక్షల మంది ప్రజలు ఉన్నారు.

ఈ మాట అంటున్నానంటే ప్రతి ఒక్క మనిషిలోనూ రాజకీయ చైతన్యం అభివృద్ధి అయిందనో, రాజకీయ అనుభవం వచ్చిందనో కాదు. ఇది ఇంకా ఒక పరిణామ ప్రక్రియ. విప్లవ కార్యకర్తలు లేకుండా విప్లవ పార్టీ ఉండే అవకాశం లేదు. విప్లవకారులను తయారు చేసే నిబద్ధత ఇంకా సంపూర్ణంగా అభివృద్ధి చెందలేదు.

బొలివారియన్ విప్లవ ప్రక్రియలో ఇంకా చాలా సమస్యలు ఉన్నాయి. మేం కీలకమైన ఆర్థిక విజయాలను సాధించగలిగాం. ఉదాహరణకు నిరుద్యోగం తగ్గింది. కనీస వేతనాలు పెరిగాయి. పదవీ విరమణ అనంతరం ఇచ్చే భృతి పెరిగింది. కాని, ఇప్పటికీ రాజకీయ చైతన్య స్థాయి తక్కువగానే ఉంది. మేం ఇంకా పురోగమించాలంటే, రాజకీయ, ఆర్థిక సిద్ధాంతాలను ప్రజలందరూ అర్థం చేసుకొని, అన్వయించగలిగిన స్థితి ఉండాలి. ఉదాహరణకు, క్యూబాలో చూడండి. వీథిలో కనబడిన ఏ సాధారణ వ్యక్తిని ప్రశ్నించినా, తమ దేశంలో ఏం జరుగుతున్నదో, ప్రపంచంలో ఏం జరుగుతున్నదో విశ్లేషిస్తారు. క్యూబాలో రాజకీయ చైతన్య స్థాయి ఉన్నతంగా ఉంది. అటువంటి విప్లవ చైతన్య స్థాయి వెనిజులాలో ఇంకా రాలేదు. అలా రాకపోవడం విప్లవానికి ప్రమాదకరం. మేం చాలా సాధించామనే మాట నిజమే కాని, సాధించవలసింది ఇంకా చాలా ఉంది.

**కమ్యూనాలలో భాగస్వామ్య ప్రజాస్వామ్యం**

భాగస్వామ్య ప్రజాస్వామ్యం అనేది మేం అమలు చేయదలచుకున్న లక్ష్యమే గాని, ప్రస్తుతం కొనసాగుతున్న స్థితి కాదని మేం సాధారణంగా అంటూ ఉంటాం. దాని అర్థమేమంటే, మేం చేయదలచుకున్న దాన్ని మేం తప్పకుండా నిర్మిస్తామని, దాని కోసం ఏ దోహదం చేయాలో మేం నిర్ణయించుకున్నామని, మా జీవితాలను మెరుగుపర్చుకునే పథకాలను మేం సిద్ధం చేసుకున్నామని.

ఈ భాగస్వామ్యం అనేది ప్రతి ఒక్కరికీ సంబంధించినది. వాళ్లు ప్రభుత్వంలో ఉన్నవాళ్లయినా సరే, ప్రభుత్వానికి వ్యతిరేకులైనా సరే. వామపక్ష వాదులైనా సరే, మితవాదులైనా సరే. ప్రజలందరూ పాల్గొనే సభకు మాత్రమే అంతిమ అధికారం ఉంటుంది. అది తప్పనిసరిగా జనసభ కావాలి. కొందరు ఎన్నికైన వ్యక్తుల బృందం కాదు. ప్రతి కమ్యూనాలో అభివృద్ధి ప్రణాళిక ఎలా ఉండాలనే విషయాన్ని ఈ జనసభే నిర్ణయిస్తుంది.

చర్చలూ, వివాదాలూ జరిగినప్పుడు ఏకాభిప్రాయానికి రావడానికి మేం ప్రయత్నిస్తాం. అది కూడా సాధ్యం కాకపోతే, చర్చిస్తూనే ఉంటాం. ఏ అంగీకారమూ కుదరకపోతే, మొత్తం విషయాన్ని ముక్కల కింద విడగొట్టి, ఏ చిన్న ముక్క విషయంలో అంగీకారం ఉన్నదో గుర్తిస్తాం. మా దృష్టిలో రాజకీయాలు తయారయ్యే ప్రక్రియ ఈ భాగస్వామ్యంలోనే ఉంది. అలాగే, ఆ నిర్ణయించుకున్న ప్రణాళికను అమలు చేయడంలో కూడా ప్రతి ఒక్కరికీ భాగస్వామ్యం ఉంటుంది. ఉదాహరణకు, ఒక జనసభ ఒక జలాశయం కావాలని కోరుకున్నదనుకోండి. 'సరే, ఇదిగో ఈ నిధులు తీసుకోండి. ఈ నిధులు మీరే ఖర్చుపెట్టి, మీరు కోరుకున్నది నిర్మించుకోండి' అని ప్రభుత్వం చెబుతుంది.

అయితే జాతీయ స్థాయిలో ఏ విధానం ఉండాలి అనే విషయంలో ప్రత్యక్షంగా మా భాగస్వామ్యం లేదు. మంత్రులు నిర్ణయించే విధానాలు భాగస్వామ్య ప్రక్రియ ద్వారా నిర్ణయం జరగడం లేదు. అందుకని 'మరి, మేం కూడా భాగస్వామ్యం వహించాలి కదా?' అని అన్నాం. ఎప్పుడూ మేం స్థానిక స్థాయిలోనే భాగస్వామ్యం వహిస్తున్నాం. కాని, సోషలిజం అంటే స్థానిక స్థాయిలో మాత్రమే జరిగేది కాదు. స్థానిక అంశాలను, ప్రాంతాలను, కమ్యూనాలను అన్నిటినీ సమైక్యం చేసే ఒక చట్రాన్ని మనం తయారు చేయవలసి ఉంది. ఎందుకంటే, స్థానిక స్థాయిలో ఏం జరుగుతున్నదనే విషయం మీద జాతీయ, అంతర్జాతీయ స్థాయిల ప్రభావం ఉంటుంది. చుట్టూ ఒక పెట్టుబడిదారీ విధాన సముద్రం ఉన్నప్పుడు మధ్యలో ఒక చిన్న ద్వీపం లాగా సోషలిస్టు కమ్యూనాను నిర్మించలేం. అప్పుడు మనం మన ఇచ్చిపుచ్చుకోవడం ఎవరితో చేస్తాం?

కేంద్ర స్థాయిలో కమ్యూనాల ప్రజాశక్తి, సామాజిక పరిరక్షణ మంత్రిత్వ శాఖ (మినిస్ట్రీ ఆఫ్ పాప్యులర్ పవర్ ఫర్ ది కమ్యూనాస్ అండ్ సోషల్ ప్రొటెక్షన్) ఉంది. కాని, దాని విధానాన్ని నిర్ణయించే భాగస్వామ్య యంత్రాంగం లేదు. ప్రస్తుతానికయితే స్థానిక ఆదివాసీ తెగలతో ఈ ప్రయత్నం సాగిస్తున్నాం. ఆదివాసుల వ్యవహారాల మంత్రిత్వ శాఖలో ఆదివాసీ సమూహాలే పాల్గొంటున్నాయి. వాళ్లే నిర్ణయాలు తీసుకుంటున్నారు. విధాన నిర్ణయం కోసం వాళ్లకు ఒక జాతీయ సమితీ ఉంది. అలాగే, కమ్యూనాల మంత్రిత్వ శాఖ మీద కూడా కమ్యూనాలకే ఎక్కువ అదుపు ఉండాలని ఒక ప్రతిపాదన చేశాం. అది ఇంకా ఆమోదం పొందలేదు. చాలా చోట్ల నుంచి వ్యతిరేకత వస్తోంది.

ఇక్కడ మీరు అర్థం చేసుకోవలసిన విషయం ఒకటుంది. కమ్యూనాలనేవి అధికార స్థలాలు. కొన్ని కమ్యూనాలలో స్థానిక స్వపరిపాలన ప్రభుత్వాల దగ్గరికన్న ఎక్కువ వనరులు ఉన్నాయి. అందువల్ల కమ్యూనాల మీద అధికారం కోసం కూడా పెనుగులాట జరుగుతోంది. కమ్యూనాలలో ఎక్కువ భాగం పి.ఎస్.యు.వి.లో భాగంగానే ఉన్నాయి. కాని, చాలా తరచుగా స్థానిక స్థాయిలో ఉండే ఛావిస్టా అధికారులు తమ అధికారాన్ని ఇతరులతో పంచుకోవడానికి సిద్ధంగా ఉండరు. అందువల్ల కమ్యూనాలకూ, ఛావిస్టా మేయర్లకూ, గవర్నర్లకూ మధ్య ఘర్షణ సాగుతుంది. ఛావెజ్‌తో పాటు కలిసి ఫొటో దిగినప్పుడు మేం అందరం చేతులు పట్టుకొని ఆత్మీయంగా నిలబడి ఉంటాం గాని, ఆచరణలో మా మధ్య నిజమైన ఘర్షణ ఉంది. ఈ చలన సూత్రాన్ని గవర్నర్లు అర్థం చేసుకోలేపోతున్నారు. వాళ్లు తమ అధికారాన్ని కోల్పోవడానికి సిద్ధంగా లేరు.

ఈ గవర్నర్లు, మేయర్లు తమ పాలన నుంచే, తమ నాయకత్వం నుంచే సోషలిజాన్ని నిర్మించబోతున్నామని అనుకుంటారు. కాని, ప్రజలందరికీ భాగస్వామ్యం ఇచ్చే రాజ్యాంగ యంత్రం ఏర్పడకుండా సోషలిజం సాధ్యమే కాదు అని మేం నమ్ముతాం. ఇవాళ్టికి ఇవాళ సంపూర్ణమైన సోషలిస్టు కమ్యూనా అనేది లేదు. అంటే, ప్రతి ఒక్క విషయం చర్చించబడే కమ్యూనా, ప్రత్యామ్నాయ సోషలిస్టు ఆర్థిక ప్రణాళిక అమలయ్యే కమ్యూనా, ఉపాధ్యాయులు కూడా కమ్యూనాలో నుంచి వచ్చిన వాళ్లే అయి యువతరానికి శిక్షణ ఇచ్చే కమ్యూనా. ఇది భవిష్యత్తులో ఒకానొక రోజు సాధ్యం కావచ్చు. ఇప్పుడు మాత్రం మరొక స్థాయిలో ప్రభుత్వం అనేది ఉంది గనుక, అదే మొత్తం బడ్జెట్‌ను నిర్ణయిస్తుంది గనుక ఈ కమ్యూనా సాధ్యం కాదు. చేయవలసిందేమంటే, ఈ కమ్యూనాలన్నిటినీ జాతీయ స్థాయిలో సమన్వయ పరచడం. కాని, ప్రస్తుతం ఇది కూడా సాధ్యం కాదు. ఎందుకంటే, అనేక చోట్ల ఆ ప్రాంత పాలనా బడ్జెట్‌ను నిర్ణయించడంలో కమ్యూనాలకు పాత్రలేదు. కమ్యూనాలు చేసేదల్లా చిన్న చిన్న పథకాలలో భాగం పంచుకోవడమే. స్థానిక ప్రభుత్వాలేమో అసలు మనం ఒక సోషలిస్టు పరివర్తనా దశలో ఉన్నామనే సంగతే తెలియనట్టు తమ పాలన తాము సాగిస్తుంటాయి.

కమ్యూనాకు పాత్ర ఇచ్చి, బడ్జెట్‌లో కూడా భాగస్వామ్య ప్రజాస్వామ్యాన్ని ప్రవేశపెట్టడం వాస్తవికంగా జరిగిన రెండే రెండు సంఘటనలు నాకు తెలుసు. ఒకటి, లారా రాష్ట్రంలో టొరెస్ నగరంలో జరిగింది. మరొకటి, ఫాల్కెన్ రాష్ట్రంలో బొలివార్ నగరంలో జరిగింది.

ఈ రెండు స్థానిక ప్రభుత్వాలలోనూ మేయర్లుగా ఉన్న కామ్రేడ్స్ నిజంగా వామపక్ష వాదులు. అక్కడి గవర్నర్‌లలో చాలా మంది మాత్రం వామపక్ష వాదులు కాదు. చాలా సందర్భాలలో రాజ్యాంగ యంత్రమేమో బూర్జువాల చేతుల్లో ఉంటుంది. వారి నుంచి దాన్ని తీసివేయడమే నిరంతర ఘర్షణకు కేంద్రం అవుతుంది. దీనికోసం పెద్ద ఎత్తున రాజకీయ శక్తిని ఖర్చు పెట్టవలసి ఉంటుంది. అధ్యక్షుడు ఛావెజ్‌కు ఈ వైరుధ్యాల గురించి అవగాహన ఉందనే అనుకుంటున్నాను. కాని, ఈ సమస్య నుంచి గట్టెక్కే మార్గం ఆయనకు కూడా ఇంకా తెలియలేదు. అది సులభం కూడా కాదు. ఎందుకంటే ఒక పక్కనేమో సంఘటితులైన, విభిన్న ప్రతిపాదనలు చేస్తున్న ప్రజలు ఉన్నారు. మరొక పక్కనేమో అదే పార్టీకి చెంది, బూర్జువా రాజ్యాంగ యంత్రాన్ని బలోపేతం చేయదలచుకున్న మరికొందరు ఉన్నారు.

### కమ్యూనాలలో మహిళల పాత్ర

కమ్యూనాలలో పాల్పంచుకునే వారిలో అత్యధిక సంఖ్యాకులు మహిళలు. ఈ కమ్యూనాల ప్రక్రియ సాధించిన విజయాల గురించి మాట్లాడేటప్పుడు ఈ అంశం మాట్లాడడం చాలా ముఖ్యమని నాకనిపిస్తుంది. ప్రస్తుతం అట్టడుగు స్థాయిలో మహిళల భాగస్వామ్యం చాలా ఎక్కువగా ఉంది. కాని, అది అక్కడే ఆగిపోతుంది. ఇంకా ఎక్కువ బాధ్యతలు నిర్వహించే పదవుల కోసం ఎన్నికలు జరిగేటప్పుడు అభ్యర్థులందరూ పురుషులే అయి ఉంటారు.

ఈ ధోరణిని అరికట్టడానికి అధ్యక్షులు ఛావెజ్ అనేక సూచనలు చేశారు. చర్యలు చేపట్టారు. కొంత పురోగతి జరిగింది. ఉదాహరణకు పార్టీ పదవులకు అభ్యర్థులలో యాభై శాతం మహిళలు ఉండాలి అని ఆయన సూచించారు. ఇక జనసభల దగ్గరికీ, సమావేశాల దగ్గరికీ వెళితే, అక్కడ పాల్గొనే వారిలో అత్యధిక సంఖ్యాకులు మహిళలే. చదువుకుంటున్న వారిలో అతి ఎక్కువ మంది మహిళలే. చారిత్రకంగా చూస్తే, వెనిజులాలోనూ, అసలు మొత్తంగా లాటిన్ అమెరికాలోనూ మా సమాజాలలో స్త్రీల పట్ల వివక్ష చాలా ఎక్కువ. స్త్రీలు ఇల్లు వదిలి బయటికి రావడమే చాలా కష్టం. ఛావెజ్ అధికారానికి రాకముందు మహిళల బహిరంగ జీవనం చాలా తక్కువ. కేవలం వామపక్షాలకు చెందిన అగ్రగామి చైతన్యం కలిగిన స్త్రీలు మాత్రమే సామాజిక, రాజకీయ జీవితంలో పాల్గొంటూ ఉండేవాళ్లు. కాని, ఇప్పుడు స్త్రీల భాగస్వామ్యం విస్తృతంగా ఉంది. ఈ ప్రక్రియకు సంబంధించిన అత్యున్నత స్థాయిలో ఎంతోమంది విలువయిన మహిళలు అద్భుతమైన పనులు చేస్తున్నారు.

అయితే ఇప్పటికీ మారవలసిన విషయాలు కొన్ని ఉన్నాయి. ఉదాహరణకు, చట్టాలు. నేను గర్భవతినయితే నాకు ఆరు నెలల విశ్రాంతికి అవకాశం దొరుకుతుంది. కాని, నా భర్తకు ఒక్క రోజు కూడా ఆ అవకాశం దొరకదు. ఈ విషయంలో సమానత్వం ఎందుకుండదు అనేది మా ప్రశ్నలలో ఒకటి. ఈ విషయంలో మేం విజయం సాధిస్తామని నా నమ్మకం.

మరొక పరిమితి ఏమంటే, వెనిజులాలో పిల్లల బాధ్యత సంపూర్ణంగా స్త్రీలదే. తమ పిల్లలని ఎక్కడో ఒకచోట పెట్టి రావలసి వస్తుంది గనుక, స్త్రీలు జనసభలోనూ, కమ్యూనా సమితిలోనూ పాల్గొనడం చాలా కష్టమవుతుంది. అందువల్లనే ఎక్కువ బాధ్యతలు నిర్వహించవలసిన రాజకీయ పదవులలోకి స్త్రీలు రావడం, వారి నిర్ణయాలు అక్కడ అమలు కావడం, మరీ ముఖ్యంగా ఆ పదవులు ఎక్కువ ప్రయాణాలతో ఉండేవైనప్పుడు కష్టం అవుతుంది. జనసభలలో స్త్రీల పాత్ర చాలా ఎక్కువగా ఉన్నప్పటికీ ఈ సమస్య ఒక నిజమైన అడ్డంకే.

### దీర్ఘకాలిక లక్ష్యం

కమ్యూనాల ద్వారా అట్టడుగు నుంచి భాగస్వామ్య ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి చేసే విషయంలో దీర్ఘకాలిక లక్ష్యం ఎలా ఉండాలి? ఇక్కడ ప్రభుత్వ దృక్పథానికన్నా నా దృక్పథం భిన్నమైనది. ప్రభుత్వం ఏమనుకుంటుందంటే, నేను ఒక జనసమూహంలో ప్రవేశించి, సున్నా దగ్గర ప్రారంభించి, మూడు రోజుల్లో రాజకీయ సమావేశాలు నిర్వహించగలను అని. కాని, నేను ముందే చెప్పినట్టు వెనిజులాలో రాజకీయ చైతన్య స్థాయి ఇంకా చాలా బలహీనంగా ఉంది.

అందువల్ల రాజకీయ చైతన్యాన్ని నిర్మించే ప్రక్రియ క్షణాలలో జరిగిపోదు. మీరు ఒక బడికి వెళ్లి, వారం రోజులు పాఠాలు విని, సర్టిఫికెటు తెచ్చుకున్నట్టు కాదు. ఇక్కడ చైతన్యీకరణ క్రమం శాశ్వతమైనది. నిరంతరమైనది. ఒకవేళ ఒక జనపాలనా సమితిలో ఉన్న సభ్యులే తమ ప్రజల చైతన్యాన్ని పెంచే ప్రక్రియలో భాగమయితే అది కొంత సులభం అవుతుంది. ఈ క్రమంలో విభిన్నమైన ఆలోచనలను, అరాచకవాదాన్ని, సోషలిజాన్ని, దానిలోని వేరు వేరు ఛాయలను అర్థం చేసుకోవడం ఒక సుదీర్ఘమైన ప్రక్రియ. ఇది సాధ్యం కావాలంటే కనీసం పదిహేను సంవత్సరాలు పడుతుంది. ఇది కేవలం సిద్ధాంతం కూడా కాదు. ఇది ఆచరణలో కూడా నేర్చుకోవలసి ఉంటుంది. ప్రధానంగా దీన్ని మీరు ఆచరణలో నేర్చుకుంటారు. కాని, అధ్యయనం ద్వారా, ఆలోచన ద్వారా పెంచుకుంటారు. సామాజిక, రాజకీయ ఆచరణలలో సోషలిజానికి సంబంధించినవేవో, పెట్టుబడిదారీ విధానానికి సంబంధించినవేవో గుర్తించడానికి సుదీర్ఘ కాలం పడుతుంది.

కొన్ని జనపాలనా సమితులకు మిగిలిన వాటికన్నా ఎక్కువ ఉన్నత స్థాయి రాజకీయ చైతన్యం ఉంది. జనపాలనా సమితీ అంటే కేవలం నిధులు స్వీకరించే స్థలం కాదని ఈ సంస్థలు అర్థం చేసుకున్నాయి. జనపాలనా సమితీ అనేది ఒక కొత్త 'పౌరసంఘం' అని వాళ్లు అర్థం చేసుకున్నారు. అది, ఒక రాజకీయ స్థలం. అది, ఒక రాజకీయ కసరత్తు. నిజం చెప్పాలంటే, అత్యధిక సంఖ్యలోని జనపాలనా సమితులకు ఈ విషయం అర్థం కాలేదు. అందువల్ల, ఆ సమితులతో మేం నిరంతరం సంభాషణలో ఉంటాం. 'చూడండీ, ఇదే సమస్యను మనం కావాలంటే పెట్టుబడిదారీ మార్గంలో పరిష్కరించవచ్చు. లేదా, సోషలిస్టు మార్గంలోనైనా పరిష్కరించవచ్చు' అని వాళ్లకు చెప్పడానికి ప్రయత్నిస్తాం. మా లక్ష్యం సమస్యల పరిష్కారమే. కానీ, ఆ పరిష్కారం కొత్త పద్ధతిలో ఉండాలి. అయితే ఇక్కడ సమస్య ఏమంటే మనకు కావలసినవి అందించే కంపెనీలు, ఉదాహరణకు, మనం ఇళ్లు కట్టదలచుకున్నాం అనుకోండి. ఆ నిర్మాణ సామగ్రి సరఫరా చేసే కంపెనీలు ఇంకా పెట్టుబడిదారీ కంపెనీలే. మా దేశంలో ఇళ్ల నిర్మాణం ఒక పెద్ద సమస్య గనుక ఇది మంచి ఉదాహరణ అవుతుంది. మేం గృహ సముదాయాలను నిర్మించాలని అనుకుంటాం. కాని, మేం సిమెంట్ కొనవలసింది ఒక పెట్టుబడిదారీ కంపెనీ నుంచే. అలాగే, ఆ గృహ సముదాయాన్ని కట్టిపెట్టడానికి, బాధ్యత తీసుకునే వ్యక్తో, కంపెనీయో పెట్టుబడిదారీ పద్ధతిలోనే పనిచేస్తారు... కనుక సమస్యను పరిష్కరించడం మాత్రమే కాదు. ఎలా పరిష్కరిస్తామనేది ముఖ్యం. మనం సమస్యను పరిష్కరించే క్రమంలో సోషలిజాన్ని నిర్మిస్తున్నామా, పెట్టుబడిదారీ విధానాన్ని బలోపేతం చేస్తున్నామా? మన చరిత్రలో అయిదు వందల సంవత్సరాల వలసవాదం, దోపిడీ నిండి ఉన్నాయి. అందువల్ల ఒక కొత్త సామాజిక, ఆర్థిక వ్యవస్థను నిర్మించడం చాలా పెద్ద సవాల్. ఒక కొత్త రాజ్యాంగ యంత్రాన్ని నిర్మించడం చాలా పెద్ద సవాల్.

ఇంకొక ఉదాహరణ చెబుతాను. కొన్ని సందర్భాలలో మేం

వ్యవసాయోత్పత్తిని బాగానే పెంచాం. కాని, మేం పండించిన వరి ధాన్యమంతా ఒక కంపెనీకి పంపించవలసి వచ్చింది. ఆ కంపెనీ, దాన్ని బియ్యంగా మార్చి, శుద్ధి చేసి, సంచులలో పెట్టి అమ్ముతుంది. దానికి ధాన్యం అందిన ధరకన్న పదిరెట్ల ఎక్కువకు అమ్ముతుంది. అది విన్నప్పుడు నాకు నవ్వొచ్చింది. దీనికి ఏమన్నా అర్థం ఉందా అనిపించింది. దీన్ని సరిచేయాలంటే, ఆ కార్ఖానాలను మేం ఆక్రమించాలి. ఆ కంపెనీలను స్వాధీనం చేసుకోవాలి. కాని, అదంత సులభమైన విషయం కాదు. అంతేకాదు, జనపాలనా సమితులకు ఈ కర్తవ్యాలన్నీ నెరవేర్చేంత శక్తి కూడా ఉండకపోవచ్చు. కనుక, మేం ఒక విష వలయంలో పడిపోతాం. ఈ సమస్య నుంచి బయట పడడానికి ఒకే ఒక మార్గం. జనపాలనా సమితులకూ, ప్రజా సంస్థలకూ, ప్రభుత్వానికీ మధ్య సరైన సంబంధాలు తయారు చేయడమే. జనపాలనా సమితుల శక్తి, సామర్థ్యాలు పెంచడానికి మేం ప్రయత్నిస్తున్నాం. కాని, మరొక అడుగు వేయడానికి చాలా కృషి చేయవలసి ఉంది.

**చివరికి ఏం జరుగుతుంది?**

చివరికి ఏం జరుగుతుంది? కమ్యూనాలూ, బూర్జువా రాజ్యాంగ యంత్రమూ పక్క పక్కనే సహజీవనం చేస్తూ ఉంటాయా? లేదా, ఇవి అంతిమంగా రద్దయిపోయి, కొత్త రూపాల ప్రజా స్వపరిపాలన ఏర్పడుతుందా? ఈ ప్రశ్న నాలో చాలా ఆలోచనలు రేకెత్తిస్తుంది. ఎందుకంటే, ఇప్పటి వరకే సాగిన విప్లవ క్రమంలో ఎన్నో రకాల నిర్మాణాలు మధ్యదారిలో దారితప్పిపోయాయి. అంతర్గత అభివృద్ధి అనే ఆలోచనకు కేంద్రం సక్రమంగా పని చేయలేదు అని అధ్యక్షుడు ఛావేజ్ ఇప్పటికే ప్రస్తావించాడు. 'ఎటువంటి నిర్మాణం మనకు కావాలి? ఎటువంటి నిర్మాణం అయితే మనం కోరుకున్న విధంగా ఒక కమ్యూనానో, ఒక సహకార వ్యవస్థనో నిర్మించడం మనకు పనికొస్తుంది?' అని జనం చాలాసార్లు నన్నడుగుతారు. నేను అప్పుడు వాళ్లకు 'సహకార వ్యవస్థ అంటే, సామాజిక ఆస్తికి బాధ్యత వహించే ఒక నిర్మాణం' అని వివరిస్తాను. కమ్యూనా అనేది అటువంటిది కాదు. కమ్యూనాను సామాజిక పరివర్తనకు ఒక ముఖ్యమైన సాధనంగా పనిచేయించడానికి మేం శాయశక్తులా కృషిచేస్తున్నాం. మేం మార్క్సిస్టులం గనుక సోషలిజం నిర్మించడానికి అట్టడుగు నుంచి నిర్మించడానికి ఇది ఒకటే మార్గమని మేం అనుకుంటున్నాం. అంతేకాదు, వెనిజులాలో కమ్యూనాలకు సంబంధించిన చారిత్రక అనుభవాలు కూడా ఉన్నాయి. ఇది మా ప్రజలకు తెలిసిన మౌలిక నిర్మాణ రూపం. ఇదేమీ మాకు కొత్తది కాదు. అయితే, వలసవాదం వల్ల ఇదంతా మారిపోయింది. 'మా అమెరికా' లో అతి మౌలికమైన రూపం అదే. ఈ రాజకీయ రూపం ద్వారానే ప్రజలు సమష్టిగా తమ జీవితాలను తాము పాలించుకున్నారు.

అలాగే, సోవియట్ యూనియన్‌లో లాగా రాజ్యం నిర్మించి ఇచ్చిన సోషలిజం రూపాలను కూడా మేం చూశాం. అక్కడ రాజ్యాంగ యంత్రం కూలిపోగానే ప్రతీది కూలిపోయింది. అంటే, అక్కడేదో జరిగింది. అక్కడ ప్రజలు ఈ ప్రక్రియలో తమను తాము భాగంగా నిజంగా భావించుకున్నారా లేదా? అక్కడ తప్పనిసరిగా చాలా విజయాలు సాధించాం. కాని, ప్రజలు, అందులో తమ భాగస్వామ్యాన్ని భావించలేదు. గతంలో జరిగిన అన్ని విప్లవానుభవాలు రష్యా, క్యూబా, దక్షిణార్ధ గోళంలోని అన్ని దేశాల విప్లవాలు మనకు చూపేదేమంటే, ప్రజలు గనుక నిజంగా పాల్గొనకపోతే బూర్జువా రాజ్యాంగ యంత్రమే సులభంగా కొనసాగుతుంది. అటువంటి సోషలిజం ఊహ ఆచరణ సాధ్యమైనది కాదు. ఎందుకంటే, బూర్జువా రాజ్యాంగ యంత్రం అనేది ప్రజలకు సంబంధించినది కాదు. ఇప్పుడు మేం ప్రజల మధ్య సంఘీభావానికీ, వినిమయానికీ, ఇచ్చిపుచ్చుకోవడానికీ సంబంధించిన ప్రత్యామ్నాయ వ్యవస్థలను నిర్మించే కృషిలో ఉన్నాం. అందువల్లనే కమ్యూనాలు తమ సామూహిక రేడియో స్టేషన్‌లను, టివి స్టేషన్‌లను కూడా నడపాలనే ఆలోచన కూడా ఉంది.

ఈ కమ్యూనాలకు ఎటువంటి నిర్మాణ రూపాలు ఉండాలనేది ఇప్పుడు మేం చర్చిస్తున్నాం. కమ్యూనాలో ఉండే వివిధ శక్తుల మధ్య సంబంధాలు ఎలా ఉండాలి? న్యాయ, అధికార వగైరా వ్యవస్థలలో వేటి మీద కమ్యూనాలకు అధికారం ఉండాలి? లాంటి చర్చ సాగిస్తున్నాం. ఇప్పటి వరకు ఉన్నదల్లా చర్చ కోసం ప్రజలందరూ సమావేశం కావడమే. కాని, అధికారికంగా సోషలిస్టు కమ్యూనా అనేది ఇంకా ఏర్పడలేదు. మేమింకా కమ్యూనాలను నిర్మిస్తూనే ఉన్నాం. మేం నిజంగా కమ్యూనాలో ఉన్నామని ఎప్పుడు చెప్పగలం అంటే, మమ్మల్ని మేం పాలించుకున్నప్పుడు. 'ఇది నీ ఇల్లు కాదు' అని చెప్పే న్యాయమూర్తి ఎవడూ లేనప్పుడు. లేదా, మీరొక బస్తీలో నివసిస్తుంటారు, కాని, మీ నివాస స్థలాన్ని రుజువు చేసుకోవడానికి మీకొక కాగితం అవసరం అవుతుంది అనే స్థితి లేనప్పుడు. మీరు, ఏదో ఒక అధికార వ్యవస్థ దగ్గరికి వెళ్లి ఈ విషయమై మొరపెట్టుకోవలసిన అవసరం లేనప్పుడు. ఆ పనులన్నీ కమ్యూనా చేస్తుంది. మీరెక్కడ నివసిస్తున్నారో, మీ పొరుగు వాళ్లు చెపితే చాలు.

ప్రజా జీవితాల మీద యజమానులుగా ఉండే అంతరాల వ్యవస్థను పెట్టుబడిదారీ విధానం తయారు చేసి పెట్టింది. మీ దగ్గర ఒక నివాస ధృవీకరణ పత్రం లేకపోతే, మీరు చాలా పనులు చేయలేరు. కానీ, నివాస ధృవీకరణ పత్రం ఎందుకుండాలి? బూర్జువా రాజ్యాంగ యంత్రం మనకు అవసరం లేని పాలకులనూ, అధికారులనూ చాలా మందిని తయారు చేసి పెట్టింది. వాళ్లు తమకే అన్ని విషయాలు తెలుసునని అనుకుంటారు. వాళ్లు సమస్యలను పరిష్కరించే వరకు జనబాహుళ్యంలోని అట్టడుగున ఉన్న అనేక మంది వారి దయాదాక్షిణ్యాల కోసం ఎదురు చూస్తూ ఉండవలసి ఉంటుంది. కాని, కమ్యూనా అనేది ఈ పనులన్నిటినీ తానే చేయగలుగుతుంది. తానే అన్ని విషయాలలో నిర్ణయాలు తీసుకోగలుగు తుంది. ఈ నేల మీద స్పానిష్ వలస వాదులు కాలు మోపక ముందు మేం అలాగే జీవించాం. కాని, తమ జీవితాలకు తామే బాధ్యత వహించాలనే చైతన్యాన్ని ప్రజలలో పెంపొందించడం ఒక సుదీర్ఘ ప్రక్రియ. అంతేకాదు, ఎవరైనా తమ ఇష్టం వచ్చిన ఏ పనైనా చేయవచ్చుననే' అరాచక పద్ధతి కూడా కాదిది. కలిసి జీవించేటప్పుడు సమాజంలో ప్రతి ఒక్కరూ గౌరవించ వలసిన జీవన సూత్రాలు ఉన్నాయి. శ్రామిక జీవనాన్ని నియంత్రించే సూత్రాలు ఉన్నాయి. వాటిని గౌరవించవలసి ఉంది. ఆ సూత్రాలను గౌరవించక పోతే, పాటించకపోతే ఏదో చట్టం శిక్షిస్తుందనే భయం కొద్దీ కాదు, ప్రతి మనిషి తన చైతన్యం వల్ల ఆ సూత్రాలను గౌరవించాలి.

చివరిగా, అధ్యక్షులు ఛావెజ్ ఉంటాడా, ఉండడా అనేది ముఖ్యం కాదు. ఈ ప్రక్రియ ముఖ్యం. అది ప్రజల మీద ఆధారపడింది. ఈ క్షణాన చూస్తే, ఈ ప్రక్రియ మొత్తంగా అధ్యక్షుడి మీదనే ఎక్కువగా ఆధారపడిందని అనిపించవచ్చు. ఈ ప్రక్రియ ముందుకు సాగడానికి హామీ ఆయనే అని అనిపించవచ్చు. అందుకే అభివృద్ధి నిరోధకులు ఆయనను హత్య చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఛావెజ్ ప్రభుత్వం కూలిపోయి మరొక ప్రభుత్వమే ఏర్పడితే, అది గతంలో లాగ అభివృద్ధి నిరోధక ప్రభుత్వం అయితే మార్క్స్, చెగువేరా, ఫిడెల్ కాస్ట్రో పుస్తకాలు పట్టుకున్నందుకే శిక్షించవచ్చు. వీధులలో రాజకీయంగా పోరాడడం సాధ్యం కాకపోవచ్చు. వీ

*పుట్టుక, మరణాలు, ప్రకృతిలోని పరిణామాలు, ఆయా కాలాలలో అంతుచిక్కని ప్రశ్నలకు జవాబుగానే తాత్విక చింతనా, మత భావనలూ రూపొంది ఉంటాయని అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# సుమేరియన్ మత వ్యవస్థ

ప్రాచీన సమాజాల గురించిన వివరాలు మనకు పూర్తిగా తెలియవు. అయితే కొన్ని విషయాలు మనం సులువుగా ఊహించుకోవచ్చు. తొలినుంచీ మనుషులకు ముఖ్య జీవితావసరాలెన్నో ఉండేవి. తిండీ, తలదాచుకునే నివాసాలూ, కట్టుకునేందుకు బట్టలూ, పిల్లల సంరక్షణా మొదలైనవి ప్రధానం. ఆ తరవాత సముదాయాన్ని పరిరక్షించగలిగిన కట్టుబాట్లూ, సమష్టి ఆస్తుల సంరక్షణా అవసరమయి ఉంటాయి. ఇవన్నీ ఒనగూడడానికై సామూహిక జీవితానికి అవసరమైన సమాజ నిర్మాణం జరిగి ఉంటుంది. జీవితానుభవాన్ని జ్ఞానసంపదగా తరవాతి తరాలకు అందించే ఏర్పాట్లు మొదలై ఉంటాయి. క్రమంగా ప్రజల కల్పనాశక్తి బహిర్గతం అయేందుకు చిత్రకళలూ, శిల్పాల తయారీ, మౌఖికంగానైనా కొంత సాహిత్యమూ సృష్టి అయి ఉంటాయి. తమ ఉనికినీ, ప్రకృతిలో కనబడుతున్న పరిణామాలనూ, తప్పనిసరిగా వచ్చే చావునూ అర్థం చేసుకుని వివరించేందుకు కొంత తాత్విక చింతనా, మత భావనలూ రూపొంది ఉంటాయి.

మనుగడకై వేటాడడం, ఏరుకు తినడం క్రమంగా తగ్గిపోయి మనుషులు వ్యవసాయం చేపట్టిన తరవాత స్థిరజీవితాలు మొదలవడం, ఉత్పత్తి సాధనాలైన భూమి, వాటిని దున్నే పెంపుడు జంతువులూ, రకరకాల పనిముట్లూ సంపదలుగా ఏర్పడసాగాయి. సమాజాల్లో వ్యక్తుల మధ్య హెచ్చు తగ్గులు మొదలవడానికి వీటిని పొందిఉండడం కారణమయింది. జనాభా పెరిగినకొద్దీ ఈ సంపదలకై పోటీ పెరగసాగింది. వివిధ సముదాయాల మధ్యనా, వ్యక్తుల మధ్యనా వైషమ్యాలు పెరిగి సమాజ పరిణామం మార్పులు చెందసాగింది. కొట్లాటలూ, యుద్ధాలూ, ఓడినవారిని బానిసలుగా లోబరుచుకుని ఖర్చులేని చాకిరీ చేయించడం మొదలైనవన్నీ పెనుమార్పులకు కారణమయాయి. నైపుణ్యం అవసరంలేని బండచాకిరీ బానిసల పరం కావడంతో ఇతరులు వివిధ కళల్లో నైపుణ్యం సంపాదించి ఉన్నత నాగరికతకు అవసరమైన వస్తువులను తయారు చెయ్యగలిగారు. ఇటువంటి పరిణామాలేవీ జరగని పపూవాన్యూగినీ వంటి ప్రాంతాల్లో ప్రతివారూ తిండికోసం దుంపలు తవ్వుకుంటూ బతకడంతో అక్కడ నాగరికతలేవీ తలెత్తలేదు. ఎంతో గర్హనీయమైన బానిస విధానం ఉత్పత్తిని పదింతలు పెంచిందనేదికూడా గుర్తించాలి. స్పార్టకస్ వంటివారు బానిసల తిరుగుబాటుకు స్ఫూర్తినిచ్చారు. కొంతకాలానికి అది అంతం కాక తప్పలేదు. చరిత్రలో జరిగిన పరిణామాలన్నీ చాలావరకూ ఆర్థిక, ఆస్తి వ్యవహారాల కారణంగా తలెత్తినవే.

సామాజిక పరిణామాలు గతితార్కికభౌతికవాద సూత్రాలను అనుసరించే జరుగుతూవచ్చాయి. ఏ దశలోనైనా కాలం గడుస్తున్నకొద్దీ సమాజం మార్పు చెందక తప్పలేదు. మనదేశంలో ప్రజలు కుటుంబ సంబంధాలు కలిగిన తెగలుగా గణరాజ్యాలు ఏర్పాటు చేసుకున్నారు కాని జనాభా పెరిగినకొద్దీ రాజులూ, చక్రవర్తులూ అధికారం చేజిక్కించుకోవడం అనివార్యం అయింది. అలాగే వర్ణాలూ, కులాల ఏర్పాటు కూడా అప్పట్లో ఒక విప్లవమే. ఈ మార్పుల్లో ప్రతిదాని వెంటా కొన్ని సమస్యలు కూడా తలెత్తి, కొంతకాలానికి ఒక కొలిక్కి వస్తాయి. అప్పుడు మరొక విప్లవం అనివార్యమవుతుంది. ప్రకృతి శక్తులకు తల ఒగ్గి, బితుకుబితుకుమంటూ గడ్డుజీవితాలకు లోనైన ఆదిమానవులకు మతభావనలు చాలా మంచి చేశాయి. వారి మధ్య ఐకమత్యాన్ని పెంచి, సామూహిక పద్ధతిలో ఒక ఆశావాద దృక్పథాన్ని కలిగించాయి. కాని ఈ తాత్విక భావనల్లో స్థానికంగానూ, కాలానుగతంగానూ తలెత్తిన వ్యత్యాసాలూ, అపరిచితుల గురించిన అపోహలూ ఎన్నో వైషమ్యాలకు కూడా దారితీశాయి.



సుమేరియన్ దేవతలు

నేటి ఇరాక్ ప్రాంతంలో రూపొందిన సుమేరియన్ నాగరికత అన్నిటికన్నా ప్రాచీనమైనది. బళ్లకు చక్రాలూ, నదుల మీద తిరిగే నావలూ వగైరాలన్నీ అక్కడి ప్రజలు మొదలుపెట్టినవే. క్రీ.పూ. 2800 నాటికే వారి భాషకు ఒక లిపివంటిది ఏర్పడింది. చిన్నవీ, పెద్దవీ కలిసి దాదాపు 30 నగర రాజ్యాలేర్పడ్డాయి. వీటిలో ఒక్కొక్కదానికీ అధిష్ఠాన దేవతలుండేవారు. నగరాల ఏలికలు వారికి ప్రతినిధులైన పూజారులే. నగరాల సామాజిక, ఆర్థిక వ్యవస్థలన్నీ ఆలయాల అధీనంలో ఉండేవి. ప్రతి ఆలయ వ్యవస్థకూ చెందిన భూములను కౌలుదారీ పద్ధతిలో ప్రజలు సాగు చేసేవారు. పండిన దానిలో పాతిక భాగం ఆలయానికిచ్చేవారు. తక్కిన భూములు సామూహికంగా తెగల అధీనంలో ఉండేవి. క్రీ.పూ. 2600 నాటికే పెద్ద భూస్వాములూ, స్థిరాస్తి లావాదేవీలూ, అప్పులివ్వడాలూ మొదలయాయి. ప్రకృతి వనరులు అందరివీ అనుకునే స్థితి పోయి స్వంత ఆస్తులు ఏర్పడ్డాయి.

సుమేరియన్ నాగరికతలో ఎందరో దేవతలుండేవారు. రకరకాల కళలు వృద్ధిచెందాయి. భూమ్యాకాశాలను గురించీ, సృష్టిని గురించీ,

పంచభూతాల గురించీ స్పష్టమైన ప్రతిపాదనలూ, నమ్మకాలూ ఉండేవి. ఇవేవీ అకస్మాత్తుగా మొదలవలేదు. అంతకుముందు పాతరాతియుగంలో లక్ష ఏళ్లనుంచీ కొనసాగుతున్న తాత్వికవైఖరే ఈ నమ్మకాలకు పునాది అనుకోవచ్చు. శిల్పాలనూ, బొమ్మలనూబట్టి చూస్తే సుమేరియన్ దేవతలకు గడ్డాలూ, మీసాలూ కనిపిస్తాయి (పటం). సుమేరియన్ ప్రజలు



నీరు మోస్తున్న సుమేరియన్ భూదేవత,
మనుషులను సృష్టించే సుమేరియన్ దేవత

అలా ఉండేవారు కారు కనక అంతకుముందు ఆ ప్రాంతంలో ఉండిన మరొక జాతిని సుమేరియన్లు లోబరుచుకుని, వారి దేవతలను ఆరాధించడం మాత్రం కొనసాగించి ఉంటారనే ప్రతిపాదన ఉంది.

మతాల ప్రారంభం ఎంత ప్రాచీనకాలంలో ఎటువంటి పరిణామాలకు లోనయిందో చెప్పడం కష్టం. సుమేరియన్ నాగరికత ఏనాడో గొప్పగా మొదలైందనేది నిజమే కాని మతాలు ఇంకా ప్రాచీనమైనవి. ఎందుకంటే అక్కడ క్రీ.పూ. 6000 నుంచీ జనవాసాలుండేవి. క్రీ.పూ. 5300 నుంచీ ఏడాది పొడుగునా వ్యవసాయం చేసేవారు. రంగులు పూసిన కుండల తయారీకూడా అప్పటికే ఉండేది. జనాభా పెరగడం, అవసరమైన వివరాలను నమోదు చెయ్యడం వగైరాలన్నీ మొదలయాయి. సమాజ జీవితం సంక్లిష్టమవుతున్న నేపథ్యంలో, మతం, కట్టుబాట్లూ అన్నీ అందుకు అనుగుణంగా రూపొందక తప్పలేదు. పరలోకం గురించి ఎంత చెప్పినప్పటికీ ఏనాడైనా మతాల ప్రమేయం ప్రధానంగా ఇహలోకంతోనూ, ప్రజలతోనూ మాత్రమే ఉంటుంది.

సుమేరియన్ నాగరికతలో దేవతలందరూ మనుషుల రూపాలు కలిగినవారే (పటం). ఏ ప్రాంతానికా ప్రాంతంలో రకరకాల దేవతలుండేవారు. జిగ్గురాట్ అనే పేరుగలిగిన సుమేరియన్ దేవాలయాల్లో మధ్యలో శుద్ధి చేసుకునేందుకు జలాశయం ఉండేది (పటం). ఇరువేపులా వరండాలూ, వాటిపక్కనే పూజారుల గదులూ ఉండేవి. ఒక అంచున వేదికవంటిది ఉండేది. జంతువులనూ, కూరగాయలనూ బలులిచ్చే ఏర్పాట్లుండేవి. దగ్గరలోనే ధాన్యపు గాదెలూ, గిడ్డంగులూ ఉండేవి. పూజారుల్లో కొందరు భూతవైద్యులుగా, చికిత్సకులుగా పనిచేస్తే, మరికొందరు జోస్యం చెప్పేవారు. పూజారిణులు



నేటి ఇరాక్లోని నాసిరీయా ప్రాంతపు 4100 ఏళ్లనాటి జిగ్గురాట్

దేవదాసీలుగా వ్యభిచారిణులుగా ఉండేవారు.

మనకు తెలిసినంతవరకూ అన్నిటికన్నా ప్రాచీనమైన సుమేరియన్ నాగరికత కాలానికే మతభావనలూ, ఆలయవ్యవస్థలూ ఎంత పటిష్ఠంగా పాతుకుపోయాయో గమనిస్తే తొలి మానవ సముదాయాల్లో ప్రాథమికస్థాయిలో మొదలైన శ్రమవిభజన రానురాను ఎంత పెరిగిపోయిందో, శరీర శ్రమ చెయ్యనవసరంలేని పూజారివర్గం ఎంత బలంగా రూపొందిందో అర్థమవుతుంది. సమాజశ్రేయస్సు కోసమూ, ప్రజలను ఏకం చేసేందుకూ మొదలైన మతభావనలు మొత్తం సమాజాన్నే శాసించి, పెత్తనం చలాయించగలిగే స్థాయికి చేరుకున్నాయి.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)*

## అసహజ మరణాలు నమోదు చేద్దాం!

ఆగస్ట్ 2006 నుంచి వీక్షణంలో అసహజ మరణాల సూచి ప్రారంభించాం. మన చుట్టూ అసహజంగా చనిపోతున్న రైతులు, చేనేత కార్మికులు, వరకట్న మరణాలు, రకరకాల ప్రమాదాలలో చనిపోతున్నవారు, వైద్యం అందక, ప్రకృతి వైపరీత్యాలతో మరణిస్తున్నవారు, హత్యలు ఇలా అనేక సామాజిక రంగాలనుంచి మరణిస్తున్నవారి సంఖ్యను నమోదు చేయడమే ఈ శీర్షిక ఉద్దేశ్యం. ఏయే సామాజిక, రాజకీయార్థిక కారణాలతో చనిపోతున్నారో పరిశోధన చేయాల్సి ఉంది. ఇప్పటికే 15 జిల్లాల నుంచి మాకు ఈ సమాచారం అందుతోంది. ఇంకా **నల్లగొండ, రంగారెడ్డి, మహబూబ్‌నగర్, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, ప్రకాశం, కడప, అనంతపురం** జిల్లాల నుంచి అసహజంగా చనిపోతున్న వారి సమాచారం అందాల్సి ఉంది. మేము చేస్తున్న ఈ ప్రయత్నంలో మీరూ పాలుపంచుకోవచ్చు. దీనికి పారితోషికంగా వీక్షణం ప్రతిని పంపిస్తాం.

ఆసక్తి గలవారు వివరాలకై సంప్రదించండి : **వై. రామచంద్రం** (సర్క్యులేషన్ మేనేజర్) ఫోన్ నెం. 9949391028

**– సంపాదకులు**

## కొత్త ఎన్నికల ప్రధాన కమిషనర్

కేంద్ర ఎన్నికల సంఘం నూతన ప్రధాన కమిషనర్‌గా షాబుద్దీన్ యాకుబ్ ఖురేషి (63)ని నియమించింది. ఖురేషిని ప్రధాన కమిషనర్‌గా నియమిస్తూ, కేంద్ర న్యాయమంత్రిత్వ శాఖ జూలై 30 నుంచి ఆయన బాధ్యతలు నిర్వహిస్తారని తెలిపింది. 1971లో ఐఏఎస్ బ్యాచ్‌కు ఎన్నికయిన ఖురేషి 35 ఏళ్లపాటు కేంద్ర, రాష్ట్ర సర్వీసుల్లో పని చేశారు. 2006 నుండి ఎన్నికల కమిషనర్‌గా ఉన్నారు.

## థర్మల్, అణు ప్రాజెక్టులు

కొత్తగా అణు, థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులపై స్వీయ నిషేధం విధించుకోవాలని, భారీ జల విద్యుత్ ప్రాజెక్టులకోసం భూసేకరణకు స్వస్తి పలకాలని వివిధ ప్రజా సంఘాలు కేంద్రాన్ని డిమాండ్ చేశాయి. ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక (ఎన్.ఎ.పి.ఎం.) ఆధ్వర్యంలో మధ్యప్రదేశ్ రాజధాని భోపాల్‌లో 'ఇంధన పరిస్థితి – భారత్‌లో విద్యుత్ ప్రాజెక్టులు' అనే అంశంపై ఆగస్టు 1, 2 తేదీల్లో జాతీయస్థాయి వర్క్‌షాప్ నిర్వహించింది. అనేక మంది మేధావులు, వివిధ ప్రజాసంఘాల ప్రతినిధులు పాల్గొన్నారు. 'శిలాజ ఇంధనాలపై ఆధారపడే పరిస్థితి తగ్గాలి. సౌర, ఇతరత్రా సాంప్రదాయేతర ఇంధన వనరుల వినియోగం పెరగాలి. థర్మల్ విద్యుత్ కేంద్రాలకు నీటిని మళ్లించడాన్ని ఆపివేయాలి. విద్యుత్ ప్రాజెక్టుల కోసం ఎలాంటి నోటీసులు జారీ చేయకుండా భూములు స్వాధీనం చేసుకునే పద్ధతి పోవాలి. అక్కడి వనరులపై స్థానికులకు హక్కు కల్పించాలి' అని ఈ వర్క్‌షాప్‌లో తీర్మానించారు.

## వేదాంత బాక్సైట్

ఒడిషాలోని వేదాంత రిసోర్స్ కంపెనీ ప్రతిపాదించిన 170 కోట్ల డాలర్ల బాక్సైట్ మైనింగ్ ప్రాజెక్టుకు పర్యావరణ అనుమతులు నిరాకరించినట్లు పర్యావరణ శాఖ మంత్రి జైరాం రమేష్ తెలిపారు. ఈ ప్రాజెక్ట్‌లో వేదాంత గ్రూప్ పర్యావరణ పరిరక్షణ చట్టం, అటవీ పరిరక్షణ చట్టం, అటవీ హక్కుల చట్టాలను పెద్దఎత్తున ఉల్లంఘించినట్లు ఎన్ ఎస్ సక్సేనా ప్యానెల్ గుర్తించింది. ఆ ప్రాజెక్ట్‌ను నిషేధించాలని ఎన్ ఎస్ సక్సేనా ప్యానెల్ చేసిన సూచనలను పరిగణనలోకి తీసుకుని ఫారెస్ట్ అడ్వైజరీ కమిటీ సమర్పించిన నివేదిక ఆధారంగా ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకుంది.

## కె.ఎం. మాథ్యూ కన్నుమూత

స్వతంత్ర భారత పత్రికారంగ చరిత్రలో అవిస్మరణీయుడు కె.ఎం. మాథ్యూ. 'మలయాళ మనోరమ' ప్రధాన సంపాదకులు. మనోరమ ఇప్పుడు ఐదు భాషలలో ప్రచురితమవుతోంది. మాథ్యూ (97) ఆగస్ట్ ఒకటిన చనిపోయారు. భారతీయ భాషలలోని వార్తా పత్రికలు సర్వ సమగ్రంగా అభివృద్ధి చెందాలని ఆయన కోరుకున్నారు. మాథ్యూ లౌకిక జాతీయవాది. వివిధ మత, సామాజిక వర్గాలు నివసిస్తున్న సమాజంలో సామరస్యానికి భంగం కల్గించే రచనలు ప్రచురించకూడదని ఆయన చెప్పేవారు.

## అలీగఢ్‌లో రైతులపై కాల్పులు

తమ నుండి ప్రభుత్వం తీసుకున్న భూమికి సరైన పరిహారం అడుగుతూ అలీగఢ్‌లోని జికార్‌పూర్ గ్రామంలో రైతులు ఆందోళన చేశారు. పరిహారం పెంపుదల కోసం ఉద్యమిస్తున్న రైతులపై ఆగస్టు 14న అర్ధరాత్రి పోలీసులు జరిపిన కాల్పుల్లో ఇద్దరు రైతులతో సహా ముగ్గురు మరణించారు. ఢిల్లీ–ఆగ్రాల మధ్య 8 లైన్ల ఎక్స్‌ప్రెస్ రహదారికి, దాని వెంబడి టౌన్‌షిప్ అభివృద్ధి కోసం ప్రభుత్వం భూమి తీసుకుంది. నష్టపరిహారాన్ని 25 శాతం పెంచేందుకు ప్రభుత్వం అంగీకరించింది. దీనిపై రైతులు అసంతృప్తితో పరిహారాన్ని పెంచాలని డిమాండ్ చేశారు.

## మనుషుల్ని చంపితే పదోన్నతులా?

ఎన్‌కౌంటర్లలో పాల్గొన్న పోలీసు అధికారులకు పదోన్నతులు ఇవ్వడంపై సుప్రీంకోర్టు ఆగ్రహం వ్యక్తం చేసింది. కేంద్ర మానవ హక్కుల సంఘం నిబంధనలు, మార్గదర్శక సూత్రాలకు వ్యతిరేకంగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఇస్తున్న పదోన్నతులు సమర్థనీయం కాదని పేర్కొంది. ఎన్‌కౌంటర్లలో పాల్గొన్న వారిపై ప్రత్యేక చార్జిషీట్ దాఖలు చేసి స్వతంత్ర సంస్థ చేత విచారణ చేయించాలని కేంద్ర మానవ హక్కుల సంఘం కొన్ని మార్గదర్శక సూత్రాలను నిర్దేశించింది. ఇందుకు భిన్నంగా రాష్ట్ర ప్రభుత్వం పోలీసులకు పదోన్నతులు ఇవ్వడాన్ని సవాలు చేస్తూ న్యాయవాది ఆర్. చంద్రశేఖరరెడ్డి 2006లో వేసిన పిటిషన్ పెండింగ్‌లో ఉన్నా, రాష్ట్ర ప్రభుత్వం నిబంధనలకు విరుద్ధంగా ప్రమోషన్లు ఇచ్చింది. మళ్లీ ఆ న్యాయవాది మరో పిటిషన్ వేశారు. దీనిపై ఆగస్టు 16న న్యాయమూర్తులు జస్టిస్ సుదర్శన్‌రెడ్డి, జస్టిస్ నిజ్జర్‌లతో కూడిన ధర్మాసనం విచారణ జరిపి, తదుపరి విచారణను రెండు వారాలకు వాయిదా వేసింది.

## ఒబిసిలోకి మరిన్ని కులాలు

ఇతర వెనుకబడిన కులాల (ఒబిసి) కేంద్ర జాబితాలో మరిన్ని కులాలను చేర్చడానికి ప్రభుత్వం అంగీకరించింది. ఒ.బి.సి. జాబితాలోకి కొత్తగా చేరిన కులాల్లో బీహార్‌లోని ఆద్రాఖి మహతో కులం ఒకటి. అలాగే ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, కర్ణాటక, రాజస్థాన్, కేంద్ర పాలిత ప్రాంతం డామన్ దయ్యూల నుంచి వివిధ కులాలను చేరుస్తూ సవరణలు చేశారు. సామాజిక న్యాయం, సాధికారత మంత్రిత్వ శాఖ నోటిఫికేషన్ జారీ చేసిన అనంతరం ఈ మార్పులు అమలులోకి వస్తాయి.

## 56 జల విద్యుత్ ప్రాజెక్ట్‌ల రద్దు

ఉత్తరాఖండ్‌లో 56 జల విద్యుత్ ప్రాజెక్టుల కేటాయింపుల్లో అవకతవకలు జరిగాయని ఆరోపణలు రావడంతో ఆ రాష్ట్ర ప్రభుత్వం వాటి కేటాయింపులను రద్దుచేసింది. ఈ ప్రాజెక్టులు పొందిన కంపెనీల్లో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన మధుకాన్ ప్రాజెక్ట్స్ లిమిటెడ్, ఇండస్ ఎనర్జీతో పాటు చాలా సంస్థలు ఉన్నాయి. తమకు కేటాయింపులు రద్దుచేయడంతో ఈ సంస్థలు కోర్టుకు వెళ్లాయి. ఢిల్లీ, పంజాబ్‌లకు చెందిన ఒకే కుటుంబానికి, ఒకే కుటుంబ యాజమాన్యంలో పలు కంపెనీలకు, భార్యా భర్తలకు వేర్వేరుగా కేటాయింపులు జరిగాయన్న విషయం బయటికి తెలియడంతో వీటిని రద్దుచేయాలని ఉత్తరాఖండ్ ముఖ్యమంత్రి నిర్ణయించారు.

## లేహ్‌ను ముంచిన వరదలు

ఈశాన్య జమ్మూ కాశ్మీర్‌లో లడక్ ప్రాంతంలోని లేహ్ పట్టణంలో ఆగస్టు 6 రాత్రి కురిసిన భారీ వర్షాలకు అకస్మికంగా వరదాలు రావడంతో కేవలం అరగంటలోనే తీవ్ర నష్టం జరిగిపోయింది. ఇల్లు, భవనాలు కుప్పకూలాయి. 150 కిలోమీటర్ల పరిధిలోని గ్రామాలు, పట్టణాలు తుడిచిపెట్టుకుపోయాయి. ఈ భీభత్సానికి మరణించిన వారి సంఖ్య 145 కాగా, 500 మంది ఆచూకి ఇంకా తెలియరాలేదు.

## సిపిఎం కేంద్ర కమిటీ సమావేశాలు

ఆంధ్రప్రదేశ్‌లోని విజయవాడలో ఆగస్ట్ 7న మొదలైన సిపిఎం కేంద్ర కమిటీ సమావేశాలు ఆగస్ట్ 10న బహిరంగ సభతో ముగిసాయి. అవినీతి కాంగ్రెస్, మతోన్మాద బిజెపి నుంచి దేశాన్ని రక్షించడానికి ఎర్రజెండాయే శరణ్యమని సిపిఎం నేతలు ఉద్ఘాటించారు. రానున్న కాలానికి పదకొండు లక్ష్యాలను పార్టీ శ్రేణుల ముందు కేంద్ర కమిటీ ఉంచిందని తెలిపారు.

## ఛావెజ్ హెచ్చరిక

కొలంబియా అమెరికా సహాయంతో వెనిజులాపై సాయుధ దాడికి ప్రయత్నాలు చేస్తున్న నేపథ్యంలో ఛావెజ్ అమెరికాకు తీవ్ర హెచ్చరిక చేశారు. కొలంబియా తలపెట్టిన దాడి ఈ వందేళ్లలోనే పెద్దదిగా పేర్కొన్నారు. ఈ సంక్షోభంలో తలదూర్చవద్దని అమెరికాను వారించారు. ఈ ఏడాది అమెరికా, కొలంబియాల మధ్య జరిగిన సైనిక ఒప్పందాల నేపథ్యంలో ఛావెజ్ ఈ విధంగా స్పందించారు. వెనిజులా పై సైనిక దాడిలో కొలంబియాకు అమెరికా సహకరిస్తే దానికి చమురు సరఫరా నిలిపివేస్తామని చెప్పారు. దాదాపు 1500 మంది కొలంబియా గెరిల్లాలు వెనిజులా భూభాగంలో కాపుకాసి, దాడి చేయడానికి పన్నాగం చేస్తున్నారని తెలిపారు. ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్ (ఒపెక్)లో సభ్యత్వమున్న వెనిజులా దక్షిణ అమెరికాలో అతి పెద్ద చమురు ఉత్పత్తిదారు, ఎగుమతి చేసే దేశం.

## కొసావో స్వాతంత్ర్యం న్యాయబద్ధం

సెర్బియా నుంచి ఫిబ్రవరి 2008లో కొసావో ప్రకటించుకున్న స్వాతంత్ర్యం ఎటువంటి అంతర్జాతీయ న్యాయ ఉల్లంఘనలు లేవని అంతర్జాతీయ న్యాయస్థానం (ఇంటర్నేషనల్ కోర్ట్ ఆఫ్ జస్టిస్) 11 ఆగస్ట్ 2010న తెలిపింది. ఆరు శతాబ్దాలుగా కొసావోపై సెర్బియా కొసావోపై పెత్తనం చెలాయిస్తోంది. 1998-99 సెర్బియా సైనిక బలగాలు జరిపిన దాడిలో పదివేలకు పైగా కొసావో వేర్పాటు దళం అల్బేనియన్‌లు చనిపోయారు. యుద్ధం, ఆ తరువాత దశాబ్దంపైగా అంతర్జాతీయ నిర్వహణ తరువాత 2008లో ప్రకటించుకున్న స్వాతంత్ర్యం చట్టబద్ధమైనదేనని అంతర్జాతీయ న్యాయస్థానం తీర్పునిచ్చింది.

## ఇరాక్ యుద్ధం అయిపోలేదు

అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా ఇరాక్‌లో యుద్ధం ముగిసిందని ప్రకటించారు. కాని ఇరాక్‌లో ఇంకా అలాంటి పరిస్థితులు కానరావడం లేదు. వేలాది సంఖ్యలో సైనికులు ఇరాక్ వీధుల్లో గస్తీ తిరుగుతున్నారు. గత రెండేళ్లలో ఘర్షణ తీవ్ర స్థాయికి చేరుకుంది. నిరంతర దాడుల వల్ల సైనికులు మానసిక ఒడిదుడుకులకు లోనై తీవ్ర మనోవేదనతో, మానసిక స్థితి దిగజారిపోతుంది. వారినే తిరిగి విధుల్లో నియమించడంతో వారు ఆ మానసిక స్థితి నుంచి బయటపడలేక సామాన్య ప్రజలపై దాడులు, లైంగిక అత్యాచారాలకు పాల్పడుతున్నారు. అమెరికా సైనిక చరిత్రలోనే జూన్‌లో అత్యధికంగా సైనికులు ఆత్మహత్యలకు పాల్పడ్డారు.

## చిలీలో రాజకీయ ఖైదీల నిరసన

చిలీలో మపూచే జైళ్లలో జూలై 12 నుంచి నిరాహార దీక్షలు చేపట్టిన రాజకీయ ఖైదీలకు అంతర్జాతీయంగా మద్దతు లభిస్తోంది. మపూచే వారసత్వ భూమి హక్కుల కార్యకర్తల పై చిలీ సైనిక అణచివేతకు నిరసనగా 31 మంది రాజకీయ ఖైదీలు నిరాహార దీక్షలు చేపట్టారు. చిలీ, ఆర్జెంటీనా, ఇంగ్లాండ్, ఫ్రాన్స్, నార్వే తదితర దేశాలలో చిలీ రాయబార కార్యాలయాల ఎదురుగా నిరసనకారులు ప్రదర్శనలు నిర్వహించారు. తక్షణమే దీక్షలు చేస్తున్న ఖైదీలతో సంప్రదింపులు జరిపి వారిపై మోపబడ్డ తీవ్రవాద నిరోధక అభియోగాలను తీసివేయాలని, సైనిక కోర్టులలో కాకుండా సివిల్ కోర్టులలో విచారణలు జరపాలని, మపూచే సాంప్రదాయ ప్రాంతాలలో సైనిక చర్యలను అరికట్టాలని డిమాండ్ చేశారు.

## మురళీధరన్ @ 800

శ్రీలంక స్పిన్నర్ ముత్తయ్య మురళీధరన్ 800 వికెట్లను పడగొట్టాడు. అంతర్జాతీయ టెస్ట్ క్రికెట్ చరిత్రలో ఇది మొదటిసారి. తొలి టెస్ట్ 28 ఆగస్ట్ 1982న ఆడిన మురళీధరన్ ఇప్పటి వరకు 133 టెస్టులలో, 230 ఇన్నింగ్స్‌లలో ఆడాడు. టెస్టు క్రికెట్‌లోనే కాక వన్డేలలో కూడా అత్యధిక వికెట్లు (515) పడగొట్టాడు. ప్రతి టెస్టుకు సరాసరి ఆరు వికెట్లు తీసుకున్నాడు. అన్ని జట్లపైనా టెస్టుల్లో పది వికెట్లు తీసుకున్నాడు. టెస్టు క్రికెట్ ఆడుతున్న ప్రతి జట్టుపై యాభై, ఆ పైన వికెట్లు తీసుకున్నాడు. భారత్‌పై 105 వికెట్లు తీశాడు.

## పాకిస్తాన్‌లో వరదలు

పాకిస్తాన్ చరిత్రలోనే వచ్చిన భారీ వరదలకు ప్రజా జీవితం అస్తవ్యస్తమైపోయింది. జూలైలో కురిసిన భారీ వర్షాలకు వచ్చిన వరదలు రెండు కోట్ల మంది నిర్వాసితులయ్యారు. 1600 మందికి పైగా మరణించారు. నౌషెరా, ముజఫరాబాద్, ఫక్తూన్‌ఖ్వా మొదలైన నగరాలు జలదిగ్బంధంలో చిక్కుకున్నాయి. లక్షల ఎకరాల పంట నీటి మునిగిపోయింది. నిర్వాసితులకు ఆహారం, మంచినీరు, వైద్యం, పారిశుధ్య కొరత ఏర్పడింది. అంటువ్యాధులు వ్యాపిస్తున్నాయి. ముఖ్యంగా చిన్నపిల్లలు వ్యాధుల వల్ల తీవ్ర అనారోగ్య సమస్యలకు గురవుతున్నారు.

## గ్యాస్‌పైప్‌లైన్ అడ్డుకున్న మహిళలు

నైజీరియాలోని విలువైన పెట్రోలియం వనరులు కలిగిన దక్షిణ ప్రాంతంలోని చెవ్రాన్ గ్యాస్ పైపు లైన్‌ను ఆగస్ట్ 20న అక్కడి మహిళలు మూసివేశారు. డెల్టా స్టేట్‌కు చెందిన ఉగ్బోర్డో జాతి మహిళలు తమ పేద జీవన పరిస్థితులకు నిరసనగా, పర్యావరణ నష్టాన్ని పూరించాలని డిమాండ్ చేస్తూ, విద్యుత్ సదుపాయం ఇవ్వాలని కోరుతూ పైప్‌లైన్‌ను మూసివేశారు. తమ వనరులను దోచుకుంటూ, తమకు మాత్రం కనీస సదుపాయాలు కూడా కల్పించకపోవడం వల్లనే ఆ పని చేసినట్లు తెలిపారు. చెవ్రాన్ అధికారులు దీనిపై స్పందించడానికి నిరాకరించారు.

## యుద్ధనీతికి లోబడే దాడి

గత ఏడాది ఆగస్ట్ 21న కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఫిలిప్పైన్స్‌కు చెందిన నేషనల్ పీపుల్స్ ఆర్మీ (ఎన్.పి.ఎ.) ఉత్తర సమర్ ప్రాంతంలో పోలీసులపై చేసిన దాడి సరైందేనని ఆ పార్టీ ప్రకటించింది. రాష్ట్రపతి సలహాదారుడు టెరిసిటా డెలెస్ ఆ చర్య వల్ల చర్చలకు విఘాతం కలిగిందనడం హాస్యాస్పదం అని ఆ ప్రకటనలో పేర్కొంది. పోలీసు బృందాన్ని లొంగిపొమ్మని హెచ్చరించినా వినకపోవడం వల్లే ఎన్.పి.ఎ. దాడి చేయాల్సి వచ్చిందని తెలిపింది. జాతి విముక్తి కోసం, సామాజిక న్యాయం కోసం, పీడిత ప్రజల ప్రయోజనాల కోసం ప్రజా యుద్ధాన్ని ముందుకు తీసుకువెళ్లే క్రమంలోనే ఈ చర్య జరిగినట్లు కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ ఫిలిప్పైన్స్ అన్నది. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 జూలై 2010 నుండి 20 ఆగస్ట్ 2010 వరకు అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1738)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | – | 9 | – | 17 | 22 | 20 | 27 | 26 | 7 | 5 | 2 | 2 | – | 8 | 30 | 29 | – | – | – | 4 | 6 |
| హైదరాబాద్ | – | – | – | 17 | 8 | – | – | – | 4 | 5 | 11 | 9 | – | – | 37 | 31 | – | – | – | 7 | – |
| కరీంనగర్ | 2 | 11 | – | 18 | 51 | 34 | 44 | 6 | 1 | 18 | 1 | 2 | 2 | 5 | 25 | 24 | – | – | – | 2 | 1 |
| ఖమ్మం | – | 1 | – | 7 | 15 | 12 | 25 | 9 | – | 5 | 4 | 4 | 4 | 5 | 15 | 12 | – | – | – | – | 1 |
| మెదక్ | – | 3 | 2 | 7 | 5 | 7 | 6 | 4 | – | 2 | 1 | 1 | 3 | 14 | 27 | 21 | – | – | – | – | – |
| నిజామాబాద్ | – | – | – | 8 | 23 | 5 | 8 | 3 | – | 2 | 1 | 4 | – | 8 | 19 | 21 | – | – | – | – | – |
| వరంగల్ | – | – | – | 1 | – | 2 | 7 | 4 | 1 | 5 | – | – | 1 | 1 | 4 | 4 | – | – | – | – | – |
| చిత్తూరు | – | – | – | 11 | 12 | 7 | 8 | – | 2 | 1 | 11 | 9 | 2 | – | 46 | – | – | – | – | – | – |
| కర్నూలు | – | 8 | – | 20 | 17 | 7 | 7 | 4 | 3 | 4 | 3 | 13 | 2 | 15 | 28 | 18 | – | – | – | – | 2 |
| తూర్పు గోదావరి | – | – | 1 | 15 | 17 | 1 | 9 | 1 | – | 6 | 4 | 3 | 2 | 9 | 51 | 33 | – | – | – | – | – |
| గుంటూరు | – | 1 | – | 4 | 9 | 9 | 7 | 6 | 2 | 2 | 8 | 8 | 5 | 3 | 32 | 10 | – | – | – | 1 | – |
| కృష్ణా | – | 1 | – | 7 | 6 | 3 | 3 | 6 | 2 | 1 | 2 | 7 | 4 | 3 | 12 | 3 | – | – | – | – | 2 |
| నెల్లూరు | – | – | – | 5 | 14 | 8 | 5 | 3 | 1 | 7 | 3 | 4 | 2 | 7 | 36 | 17 | – | – | – | – | 1 |
| శ్రీకాకుళం | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | | |
| విశాఖపట్నం | – | – | – | 4 | 7 | – | 2 | – | – | 1 | – | 2 | – | – | 20 | 4 | – | – | – | – | 1 |
| విజయనగరం | – | – | – | 2 | 3 | 2 | – | 3 | 2 | 1 | 2 | 1 | – | 1 | 31 | 8 | – | – | – | – | 3 |
| **మొత్తం** | **2** | **34** | **3** | **143** | **209** | **117** | **158** | **75** | **25** | **65** | **53** | **69** | **27** | **79** | **413** | **235** | **–** | **–** | **–** | **14** | **17** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; వరంగల్ – ఎ.కుమార్; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. అరుణ; విజయనగరం – డి. సుధాకర్

# వీక్షణంలో వ్యాపార ప్రకటనల గురించి....

వీక్షణంలో అచ్చవుతున్న ప్రభుత్వ ప్రకటన గురించి, ఇటీవల అచ్చయిన కొన్ని వ్యాపార ప్రకటనల గురించి కొందరు గౌరవనీయ మిత్రులు తమ అభ్యంతరాలను, సందేహాలను వ్యక్తం చేస్తున్నారు. అటువంటి అభ్యంతరాలే, సందేహాలే మరికొందరు మిత్రులలో, అభిమానులలో కూడ ఉండవచ్చు.

ఏ పత్రిక అయినా అచ్చువేసే వ్యాపార ప్రకటనలతో ఆ పత్రికకు ఏకీభావం ఉండాలనే నియమమేమీలేదు. ఆ వ్యాపార ప్రకటనలను స్వీకరించడమా లేకపోతే, నడపడానికి తగిన ఆర్థిక వనరులు లేక పత్రిక మూసివేయడమా అనే సవాలు వచ్చినప్పుడు చాలా పత్రికలు ప్రకటనలు స్వీకరిస్తాయి. ప్రస్తుత పరిస్థితుల్లో కేవలం అమ్మకాల ఆదాయం మీద మాత్రమే ఆధారపడి ఏ పత్రికా నిలదొక్కుకోవడం సాధ్యం కాదు. అమ్మకాల ద్వారా వచ్చే ఆదాయం పత్రిక ఉత్పత్తి వ్యయంలో కొంతభాగాన్ని మాత్రమే పూరించగలుగుతుంది. అందువల్లనే చాలా పత్రికలు సాధారణంగా వ్యాపార ప్రకటనల ద్వారా ఆ లోటును పూరించుకోవడం మాత్రమే గాక లాభాలు కూడ చేసుకుంటాయి. వీక్షణం వంటి ప్రత్యామ్నాయ పత్రికలకు లాభాలేమీ అవసరం లేదు. పత్రిక ఉత్పత్తి వ్యయం, సిబ్బంది కనీస జీతభత్యాలు లాంటి మనుగడకు అవసరమైన ఆర్థిక వనరులయినా కావాలి. అందుకోసం కొన్ని వ్యాపార ప్రకటనలనయినా అంగీకరించకతప్పడం లేదు.

ప్రభుత్వం ఇచ్చే ప్రకటనలన్నిటినీ పెద్ద పత్రికలు, పాలకపార్టీ ఆశ్రిత పత్రికలు, పైరవీకారులు కబ్జా చేస్తున్నారని, ఆ ప్రకటనల విధానంలో పారదర్శకత ఉండాలని, చిన్న పత్రికలకు ప్రాధాన్యత ఉండాలని ఎంతో కాలంగా ఆందోళన జరిగిన ఫలితంగా కొన్ని సంవత్సరాల కింద ప్రభుత్వ ప్రకటనలలో చిన్న పత్రికలకు తప్పనిసరిగా కొంతభాగం కేటాయించాలనే నిబంధనలు అమలులోకి వచ్చాయి. అందువల్ల వీక్షణంకు వస్తున్న ప్రభుత్వ ప్రకటన చిన్న పత్రికల హక్కుగా వస్తున్నదే తప్ప వీక్షణంలో అచ్చయ్యే రచనల మీద ప్రభావం వేయగలిగినది కాదు. నిజానికి ఆ ప్రకటన వల్ల వీక్షణం తన వైఖరిలో ఎప్పుడయినా ఏ మెతకవైఖరినయినా ప్రదర్శించి ఉంటే ఎవరయినా దాన్ని ఎత్తిచూపి సరిదిద్దవచ్చు. ఆ ఇచ్చే ఒక్క ప్రకటన కూడా ప్రతి సంచికకూ ఇవ్వడం లేదు. ఆ ప్రకటన ఉన్నప్పుడు కూడా వీక్షణం లోటులో మూడోవంతు మాత్రమే పూరించ గలుగుతుంది. ప్రతి నెలా కనీసం మరి రెండు ప్రకటనలు వేస్తే గానీ వీక్షణం ఆదాయ వ్యయాలు సమానం కావు.

పత్రిక నిర్వహణ కొరకు వ్యాపార ప్రకటనలను స్వీకరించకతప్పని దుస్థితిలో అవి రచనల మీద ప్రభావం వేయకుండా జాగ్రత్త పడడం తప్ప ప్రస్తుతానికి మరేమీ చేయగల అవకాశం లేదు. వ్యాపార ప్రకటనలను ఎంతమాత్రం స్వీకరించబోమని ప్రకటించాలంటే పత్రికకు విస్తారమైన ప్రజాసంఘీభావం ఉండాలి. అది ఆర్థిక స్వావలంబనగా మారగలిగిన స్థితి ఉండాలి. లేకపోతే కొంతకాలం విరాళాల మీదనో, అప్పుల మీదనో నడిపి ఆ తర్వాత పత్రికను ఆపివేయడం మినహా మరోమార్గం లేదు. ఈ అంశాలను పాఠకుల, అభిమానుల దృష్టికి తీసుకురావడం మా బాధ్యతగా భావిస్తున్నాం.


వివరాలకు సంప్రదించవలసిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

ఫాక్స్, ఫోన్ : 040-66843495, సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www:veekshanam.wordpress.com

Advt.

